అపరాధ పరిశోధన అనుబంధం—12

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అంతులేని సంపదలు

రచన: రమణశ్రీ

## మతిపోయిన యువతి!

రచన: అజీజ్

## నరకం-నరలోకం

రచన: సుజనశ్రీ

## హంతకులకు ఆతిథ్యం!!

రచన: ఏ. వీ. మోహన్‌రావ్

"ఖైదీ" సీరియల్ - ఏడవ భాగము

# అపరాధ పరిశోధన సప్లిమెంట్—12

డిసెంబరు, 1974
వెల: రు. 3_00
ఏడాది చందా 39 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు



కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైద్రాబాద్_29
ఫోన్—36959

ముద్రణ:

**క్రాంతి ప్రెస్**
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# అంతులేని సంపదలు

## రమణశ్రీ

"మరోసారి చెప్పండి?" కుర్చీలోంచి కొంచం ముందుకి వంగి కుతూహలంగా అడిగాడు ది గ్రేట్ స్మగ్లర్ మస్తాన్.

చిన్నగా మందహాసం చేసాడు ప్రొఫెసర్ ధనంజయ.

గ్లాసులోకి విస్కీ వంపుకొని చప్పరిస్తూ మెల్లగా చెప్పసాగాడు:

"హిందూ మహాసముద్రంలో పశ్చిమంగావున్న సింహళ ద్వీపం ముత్యాలకు ప్రసిద్ధి అని మీకు తెలుసు. ఆ లంకకు యీశాన్యంగా వెళితే మన్నార్ అఖాతం వస్తుంది. ఆ సముద్రప్రాంతంలో మూడువందల అడుగుల లోతులో లెక్కలేనన్ని ముత్యాలు వున్నాయి. వాటి విలువ అనంతం.

అంతేకాదు, అక్కడి ఇసుకలో 30 శాతం బంగారం వుంది. 50 శాతం వెండి వుంది. ఆ ప్రాంతంలో రత్నాలు, మాణిక్యాలు, మరకతాలు కోకొల్లలు. ఈ సంపదనంతా స్వంతం చేసుకోవడానికి నా దగ్గర ఓ పథకం వుంది" ఓ క్షణం ఆగాడు ధనంజయ.

ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేశాడు మస్తాన్.

"ఇది చాలా ఆశ్చర్యంగా వుంది. ఈ విషయాలన్నీ మీకెలా తెలుసు? వీటినెంతవరకు నమ్మవచ్చునో ఆధారాలున్నాయా?"

"నేను ప్రకృతి శాస్త్రంలో ప్రొఫెసర్‌ను. గత పదేళ్ళుగా నేను సాగించిన పరిశోధన ఫలితమే యీ వివరాలు. ఈ విషయంలో పొరబాటులేదు. అంతేకాదు, మరో ముఖ్యమైన విషయంగూడా వుంది. ఆ విషయం మీకు తెలిసే వుంటుంది."

"ఏమిటా విషయం?"

"1756వ సంవత్సరంలో సింహళంనుంచి కొన్ని కోట్ల రూపాయల విలువగల బంగారంతో బయలుదేరిన 'గోల్డ్ షిప్' ఓడ సరిగ్గా యీ మన్నార్ అఖాతంలోనే మునిగిపోయింది. అవునా?"

"ఎస్. యు ఆర్ కరక్టు" చటుక్కున అన్నాడు మస్తాన్.

"అప్పటినుండి చాలామంది ఆ నావ శిథిలాలకోసం, అందులో చిక్కుబడిపోయిన బంగారంకోసం అన్వేషణ సాగించారు. అయితే ఎవరికీ ఆధారాలు కూడా దొరకలేదు. దాంతో ఆ నావ అక్కడకాదు, మరెక్కడో మునిగిపోయుంటుందని తీర్మానించుకున్నారు. ఇక యీ శతాబ్దంలో దానిగురించి ఎవరూ అన్వేషణ జరపలేదు" ఖాళీ విస్కీ గ్లాసు టేబుల్‌పైపెట్టి కుర్చీలో వెనక్కి

వాలుతూ చెప్పాడు ధనంజయ.

"అయితే ఆ నావ మన్నార్ అఖాతంలోనే మునిగి పోయిందంటారా మీరు?" అడిగాడు మస్తాన్.

"నిస్సందేహంగా! అయితే దాని ఆచూకి తెలుసుకో లేకపోవడానికి చాలా కారణాలు వున్నాయి. ఉదాహర ణకు, మీరు ముత్యాలు ఎంత లోతుకు వెళ్ళి సేకరిస్తారు?"

"30 నుండి 40 అడుగుల లోతుకు వెళ్ళి సేకరిస్తాం?"

"కరెక్టు! అంతకన్నా ఎక్కువ లోతుకు మీరు వెళ్ళ లేరు. అసలు ఆ లోతుకు వెళ్ళడమే కష్టంతో కూడుకున్న పని కదా! అదీ సాహసించినా, నవ రంధ్రాల వెంట రక్తం స్రవించి లోపలే మరణిస్తాడు. మరి కేవలం 30 అడుగుల లోతులో అరనిమిషంలో నావ జాడ కనిపెట్టడం ఎంత తెలివి తక్కువ పనో చూడండి. అక్కడి సముద్రం లోతు 300 అడుగులు వుంటుంది. కాలగర్భంలో ఇన్ని శతాబ్దాలు గడిచాక ఆ నావ ఇంకా 30 అడుగుల లోతులోనే వుంటుందనుకోవడం నిజంగా ఫూలిష్ థింకింగ్. ఆ నావ ఎప్పుడో సముద్ర గర్భంలో అట్టడుగుకు వెళ్ళిపోయి వుంటుంది."

"ఆ నావను ఇప్పుడు చేరుకోవడం సాధ్యమేనా?" ఉత్సాహంగా అడిగాడు మస్తాన్.

"ఆఁ. నా పథకం ప్రకారం 300 అడుగుల లోతులో వున్న ఆ శిధిల నావను చేరుకొని అందులోని బంగారాన్ని పైకి సురక్షితంగా తీసుకురావచ్చు" గర్వంగా చెప్పాడు ధనంజయ.

"ఆ పథకం ఏమిటి? చెప్పండి? కుతూహలంగా అడి గాడు మస్తాన్.

"సారీ, అప్పుడే చెప్పను. మీరు నాతో ఒక ఒప్పం దానికి వస్తే, అప్పుడు నా పథకం మొత్తం వివరించి

చెబుతాను."

మస్తాన్ ఓసారి అనుమానంగా చూశాడు ప్రొఫెసర్ ధనంజయ వైపు.

"క్షమించాలి, ఒక ప్రశ్న అడుగుతున్నందుకు. ఈ విషయంలో అసలు మీరు నా దగ్గరకు ఎందుకు వచ్చారు?"

చిన్నగా నవ్వాడు ధనంజయ.

"డియర్ మస్తాన్, ఈ పథకాన్ని రచించడమైతే రచించాను కానీ, దానిని విజయవంతం చేయడానికి చాలా మందీ, మార్బలం కావాలి. నన్ను నమ్మి పెట్టుబడి పెట్ట గలిగే వ్యక్తి కావాలి. అంతేకాదు, ఆ సంపదను బయటకు చేరవేయడానికి కూడా నాకొక తెలివైన సహచరుడు కావాలి. అందుకే ఆలోచించాను. దీనికి స్మగ్లర్ కింగ్ వైన నువ్వే సమర్థుడవని తోచింది. అందుకే నిన్ను కలిశాను."

"మరో అనుమానం, మీరు ఎంతో విజ్ఞానవంతులు. మరి మీ పరిశోధనా ఫలితాన్ని ప్రభుత్వంవారికి తెలియ చేస్తే, మీకు కావలసిన సహాయం ప్రభుత్వమే చేయగలుగు కదా?"

చిన్నగా నవ్వాడు ధనంజయ.

"మిష్టర్ మస్తాన్, ఈ ప్రశ్నను నువ్వు నిగూఢమైన అర్థంతో అడుగుతున్నావో, అమాయకంగా అడుగు తున్నావో అర్థం కావడంలేదు. నిజమే, యీ పరిశోధనా సారాన్ని ప్రభుత్వంవారికి ఇవ్వొచ్చు. అప్పుడు ప్రభుత్వం ఇచ్చేది ఏమిటి? కేవలం బిరుదులు, సన్మానాలు. కానీ నా పథకం విజయవంతమైతే, ఆ సంపదతో ఒక్క యీ ప్రభుత్వాన్నే కాదు, ప్రపంచాన్నే స్వాధీనం చేసుకో వచ్చు."

"వెరీనైస్ థింకింగ్ ప్రొఫెసర్ జీ! మీతో నేను ఏ రకంగా సహకరించగలనో చెప్పండి? మీ నిర్ణయాలకు

నేను బద్ధుడనై వుంటాను. ఈ విశ్వ సామ్రాజ్యాధిపత్యంలో నాకూ భాగస్వామ్యం ప్రసాదించండి" మెరుస్తున్న కళ్ళతో అన్నాడు మస్తాన్.

"విత్ ప్లెజర్! ఈ క్షణంనుండి మనిద్దరం భాగస్తులం. పథకం నాది, పరిశ్రమ నీది, ఫలితం ఇద్దరిదీ. ఓ. కె?"

"ఓ. కె!" షేక్ హాండ్ ఇస్తూ సంతోషంగా అరిచాడు మస్తాన్.

## 2

"మిస్టర్ మస్తాన్, నా యీ బృహత్పథకం విజయవంతమైతే కష్టానికి లక్షల రెట్లలో ఫలితం వస్తుంది. ప్రపంచంలో సార్వభౌమ నామధేయుడ్ని అవుతాను. ఆల్ రైట్ పథకంలో ప్రాథమిక వివరాలు చెబుతాను వినండి.

మన యీ ప్రయత్నం సఫలీకృతం కావడానికి దాదాపు రెండు సంవత్సరాల కాలం పట్టవచ్చును. ఈ సమయంలో మనతో పూర్తిగా సహకరించడానికి, సముద్రయానంలో సిద్ధహస్తులైన 50 మంది కావాలి. అంతేగాక మన అన్వేషణ విజయవంతంగా కొనసాగించడానికి వీలుగా ఒక జలాంతర్గామి కావాలి.

"వాట్? జలాంతర్గామిని సంపాదించడం చాలాకష్టం కదా?" అడిగాడు మస్తాన్.

చిన్నగా నవ్వాడు ధనంజయ.

"నిజమే! సంపాదించడం కష్టమే! అందుకే స్వయంగా మన మొక సబ్ మెరీన్ను నిర్మించుకోవాలి. అంతేకాదు, ఒకవేళ సంపాదించకలిగినా ప్రస్తుత జలాంతర్గామి మన కెందుకూ పనికిరాదు. దానికన్నా ఎంతో పటిష్టమైన జలాంతర్గామిని మనం సమకూర్చుకోవాలి. ఎందుకనంటే,

మన ప్రయాణం రహస్యంగా కొనసాగాలి కాబట్టి. ప్రస్తుత జలాంతర్గామిలో అయితే, సముద్రంలో 100 అడుగులకు మించిన లోతులో ప్రయాణించలేము. అంతేకాక, కనీసం మూడురోజుల కొకసారి ఏదైనా హార్బర్‌లో ఫ్యూయల్‌ను నింపుకోవాలి. అది మనకు కష్టతరమైన పని.

అందుకే ఒక పటిష్టవంతమైన జలాంతర్గామిని తయారు చేయడానికి రూపకల్పన చేశాను. అందులో మనం ఎంత కాలమైనా సాగరగర్భంలో ప్రయాణించడానికి అనువైన ఏర్పాట్లు వుంటాయి. అంతేగాక మనం తయారుచేసే సబ్‌మెరీన్ సముద్ర గర్భంలో 300 అడుగుల లోతులోనైనా సరే సురక్షితంగా ప్రయాణం సాగిస్తుంది. అవసరమైన ఇంధనాన్ని దానికదే సమకూర్చుకుంటుంది. అయితే ఓడకు వలెనె దీనికిగూడా కొంతమంది సరంగులు కావాలి" ఓక్షణం ఆగాడు.

ఆశ్చర్యంగా చూశాడు మస్తాన్.

"మనం జలాంతర్గామిని నిర్మించడమా? మీ మాటలు చాలా వింతగా వున్నాయి."

"ఇందులో వింత ఏమీలేదు మిస్టర్ మస్తాన్! మానవ మేధస్సుకు పదును పెడితే, అది చేయలేని కార్యం వుండదు. మీ చేతనే ఆ జలాంతర్గామిని నిర్మింపచేస్తాను, చూడండి" చిన్నగా నవ్వుతూ అన్నాడు ధనంజయ.

"ఎలా? వివరంగా చెప్పండి?" కుతూహలంగా చూశాడు మస్తాన్.

ధనంజయ ప్రక్కనేవున్న ఓ షెల్ఫ్‌లోంచి పెద్ద మాప్ తీసి టేబుల్‌పై పరిచాడు. ఆ మాప్‌పై సబ్‌మెరీన్ స్కెచ్ గీసివుంది. పాయింటర్ అందుకుని వివరంగా చెప్పసాగాడు.

"ఇది మనం నిర్మించబోయే జలాంతర్గామి నమూనా

చిత్రం. దీని ఆకారం స్థూలంగా చెప్పాలంటే, సముద్ర జంతువులలోకెల్లా పెద్దదైన 'డాల్ఫిన్' ఆకారంలో వుంటుంది. ప్రకృతిగాలిని పీల్చుకోవడానికి మనం పైకి వచ్చినపుడు, చూపరులకు మన జలాంతర్గామి కేవలం డాల్ఫిన్ లాగానే వుంటుంది. కాబట్టి వారు అనుమానించడానికి ఆస్కారముండదు. అందువలనే ఆ డిజైను ఎన్నుకున్నాను.

జలాంతర్గామి పూర్తిగా ఉక్కుతో తయారుచేయబడుతుంది. దీని పొడవు 116 అడుగులు. వెడల్పు 13 అడుగులు. ఇది 25,000 అడుగుల నీటిని ఆక్రమించుకుంటుంది. ఈ జలాంతర్గామి మొత్తం బరువు 200 టన్నులకు మించకుండా వుండాలి.

జలాంతర్గామిలో ముందువైపు 'వాటర్ బాక్సెస్'ను నిర్మించాలి. వాటిని కావలసినప్పుడు నీటితో నింపడానికి, ఉన్న నీరు కాళీ చేయడానికి తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. జలాంతర్గామి నీటిలో వుండే స్థితి వాటర్ బాక్సెస్ పై ఆధారపడి వుంటుంది. వాటర్ బాక్స్‌లను నీటితో పూర్తిగా నింపగానే, జలాంతర్గామి సముద్రం లోపలకు మునిగిపోతుంది. తరువాత ఒక్కొక్క తొట్టిని కాళీ చేస్తున్నప్పుడల్లా, పైకి తేలుతూ వస్తుంది.

"ఇకపోతే ఈ జలాంతర్గామిని నడపడానికి పెట్రోల్, డీసెల్ వంటి ఇంధనాలను సమకూర్చుకోవడం చాలా కష్టమైన పని. అందుకే జలాంతర్గామిని ఎలక్ట్రిసిటీతో నడపడానికి ప్లాన్ వేశాను." ఒక్క క్షణం ఆగి సిగరెట్ అంటించుకున్నాడు ధనంజయ.

ఆశ్చర్యంగా చూశాడు మస్తాన్.

"వాట్ ప్రొఫెసర్? మీరు మాట్లాడుతున్నది నాకేమీ అర్థం కావడంలేదు. మనకు సముద్ర మధ్యంలో, సాగర

గర్భంలో విద్యుచ్ఛక్తి ఎక్కడినుండి సరఫరా అవుతుంది?" అడిగాడు.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ ధనంజయ.

"మెడియర్ మస్తాన్, నేనేమీ సముద్రంలో విద్యుత్కేంద్రం స్థాపించబోవడం లేదు. భూ ప్రపంచంతో సంబంధం లేకుండానే విద్యుత్‌ను తయారుచేసే విధానం వుంది.

సముద్రపు నీటినుండి ఏమేమి వస్తువులు లభిస్తాయో మీకు తెలుసా? నేను రెండు సంవత్సరాలు నిరంతరం పరిశోధన సాగించి ఆ వస్తువుల గురించిన సమాచారం సంపాదించాను. వాటి ఆధారంగా విద్యుత్‌ను తయారు చేసుకోవచ్చు. మీకు ఆ ప్రక్రియ వివరిస్తాను చూడండి.

ఒక 100 గ్రాముల సముద్ర నీటిలో 9.65 సెంటి గ్రాముల స్వచ్ఛమైన నీరు, 0.2 సెంటిగ్రాముల క్లోరాయిడ్ వుంటుంది. మిగిలిన దానిలో మెగ్నీషియా, పొటాసియం క్లోరైడ్, మెగ్నీషియం బ్రోమైడ్, సల్ఫేట్, కాల్షియం కార్బనేట్‌లు వుంటాయి.

విద్యుదుత్పత్తిలో ఎక్కువగా సోడియం క్లోరైడ్ వుపయోగకరమైనది. సోడియంలో పాదరసం కలిపితే తేజస్సు వస్తుంది. మనం కొంత పాదరసాన్ని ఇక్కడి నుండి తీసుకువెళితే అది ఎన్నటికీ తరగదు. సోడియం తరిగినప్పుడల్లా 'సీ' నుండి సంపాదించుకోవచ్చును.

ఇకపోతే, మామూలుగా ఆక్సిజన్ సిలిండర్లను వుపయోగించుకుంటూ ప్రయాణం సాగిస్తాం."

ఆశ్చర్యంగా చూస్తూ వింటున్నాడు మస్తాన్.

"ఇవి స్టీరింగ్ ఫాన్స్. వీటి నుపయోగిస్తూ సబ్‌మెరీన్ డైరెక్షన్స్ మార్చుకోవచ్చును. ఈ ఫాన్సుకూడా మనం తయారుచేసే విద్యుత్‌తోనే పనిచేస్తాయి.

అంతేగాక, జలాంతర్గామి నీటిలో మునిగి వున్నప్పుడు కూడా, మనం పరిసరాలను స్పష్టంగా చూడవచ్చును. అందుకు అనుగుణంగా హై కాస్ సెంట్రేటెడ్ మిర్రర్స్‌ను ఏర్పాటు చేసుకోవాలి.

ఇక్కడ ఎలక్ట్రానిక్ రిఫ్లెక్టర్‌ను అమర్చాలి. మనం ఫోకస్ చేసే విద్యుత్ తరంగాలు ఆ రిఫ్లెక్టర్ పైబడి, అవి ప్రతిఫలించి, దాదాపు ఒక కిలోమీటర్ వరకు సాగర గర్భంలో వెలుగును ప్రసరింప చేస్తుంది."

చకచక చెప్పడం ఆపి గట్టిగా వూపిరి పీల్చుకున్నాడు ధనంజయ.

అప్పటి వరకు ప్రొఫెసర్ సృష్టించిన ఊహా జలాంతర్గామిలో విహరిస్తున్న మస్తాన్ ఉలిక్కిపడి తేరుకుని, ప్రొఫెసర్ వైపు గౌరవంగా చూశాడు.

"యు ఆర్ జీనియస్ ప్రొఫెసర్! మీ మేధాశక్తిని అభినందించడానికి నా శక్తి చాలదు. మీకు ఇంజనీరింగ్ లో కూడా యింత ప్రావీణ్యముందని వూహించలేకపోయాను" అన్నాడు.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ ధనంజయ.

"నేను చాలా కష్టపడి యీ జలాంతర్గామి నమూనాను చిత్రించాను. దీనిని తయారుచేయడం చాలా కష్టమైన పని. ప్రభుత్వానికి తెలియకుండా రహస్యంగా మనకు కావలసిన పరికరాలను సంపాదించడం ఒక ఎత్తు, ఆ పరికరాలతో జలాంతర్గామిని నిర్మించడం ఒక ఎత్తు. ఈపనులకు చాలా హంగుబలం, అంగబలం కావాలి."

"ఎస్ ప్రొఫెసర్! ఇంతటి భారీ ప్రయత్నం రహస్యంగా చేయబూనడం, నా జీవితంలోగూడా యిదే ప్రథమం. అయితే కస్టమ్స్, సెంట్రల్ ఎక్సైజ్ డిపార్ట్‌మెంటులో నాకు మంచి పలుకుబడివుంది. ఈ ప్రయ

త్నంలో వాళ్ళ సహాయం మనకు కావాలంటే తప్పక దొరుకుతుంది."

"నో, ఎట్టి పరిస్థితులలోనూ ఈ విషయం, మూడో కరికి తెలియడానికి వీలులేదు. మనతోబాటు వచ్చే 40 మంది వ్యక్తులకు సబ్ మెరీన్ బయలుదేరేవరకూ మన పథకం గూడా తెలియగూడదు. ఈ మధ్యలో జరిగేపనులకు గూడా ఆ 40 మందినే మనం ఉపయోగించుకోవాలి."

"నిజమే! కానీ పై అధికారులకు తెలియకుండా మా వ్యాపారమే ఒక్కరోజుకూడా జరగదు. అలాంటిది, ఇంతటి బృహత్ప్రయత్నం వారికి తెలియకుండా చేయడం సాధ్యపడుతుందా?"

"నిస్సందేహంగా! అది మన దృఢదీక్షపై ఆధారపడి వుంటుంది. జలాంతర్గామి నిర్మాణానికి నేనొక ప్లాన్ వేశాను. ముందు మీరు నలభైమంది వ్యక్తులను సమీకరించండి. రేపు సాయంత్రానికి రెండులక్షల రూపాయల క్యాష్‌గూడా రెడీచేయండి."

"అలాగే! మీరు వేసిన ప్లాన్ తెలుసుకోవచ్చా?" కుతూహలంగా అడిగాడు మస్తాన్.

"అది పెద్ద ప్లాన్ ఏమీకాదు. సబ్ మెరీన్ నిర్మాణానికి కావలసిన కొన్ని పరికరాలను నేను ముందే సిద్ధపరిచాను. మిగిలిన కొన్నింటికి జపాన్, మలయా దేశముల లోని కంపెనీలకు ఆర్డరిచ్చాను. ఇకపోతే, లక్షదీవులలో ఒకటైన కచాయ్ దీవిని సబ్ మెరీన్ నిర్మాణానికి తగిన ప్రదేశంగా ఎన్నుకున్నాను. అక్కడ యింతవరకు మానవ సంచారమేమీ లేదు. అందువలన ముందు రహస్యంగా ఒక్కొక్క పరికరం అక్కడకు చేర్చాలి. ఆ తరువాత నలభైమంది వ్యక్తులు అక్కడకు చేరుకోవాలి. ఈలోగా ఇంపార్టెంట్ మిషనరీకూడా అక్కడకు చేరుతుంది. అన్నీ

చేరిన వెంటనే నిర్మాణం ప్రారంభిస్తే, ఒక మాసంలో పూర్తి అవుతుంది. తరువాత అక్కడినుండి మన జలాంతర్గామి జలప్రవేశం చేస్తుంది'' చెప్పాడు ధనంజయ.

మస్తాన్ ఆనందంతో ధనంజయవద్ద సెలవు తీసుకొని లేచాడు.

# 3

ప్రొఫెసర్ ధనంజయ అంచనాల మేరకు, కచాయ్ దీవిలో, నెలరోజులలో జలాంతర్గామి తయారయింది.

మస్తాన్ నాయకత్వంలో నలభైమంది, వివిధ వర్గాలకు చెందిన వ్యక్తులు నిరంతర కృషిచేసి, విలువైన జలాంతర్గామి నిర్మాణంలో పాలుపంచుకున్నారు.

ధనంజయ ఆ నెలరోజులూ విశ్రాంతి అనేది లేకుండా శ్రమించాడు. విదేశాలనుండి యంత్రసామగ్రిని రహస్యంగా తెప్పించడం,వాటిని జలాంతర్గామిగా రూపొందించడంలో ప్రధానపాత్ర వహించడం, రెండుసంవత్సరాల సాగర గర్భయాత్రకు తగిన సదుపాయములు సమకూర్చుకోవడం, అన్నీ ప్రొఫెసర్ దగ్గరవుండి చేయించాడు.

జలాంతర్గామి నిర్మాణం పూర్తి అయ్యేటప్పటికి రెండు న్నర లక్షల రూపాయలు వ్యయమైంది.

ప్రొఫెసర్ ధనంజయ, మస్తాన్, ప్రొఫెసర్ ప్రియు రాలు సునీత, మస్తాన్ బేగం ముంతాజ్, ముప్పైమంది సుశిక్షితులయిన సరంగులు, యిద్దరు ఇంజనీర్లు, ఒక డాక్టరు, ఇద్దరు వంటమనుషులు, మొత్తం నలభైమంది జలాంతర్గామిలో ప్రయాణించడానికి సన్నాహాలు పూర్తిచేసు కున్నారు.

జలాంతర్గామి నిర్మాణం పూర్తికాగానే, ఆ దీవిలో చేసుకున్న ఏర్పాట్లన్నింటినీ ఆనమాలుకూడా లేకుండా

ధ్వంసం చేసేశారు.

ఒక శుభ ముహూర్తంలో ప్రొఫెసర్ ఆదేశానుసారం జలాంతర్గామి సముద్రంలోకి ప్రవేశపెట్టబడింది.

"మిష్టర్ మస్తాన్, ఇది మనకు చిరస్మరణీయమైన రోజు. మనం సాధించబోయే ప్రపంచాధిపత్యానికి యిదే పునాది" జలాంతర్గామి క్రమేపీ నీటిలోకి మునిగిపోతుండగా అన్నాడు ధనంజయ.

"అవును ప్రొఫెసర్! నాకు చాలా ఆనందంగావుంది. అంతులేని సంపదకు వారసులం కాబోతున్న మన చెలిమి కలకాలం నిలవాలని ఆశిస్తున్నాను. ఛీర్స్" విస్కీగ్లాసు అందిస్తూ అన్నాడు మస్తాన్.

"వెల్ సెడ్ మస్తాన్! మన ఈ పథకం జయప్రదమైతే, విశ్వ విఖ్యాత చక్రవర్తులం మనమే! ఆల్ రైట్, మీరు మీ బేగంతో మీకు కేటాయించిన రూంలో గడపండి. ఆ గదిలో ఏర్పాటుచేసిన ప్రివ్యూ మిర్రర్స్ద్వారా, ఆరోజు నాగదిలో చూసిన చిత్రాలను మరోసారి సజీవంగా దర్శించండి" చెప్పాడు ధనంజయ.

"విత్ ప్లెజర్. థాంక్యూ!" తమ గదిలోకి నడిచాడు మస్తాన్, ముంతాజ్ను వెంటబెట్టుకుని.

ధనంజయ ప్రక్కనే కూర్చొనివున్న సునీతవైపు చూశాడు.

సునీత నిశ్చలమైన సముద్ర గర్భంలో జలాంతర్గామి లేపే అలజడిని చూస్తూ ఆనందిస్తోంది.

"సునీ" పిలిచాడు ధనంజయ.

ఉలిక్కిపడి చూసింది సునీత. నవ్వుతూ ధనంజయ కనబడ్డాడు.

"డియర్, ఈ సుందర దృశ్యాలు చూశావా? సముద్ర గర్భంలోకి చొచ్చుకు వస్తున్న సూర్య కిరణాలు ఎలాంటి

వింత కాంతులను వెదజల్లుతున్నాయో! అటు చూడు డియర్, ఆ రంగు రంగుల చేపలు ఎంత నయనానందకరం కావిస్తున్నవో!" పరవశంగా అంది.

చిన్నగా నవ్వుతూ సునీత నడుంచుట్టూ చేతులువేసి దగ్గరకు లాక్కున్నాడు ధనంజయ.

"సునీ, నేను యింత కష్టపడింది ఎవరికోసమో తెలుసా? నేటికి నా కృషి ఫలించింది. నీ కళ్ళలో మెరుపు అనుక్షణం చూడాలనే నా ఆకాంక్ష!" ముద్దుపెట్టుకుంటూ అన్నాడు.

"డియర్, అటుచూడు" చూపించింది సునీత ఒక వైపు భయంగా.

రెండు పెద్ద హ్వేల్ చేపలు జలాంతర్గామిని చూసి అదేదో జంతువనుకొని వేగంగా పరిగెత్తుకు వస్తున్నాయి.

"డోంట్ ఫియర్ సునీ! మన జలాంతర్గామి చుట్టూ అరఫర్లాంగు దూరంవరకు విద్యుత్ వలయం వుంటుంది. ఆ వలయాన్ని ఛేదించుకుని ఏ జంతువూ మనదగ్గరకు రాలేదు."

"థాంక్ గాడ్!" గుండెలపై చేతులు వేసుకొని నిట్టూర్చింది.

భీతహరిణిలా చూస్తున్న సునీతను చూడగానే ధనంజయలో ఆవేశం కట్టలు తెంచుకుంది. ఒక్కసారి బలంగా దగ్గరకు లాక్కుని పెదాలు చుంబించాడు.

## 4

"మిష్టర్ మస్తాన్, కాబిన్‌లోకి వెళదాం రండి" ముందుకు దారితీశాడు ధనంజయ.

మౌనంగా ప్రొఫెసర్‌ను అనుసరించాడు మస్తాన్.

ఇద్దరూ కాబిన్ రూంలోకి నడిచారు.

సరంగుల నాయకుడు జలాంతర్గామి కెప్టెన్ అయిన

రంజిత్ యిద్దర్నీ చూసి అటెంక్షన్‌లో నిలబడి శాల్యూట్ చేశాడు.

"వాట్ మిస్టర్ రంజిత్? ఎలావుంది మూవింగ్?" అడిగాడు ధనంజయ.

"క్వయిట్ వెల్ బాస్! ఇంతకుముందు నేను జలాంతర్గామితో చూడలేనన్ని దృశ్యాలు ఈ సబ్ మెరీన్ ద్వారా చూస్తున్నాను" చెప్పాడు.

"ఆల్ రైట్, సబ్ మెరీన్ పొజిషన్ ఎలావుంది?" అడిగాడు ధనంజయ.

గబగబ మీటర్స్ చూసి చెప్పాడు రంజిత్.

"ప్రస్తుతం 150 అడుగుల లోతులో గంటకు పదిమైళ్ళ వేగంతో ఈశాన్యంగా ప్రయాణిస్తోంది బాస్!"

"వెల్! వేగం పెంచండి. మరో నెల రోజులలో మన్నార్ అఖాతం చేరుకోవాలి. ఇకపోతే, ఆక్సిజన్ పొజిషన్ ఎలావుంది?" అడిగాడు ధనంజయ.

"ఇంకా పదహారు గంటలు వస్తుంది బాస్."

"రైట్! సరిగ్గా మరో పధ్నాలుగు గంటలకు వాటర్ బాక్సెస్ ఖాళీ చేయించండి. సబ్ మెరీన్ పైకిరాగానే ఆక్సిజన్ స్టాక్ చేయండి."

"ఓ. కె. బాస్!"

"మిస్టర్ రంజిత్! ఎప్పుడూ మీటర్స్‌ను జాగ్రత్తగా పరిశీలిస్తుండు. ఏవిధమైన అనుమానం వచ్చినా వెంటనే నన్ను కాంటాక్ట్ అవు. ఓ. కె.?" అన్నాడు ధనంజయ.

"అలాగే బాస్!" చెప్పాడు రంజిత్.

"బాస్, మీల్స్ రెడీ!" కుక్ రాబర్ట్ వచ్చి చెప్పాడు ఇంగ్లీషులో.

"థాంక్యూ. పదండి" కిచెన్ వైపు దారితీశాడు ధనంజయ మస్తాన్‌తో.

అంతా భోజనం చేయసాగారు. ప్రొఫెసర్ భోజనం చేస్తూనే మాప్‌ను పరిశీలిస్తున్నాడు. ఇంకా కొన్ని వేల లీగుల (లీగు=3 మైళ్ళు)దూరం ప్రయాణిస్తే కానీ మన్నార్ అఖాతం రాదు.

మన్నార్ అఖాతంగురించిన ఆలోచనలో పడిపోయాడు ధనంజయ.

'అక్కడ తన అంచనా ప్రకారం ఆ నావ శిధిలాలు కనబడకపోతే? తమ శ్రమ చాలావరకు వ్యర్థమైపోతుంది. ఎన్ని వేల ముత్యాలు సేకరిస్తేమాత్రం, ఏంవస్తుంది?'

"ప్రొఫెసర్, ఈ కర్రీ చాలా బాగుంది. ఏమిటది?" అడిగాడు మస్తాన్.

ఆలోచనలనుండి వులిక్కిపడి తేరుకుని రాబర్ట్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"అది తాబేలు మాంసంతో వండిన కర్రీ బాస్! ఈ తాబేళ్లు సాధారణంగా ఎక్కడా దొరకవు. ఒక్క స్పెయిన్‌లో మాత్రం ఈ తాబేళ్ళను రాజ వంశీకులు ఎంతో ఖర్చుపెట్టి తెప్పించుకు తింటుంటారు. అక్కడ దీని ఖరీదు వెయ్యిరూపాయలు" చెప్పాడు రాబర్ట్.

"వెరీ ఫైన్, డైలీ ఈ కర్రీ చేయి" మరోవాయి లాగిస్తూ చెప్పాడు మస్తాన్.

"అలాగే బాస్!" చిన్నగా నవ్వాడు రాబర్ట్.

"వాట్ మిస్టర్ మస్తాన్, తాబేలు మాంసం నీకు అంత బాగా నచ్చిందా?" నవ్వుతూ అడిగాడు ధనంజయ.

"అవును ప్రొఫెసర్. మనం తిరుగు ప్రయాణంలో కనీసం ఒకటన్ను తాబేళ్ళనన్నా తీసుకు వెళ్ళాలి" తృప్తిగా త్రేనుస్తూ అన్నాడు మస్తాన్.

అంతలో రంజిత్ గబగబ పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"బాస్, త్వరగా కాబిన్‌లోకి రండి. దూరంగా ఏదో ఓడ సముద్రంలో మునిగిపోతోంది" గాబరాగా అరిచాడు.

భోజనం చేస్తున్న వాళ్ళంతా ఉలిక్కిపడ్డారు. అంతా ఆత్రుతగా కాబిన్‌లోకి పరుగెత్తారు.

ఓ ఫర్లాంగు దూరంలో పెద్ద ఓడ సముద్రంలో మునిగిపోతోంది. అక్కడ కనబడిన ఓ పెద్ద పర్వతాన్ని చూడగానే జరిగినదేమిటో ప్రొఫెసర్ గ్రహించాడు.

"ఈ ప్రాంతంలో సముద్ర గర్భంలో పెద్దపెద్ద పర్వతాలు చాలావుంటాయి. పాపం దురదృష్టవంతులు, ప్రమాదాన్ని గుర్తించలేకపోయారు" చిన్నగా నిట్టూరుస్తూ అన్నాడు ధనంజయ.

"డియర్, అటుచూడండి. ఇద్దరు మనుషులు యింకా బ్రతికే వున్నట్లున్నారు" ప్రివ్యూ మిర్రర్‌లోకి చూస్తూ అరిచింది సునీత.

"అవును ప్రొఫెసర్ జీ, వారిని రక్షించేమార్గమేమన్నా వుంటే త్వరగా చూడండి" ముంతాజ్ అంది.

ధనంజయ ఏమీ మాట్లాడలేదు. అతని దృష్టి ప్రాణాల కొరకు పెనుగులాడుతున్న ఓడలోని ప్రయాణీకులపైలేదు. 'ఆ ఓడలో బంగారమేమన్నా దొరుకుతుందా?' అని ఆలోచిస్తున్నాడు.

"వాట్ ప్రొఫెసర్? వారిని రక్షించేమార్గం లేదా?" అడిగాడు మస్తాన్.

"కమాన్ మస్తాన్, వెంటనే స్విమ్మింగ్ డ్రెస్ ధరించు. వెంటనే మనం ఆ ఓడ దగ్గరకు వెళ్ళాలి" ప్రక్కనేవున్న మరో గదిలోకి నడుస్తూ అన్నాడు ధనంజయ.

డ్రెస్ వేసుకుంటూండగా చెప్పాడు ధనంజయ.

"డియర్ మస్తాన్, ఇప్పుడా ఓడవద్దకు మనం ఎందుకు వెళుతున్నామో తెలుసా? వారిని రక్షించడానికి కాదు. ఆ ఓడలోవున్న విలువైన వస్తువులను సంపాదించడానికి."

ఆశ్చర్యంగా చూశాడు మస్తాన్.

"అవును మస్తాన్. మన ధ్యేయం ధనాన్ని సంపాదించడం. అంతేగానీ అన్యులను రక్షించడంకాదు. సో, ముందే చెబుతున్నాను. మనం సముద్రంలోకి ప్రవేశించిన తర్వాత మాట్లాడటానికి అవకాశం వుండదు. ఓడలోకి ప్రవేశించిన మరుక్షణంనుండి, విలువైన వస్తువుల కొరకు గాలించు. సరిగ్గా గంటలోపుగా తిరిగి జలాంతర్గామిని చేరుకోవాలి. అండర్ స్టాండ్?" చెప్పాడు ధనంజయ.

"ఓ. కె. బాస్!" అన్నాడు మస్తాన్ ఏమీ అనలేక.

మరో అయిదు నిమిషాలలో యిద్దరూ 'సీడోర్' తెరచుకొని సముద్రంలోకి ప్రవేశించారు.

ఇద్దరూ పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ఓడవైపు నడక సాగించారు. అంతకుముందే సముద్రంలో నడక రిహార్సల్స్ చేశారు కాబట్టి, యిద్దరికీ కొత్తగా ఏమీ లేదు.

పది నిమిషాలలో ఓడను చేరుకున్నారు.

ఆ ఓడ ఫ్రాన్స్‌దేశంది. వాళ్ళు వూహించినట్లు పెద్ద విలువైన వస్తువులతో ఆ ఓడ రావడంలేదు. కేవలం పాసింజర్ ఓడ.

'ఏంచేద్దాం?' అన్నట్లు సైగచేశాడు మస్తాన్.

ఓడలోపల అంతా పరిశీలనగా చూశాడు ధనంజయ. ఎక్కడ చూసినా శవాలే! దాదాపు వందమందివుంటారు. కొందరు ఇంకా కొనవూపిరితో మృత్యువుతో పోరాడుతున్నారు. ఒక్కరుగూడా ప్రాణాలను దక్కించుకొన్నట్లులేదు.

శవాలవైపు చూశాడు. అంతా ధనవంతులే కాబోలు,

ఒకొక్కరివద్ద చాలా బంగారపు వస్తువులు వున్నాయి.

గబగబ శవాలవద్దకు నడిచి, వారివంటిపైవున్న వస్తువులను ఒలవడం ప్రారంభించాడు ధనంజయ.

మస్తాన్ కూడా ధనంజయను అనుసరించాడు.

అరగంటలో సేకరించకలిగినన్ని వస్తువులు సేకరించి వెంట తెచ్చుకున్న తోలుసంచులలో భద్రపరిచారు.

'యిక వెళదాం' అన్నట్లు సైగ చేసి ఓడలోంచి ముందుకు నడిచాడు ధనంజయ.

ఫర్లాంగు దూరంలో సబ్ మెరీన్ వూగిసలాడుతూ కన్పిస్తోంది.

సబ్ మెరీన్ వైపు నడుస్తూ వెనక్కి తిరిగి చూశాడు మస్తాన్.

ఓడ మెల్ల మెల్లగా లోపలకు దిగిపోతోంది. ఓడలో చిక్కుబడిపోయిన శవాలు కొన్ని అలాగే ఓడతో శిధిలమై పోతాయి, కొన్ని శవాలు షార్క్ చేపలకు ఆహారమవుతాయి.

పదినిమిషాలలో సబ్ మెరీన్ చేరుకున్నారు ఇద్దరూ.

సీ డోర్ రాగానే, అక్కడే కనిపెట్టుకొని కూర్చొని వున్న సరంగు చటుక్కున డోర్ తెరచి, ఇద్దర్నీ లోపలకు లాక్కొన్నాడు.

ఇద్దరూ డ్రెస్సింగ్ రూంలోకి నడిచి స్విమ్మింగ్ డ్రెస్ విడిచి, మామూలు దుస్తులు ధరించారు.

"ప్రాణాలతో ఎవరూ లేరా?" గదిలోకి వచ్చి ఆత్రంగా అడిగింది సునీత.

"లేరు. అంతా మరణించారు" చెప్పాడు ధనంజయ.

ఇరువురూ తాము తెచ్చిన సొమ్మును రాశిగాపోశారు.

అన్నీ బంగారపు వస్తువులే! వాటి విలువ సుమారు లక్ష రూపాయలు వుంటుంది.

"ఇది మన తొలి సంపాదన" చిన్నగా నవ్వుతూ ప్రకటించాడు ప్రొఫెసర్ ధనంజయ.

ఆ రోజు అంతా ఆనందంగా పెద్ద పార్టీ చేసుకున్నారు.

# 5

"బాస్, ఒకసారి కాబిన్‌లోకి వస్తారా?" గాభరాగా పిలిచాడు కేప్టెన్ రంజిత్.

"వాట్ మిస్టర్, ఏంజరిగింది??" ఆందోళనగా ప్రశ్నించాడు ధనంజయ.

"దిక్సూచిమీటర్ చెడిపోయింది బాస్! మనం ఏ దిక్కు వైపు ప్రయాణిస్తున్నామో అర్థం కావడంలేదు."

అదిరిపోయారు ధనంజయ, మస్తాన్‌లు.

"మైగాడ్!" అంటూ గబగబ కాబిన్‌లోకి పరిగెత్తారు.

దిక్సూచిమీటర్‌లోని పాయింటర్ నిశ్చలంగా వుంది.

ధనంజయ వెంటనే ఇంజనీర్లను పిలిపించాడు.

అర్జునసింగ్ అరోరా, దేవానంద్ బారువా ఇద్దరూ పెద్ద ఇంజనీర్లు. ఇలాంటి విఘాతాలు ముందే వస్తాయని వూహించి, ఆ ఇద్దర్నీ కూడా సబ్‌మెరీన్‌లో వుంచాడు ధనంజయ.

అరోరా, బారువాలు ఆ మీటర్‌ను నిశితంగా పరిశీలించారు. దానిలో పాయింటర్ అతుకుపెట్టడానికి వీలు లేకుండా విరిగిపోయింది. ఎన్నివిధాల ప్రయత్నించినా దిక్సూచిమీటర్ బాగుపడలేదు.

ఇంజనీర్లు ఇద్దరూ పెదవి విరిచారు. సబ్‌మెరీన్‌లోని అందరి గుండెలు ఝల్లుమన్నాయి.

"మిస్టర్ అరోరా, ఆ మీటర్ బాగుపడే వుపాయం లేదా?" అడిగాడు ధనంజయ.

"లేదు బాస్! అన్నివిధాలా ప్రయత్నించాం. మీరూ

ప్రయత్నించి చూడండి" చెప్పాడు అరోరా.

ధనంజయ కూడా ఆ మీటర్‌ను బాగుచేయడానికి ప్రయత్నించాడు. కానీ సాధ్యపడలేదు.

"వాట్ ప్రొఫెసర్, ఇప్పుడెలా?" కంగారుగా అడిగాడు మస్తాన్. అందరి కళ్ళు బేలగా ధనంజయవైపే చూస్తున్నాయి.

ధనంజయ గొంతు సవరించుకుని గంభీరంగా చెప్పాడు.

"డియర్ ఫ్రెండ్స్! నట్టనడి సముద్రంలో మన దిక్సూచి మీటర్ చెడిపోయింది. ఇది చాలా అనూహ్యమైన పరిణామం. దీనికి ప్రత్యామ్నాయ పద్ధతి కూడా ప్రస్తుతం మనదగ్గరలేదు. ఇప్పుడు సబ్ మెరీన్ ఏ దిక్కున ప్రయాణిస్తోందో కూడా తెలియదు. మనం సాగర గర్భంలో దారి తప్పాం. తిరిగి గమ్యాన్ని చేరుకోవడం కష్టమే కావచ్చు. అయితే అధైర్యపడక, ధైర్యంతో దేవుడిపై భారమేసి ప్రయాణాన్ని సాగిద్దాం."

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అందరి గుండెలలో సముద్రం ఘోష పెడుతోంది.

'ఏమిటీ వైపరీత్యం? తిరిగి మనదేశం చేరుకోగలమా? ఈ నట్టనడి సముద్రంలో ఏవైపు ఎంతదూరం ప్రయాణిస్తే భూభాగం తగులుతుంది. అసలు భూప్రదేశాన్ని చూడగలమా?' అందరి హృదయాలలో ప్రశ్నల పరంపరల పరవళ్ళు తొక్కుతున్నాయి.

"ప్రొఫెసర్, నాదొక సలహా" కొంచం ఆగాడు మస్తాన్.

"చెప్పండి!" ప్రోత్సహించాడు ధనంజయ.

"మనం మన ప్రయాణాన్ని కట్టిపెడదాం. లేకపోతే అనంతమైన యీ సాగర గర్భంలో ఎంతదూరమని దారి తెన్నూ లేకుండా ప్రయాణించగలం. అందుకే మన

ప్రయాణాన్ని విరమించి, సముద్రపు ఉపరితలంపై ప్రయాణం సాగిద్దాం. దైవవశాత్తూ ఏ విదేశీ నావయినా మనకు కనబడకపోదు. వారి సహాయాన్ని అర్థించి, మన దేశానికి వెళ్ళిపోదాం.''

ధనుంజయ ఏమీ మాట్లాడలేదు. అతని మస్తిష్కంలో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

'తన పదేళ్ళ పరిశోధనా సారం దిక్సామీటర్‌లో లోపం వలన విఫలం కావలసిందేనా? మన్నార్ అఖాతంలో మరుగున దాగివున్న అనంతమైన సంపద తమకు లేకుండా పోవడమేనా? ఇంత కష్టపడి ప్రణాళిక వేసుకున్న యీ ప్రయాణం విఫలమైతే, తా మీ జన్మలో మళ్ళీ ప్రయాణ సన్నాహాలు చేసుకోలేరు. ఎలా? ప్రయాణం విజయవంతం కావాలంటే ఏం చేయాలి?'

ధనంజయ మనసులో ఓ వ్యూహం తళుక్కుమంది.

''డియర్ ఫ్రెండ్స్! కేవలం సాంకేతికపరమైన, అందులోనూ దిక్సామీటర్ లోపం వలని, మన బృహత్పథకం దెబ్బతినగూడదు. మనం సర్వం త్యజించి యీ ప్రయాణానికి సిధపడ్డాం. అయితే అఖండమైన సంపదను అందుకోవడం, లేదా యీ సాగర గర్భంలోనే కలిసిపోవడం! అంతేగానీ, వెనుతిరిగి వెళ్ళిపోవడమనేది లేదు'' స్థిరంగా చెప్పాడు.

''అదికాదు ప్రొఫెసర్, కనీసం మన్నార్ అఖాతం చేరుకొనే అవకాశం కూడా లేదుకదా? కనీసం ముందు సంపదనన్నా చేజిక్కించుకుంటే, బయటపడే మార్గాన్ని ఆలోచించే పని'' నిరుత్సాహంగా అన్నాడు మస్తాన్.

''అవును. ఇందాకటినుండి ఆ విషయమే ఆలోచిస్తున్నాను. మన్నార్ అఖాతం చేరుకోవడానికి నాకో మార్గం కన్పిస్తోంది'' చెప్పాడు ధనంజయ.

"ఏమిటా మార్గం?" అంతా ఆత్రుతగా ప్రొఫెసర్ వైపు చూశారు.

"ఇప్పుడు సరిగ్గా టైం పదిగంటలయింది. తెల్లవారే వరకు మన ప్రయాణాన్ని నిలుపుదలచేద్దాం. సూర్యోదయానికి ముందుగానే జలోపరి భాగానికి చేరుకొని సూర్యోదయాన్ని పరిశీలిద్దాం. తద్వారా దిక్కులను నిర్ణయించుకొని మన్నార్ అఖాతంవైపు ప్రయాణం సాగిద్దాం. దైవం అనుకూలిస్తే, మనం గమ్యం తప్పకుండా 'మన్నార్' చేరుకోవచ్చు."

ప్రొఫెసర్ మాటలు వినగానే అందరిలో నూతనోత్సాహం చిందులు వేసింది.

"వెల్ బాస్! మీ ఆలోచన అమోఘంగా వుంది. ప్రస్తుత పరిస్థితులలో అంతకన్నా గత్యంతరంలేదు" ఇంజనీర్ బారువా అన్నాడు.

అంతా ధనంజయతో ఏకీభవించారు.

"ఆల్ రైట్ రంజిత్! వెంటనే వాటర్ బాక్సెస్‌ను ఖాళీ చేయించండి" ఆజ్ఞాపించాడు ధనంజయ.

రంజిత్ తలవూపి స్విరంగులవద్దకు నడిచాడు.

అంతా తమ జీవితాలు ఏమవుతాయోనన్న భయాందోళనల తెరలమధ్య మన్నార్ అఖాతంలో బంగారపు కాంతులను వూహించుకొంటూ తమ తమ గదులలోకి నడిచారు.

# 6

"ఏమిటి ప్రొఫెసర్, వ్రాస్తున్నారు?" ప్రొఫెసర్ గదిలోకి వచ్చి అడిగాడు మస్తాన్.

"ఏంలేదు మిష్టర్ మస్తాన్, ఓ పుస్తకం వ్రాస్తున్నాను. మనం ప్రయాణం ఆరంభించిన నాటినుండి జరిగిన విశేషాలను పుస్తక రూపంలో భద్రపరుస్తున్నాను."

"దానివలన ఉపయోగం?" అయోమయంగా అడిగాడు మస్తాన్. అతనికి పుస్తకాల గొడవ తెలియదు. ఎందుకంటే అతనేమాత్రం విద్యావంతుడు కాదు. సాధారణ నావికుడుగా జీవనం ప్రారంభించి స్మగ్లింగ్‌లో కాలూని కోట్లు గడించాడు.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ ధనంజయ.

"ప్రతి పనికి ప్రయోజనం వెంటనే కన్పించదు మిష్టర్ మస్తాన్. ఈ పుస్తకం వ్రాయడంవలన ప్రస్తుతానికి కాలక్షేపం జరుగుతుంది. కొన్ని సంవత్సరాల తరువాత మళ్ళీ యీ పుస్తకంలోని పుటలు తిరగవేస్తూంటే, గతస్మృతుల అలలపై తేలిపోవచ్చు."

"నిజమే ప్రొఫెసర్! ఏలాగైనా మీ ఆలోచనలు వేరు. నా ఆలోచనలు వేరు" చిన్నగా నవ్వాడు మస్తాన్.

ఆ దేసమయంలో జలాంతర్గామి ఒక్కసారిగా భూకంపం వచ్చినట్లుగా కంపించిపోయింది. ఒక్క కుదుపుతో ఆగిపోయింది. లోపల హాహాకారాలు చెలరేగాయి.

ధనంజయ, మస్తాన్‌లు అదిరిపోయారు. గబగబ కాబిన్‌లోకి పరిగెత్తారు.

రంజిత్ ఒంటినిండా చమటలుపట్టి వున్నాయి.

"వాట్ మిష్టర్ రంజిత్? వాట్ హేపెండ్?" కంగారుగా ప్రశ్నించాడు ధనంజయ.

"అటు చూడండి బాస్! జలాంతర్గామి ఏదో చిన్న కొండను ఢీకొంది. ఇంతకుముందునుండీ కూడా మార్గం చాలా అస్తవ్యస్తంగా వుంది. అయినా ఎంతో జాగ్రత్తగా నడుపుకు వస్తున్నాను."

"థాంక్ గాడ్!" తృప్తిగా నిట్టూర్చాడు ధనంజయ.

అయోమయంగా చూశాడు మస్తాన్.

"వాట్ ప్రొఫెసర్? ఓ ప్రక్కన సబ్‌మెరీన్ కొండను

ఢీకొంటే మీరు తృప్తిగా నిట్టూరుస్తున్నారేమిటి?"
చిన్నగా నవ్వాడు ధనంజయ.
"మిష్టర్ మస్తాన్, మన కృషి చాలావరకు ఫలించింది. ఇప్పుడు మనం మన్నార్ అఖాతానికి చాలా దగ్గరలో వున్నామన్నమాట!"
"నిజంగా?" ఆనందంగా అడిగాడు.
"నిజం. మన్నార్ అఖాతానికి వెళ్ళే దారే అస్తవ్యస్తంగా వుంటుంది. ఆ దారిలో ప్రయాణించడం చాలా కష్టంగా కూడా వుంటుంది. మనకు కన్పిస్తున్న దారినిబట్టి, మనం మన్నార్‌కు చాలా దగ్గరలోవున్నట్లు అనుకోవచ్చు."
ఇంజనీర్స్ బాబువా, అగోరాలు కాబిన్‌లోకి వచ్చి ప్రొఫెసర్‌కు శాల్యూట్ చేసి నిలబడ్డారు.
"వాట్ ఇంజనీర్స్, జలాంతర్గామి భారీగా దెబ్బ తిన్నదా? లేక మైనర్ రిపేర్ సరిపోతుందా?"
"చాలా చిన్న రిపేర్ బాస్. ఫాన్స్ చెడిపోతే బాగు చేసేశాం. ఇక సుళ్ళీ ప్రయాణం కొనసాగించవచ్చు" అన్నాడు అగోరా.
"థాంక్యూ" అభినందించాడు ధనంజయ.
జలాంతర్గామి తిరిగి ప్రయాణం ప్రారంభించింది.
మరో వారంరోజులు ప్రయాణం సాఫీగానే నడిచింది. భూప్రపంచంనుండి బయలుదేరి సరిగ్గా సంవత్సరమయింది.
ఆ రోజు దూరంగా కన్పిస్తోన్న ఓ చిన్న దీవివైపు చూస్తూ సంతోషంగా ధనంజయను పిల్చింది సునీత.
"డియర్, ఆ దీవిలోకి వెడదామా?" అడిగింది.
"ఏమిటంత కోర్కె కలిగింది సునీ?" అడిగాడు ధనం-జయ.
"డియర్ భూమిపై కాలుబెట్టి సంవత్సరమవుతోంది. ఇక్కడి దీవులలో మనల్ని గుర్తించడానికి ఎవరూ వుండరు

కదా! ఒకరోజు ఆ దీవిలో మకాంచేద్దాం ప్లీజ్!" ప్రాధేయపడింది.

"ఆల్ రైట్! అలాగే చేద్దాం" అంటూ కెప్టెన్‌ను పిలిచాడు ధనంజయ.

ధనంజయ ఆదేశానుసారం జలాంతర్గామి దీవికి దగ్గరగా వచ్చి ఆగింది.

గబగబ రెండు పడవలు సిద్ధంచేశారు. ధనంజయ, సునీత, మస్తాన్, బేగం ముంతాజ్‌తో సహా మరో పది మంది నావలపై దీవిపైకి బయలుదేరారు.

దీవిని చేరగానే, అంతా ఆనందంగా ఆ దీవిపై అడుగు బెట్టారు.

అది చాలా చిన్న దీవి. బహుసుందరంగా వుంది. కలలో గూడా చూడని వింత వింత పక్షులు చెట్లపై గంతులు వేస్తున్నాయి. చెట్ల కొమ్మలనిండా తేనె తుట్టెలు నిండుగా వున్నాయి. ఖర్జూరపు కాయలు చెట్లకు విరగబడి కాసి వున్నాయి.

అంతా చేతికందినవి తింటూ దీవిలో విహరించసాగారు.

వారి విహారానికి అడ్డు తగులుతూ ఏదో పెద్ద కోలాహలం వినబడింది.

అంతా అదిరిపడి ఆ కోలాహలం వచ్చిన దిక్కువైపు చూశారు.

దాదాపు ఓ నలభైమంది వివస్త్రలయిన సముద్రజాతి వారు చేతిలో బల్లెములతో సందడిచేస్తూవీళ్ళవైపు పరిగెత్తుకుంటూ వస్తున్నారు.

వాళ్ళను చూడంగానే అందరి ప్రాణాలు పైపైనే పోయాయి.

వాళ్ళు ఎవరో వూహించలేకపోయాడు ప్రొఫెసర్ గూడా!

ఏది ఏమయినా ముందు జాగ్రత్త మంచిది. ఆ వచ్చేది మంచివాళ్ళే కావచ్చు, లేక నరరూప రాక్షసులే కావచ్చు.

"క్విక్. ఆ వచ్చేది మనకు శత్రువులే కావచ్చును. గబ గబ మీ నావలవైపు పరిగెత్తండి" హెచ్చరించాడు ధనం జయ.

అంతా తమ తమ చేతులలోవి క్రింద పడవేసి సముద్రం వైపు పరిగెత్తారు.

పదినిమిషాలలో అంతా నావలపైకెక్కి, నావలను కది లించారు.

తృప్తిగా నిట్టూరుస్తూ నావలవైపు పరిశీలనగా చూసిన ప్రొఫెసర్ అదిరిపడ్డాడు.

"స్టాప్!" అరిచాడు.

నావలు రెండు ఆగిపోయాయి.

మొత్తం అందరినీ మరోసారి లెక్కబెట్టాడు. ఇద్దరు తక్కువగా వున్నారు. మరోసారి అందర్నీ పరిశీలనగా చూశాడు, ఆ ఇద్దరు ఎవరా అని?

దీవిపైకి వచ్చిన వారిలో ఇద్దరు, ఇంజనీర్స్ బారువా, అరోరా మళ్ళీ నావలు ఎక్కలేదు. అంటే ఆ దీవిపైనే వున్నారన్నమాట!

అంతా తీరంవైపు మళ్ళీ నావలను తిప్పారు.

దూరంగా రెండు ఆర్తనాదాలు వికృతంగా వినబడే టప్పటికి, ఉలిక్కిపడి అంతా ఆ దీవివైపు చూశారు.

నరమాంస భక్షకులైన ఆ గుంపు, ఇంజనీర్లు ఇద్దరినీ క్రూరంగా విరమకొని తినేస్తున్నారు.

"మైగాడ్!" అంతా ఒక్కసారిగా అరిచారు.

"ప్రొఫెసర్, ఏం చేద్దాం?" ఆందోళనగా అడిగాడు మస్తాన్.

"మనం కొద్దిమందే వున్నాం. ఆ నలభైమందిని ఎదిరించడం చాలా కష్టం. ఇక మన మిత్రులమీద ఆశ వదులుకోవడమే! వారి ఆత్మశాంతికోసం భగవంతుణ్ణి ప్రార్థిస్తూ తిరిగి జలాంతర్గామిని చేరుకోవడమే ఉత్తమం" గద్గద కంఠంతో చెప్పాడు ప్రొఫెసర్.

అంతా నావలను తిరిగి వచ్చినదారివైపు మళ్ళించారు. పదిహేను నిమిషాలలో జలాంతర్గామిని చేరుకున్నారు.

ఆ రాత్రి ఎవరికీ నిద్రపట్టలేదు. అనుకోకుండా ఎదురయిన ఆపద అందరినీ భయభ్రాంతుల్ని చేసింది.

చనిపోయిన ఇంజనీర్ల ఆత్మశాంతికోసం అంతా ఐదు నిమిషాలు మౌనం పాటించారు.

# 7

సూర్యచంద్రులను ఆధారంగా తీసుకొని ధైర్యంగా ప్రయాణాన్ని కొనసాగించారు ప్రొఫెసర్ బృందం.

ఇంజనీర్ల ఘోర మరణ సంఘటన క్రమేపీ అందరి హృదయ ఫలకాలపైనుండి చెరిగిపోతోంది.

అంతా మన్నార్ అఖాతంలో లభించే బంగారాన్ని వూహించుకుంటూ ఉత్తేజితులవుతున్నారు.

మరోవారం రోజులు గడిచాయి.

కాబిన్‌లో కూర్చొని సాగర గర్భంలో విశేషాలు పరిశీలిస్తున్న ప్రొఫెసర్ హఠాత్తుగా లేచాడు. అతని కళ్ళు ఆనందంతో వింతగా మెరిశాయి.

"మస్తాన్!" అరిచాడు గట్టిగా.

కంగారుగా పరిగెత్తుకుంటూ వచ్చాడు మస్తాన్.

"మస్తాన్, మన కృషి ఫలించింది.మన్నార్ అఖాతాన్ని చేరుకున్నాం. ఇక మనకు అడ్డు అన్నది లేదు. ఈ ప్రపంచానికి మనమే కుబేరులం" భుజాలు పట్టుకుని కుదుపుతూ

సంతోషంగా అన్నాడు ప్రొఫెసర్.

"నిజం ప్రొఫెసర్?" కళ్ళలో కాంతులీనుతుండగా అన్నాడు మస్తాన్.

"ఎస్ మిష్టర్ మస్తాన్. అటు చూడండి ముత్యాలు ఎలా కనబడుతున్నాయో?"

ఆత్రంగా చూశాడు మస్తాన్. అతని కళ్ళు తిరిగి పోయాయి.

"అవును ప్రొఫెసర్! అబ్బ! ఎన్ని వేల ముత్యాలు? నా జన్మలో యిన్ని ముత్యాలను చూడలేదు."

"నిజమే మస్తాన్! ఇక ఈ ముత్యాలన్నీ మనవే! ఈ రోజుకు పరిసరాలను జాగ్రత్తగా పరిశీలించి రేపటినుండి సేకరణ ప్రారంభిద్దాం. మరో ముఖ్యవిషయం, ఈ అఖాతం లోనే కొన్ని కోట్లరూపాయల విలువగల బంగారంతో ప్రయాణిస్తున్న 'గోల్డ్ ఫిష్' నావ మునిగిపోయింది. ముఖ్యంగా ఆ నావ శిథిలాలను గూడా మనం అన్వేషించాలి" చెప్పాడు ప్రొఫెసర్ ధనంజయ.

"అలాగే ప్రొఫెసర్!" సుందర దృశ్యాలను పరికిస్తూ పరవశంతో అన్నాడు మస్తాన్.

ధనంజయ తగిన సూచన లివ్వడానికి కెప్టెన్ వద్దకు నడిచాడు.

ఈ విషయం జలాంతర్గామిలోనివారి కందరికీ తెలిసింది. అంతా ఆనందంతో పరవశించిపోసాగారు.

# 8

ఉదయం ఏడుగంటలయింది.

ప్రొఫెసర్ ధనంజయ, మస్తాన్, కెప్టెన్ రంజిత్, మరి ముగ్గురు అనుచరులు సాగరగర్భంలో ముత్యాల సేకరణకు సన్నద్ధులు అయ్యారు.

అంతా స్విమ్మింగ్ డ్రెస్ ధరించారు. ఆక్సిజన్ సిలిండర్స్ భుజాలమీదుగా వీపుకు తగిలించుకున్నారు. నడుం చుట్టూ తోలుసంచులు వ్రేలాడదీసుకున్నారు. సముద్రంలో ప్రత్యేకంగా ఉపయోగించే టార్చిలైట్, తుపాకులను రెడీలో వుంచుకున్నారు.

సాగరగర్భంలోకి ప్రవేశించిన తరువాత తిరిగివచ్చేవరకు మాట్లాడటానికి అవకాశంలేదు.

అందుకే అందరికీ తగిన సూచనలను ముందే ఇచ్చాడు ధనంజయ.

ఏడుగంటల పదిహేను నిమిషాలకు ఆరుగురూ, సీడోర్ తెరచుకొని సముద్రంలో ప్రవేశించారు.

దాదాపు 90 అడుగులు లోపలకు వెళ్ళిన తర్వాత నేల గట్టిగా తగిలింది. బహుశా కొండకావచ్చును. ఎందుకంటే అక్కడ 300 అడుగుల లోతుకూడా వుంది.

ఇక అంతా నడవసాగారు. అందరికీ అది చాలాకొత్తవింత అనుభవం. సముద్రంలో నిర్భయంగా నడుస్తున్నారు, ఆరుగురూ. అందరిదృష్టి పరిసరాలను జాగ్రత్తగా పరికిస్తోంది.

రకరకాల చేపలు, తాబేళ్లు హడావుడిగా తిరుగుతున్నాయి.

కొద్దిసేపటిలోనే ముత్యాలు పుష్కలంగా దొరికే ప్రాంతానికి చేరుకున్నారు.

ఆ ఎగుడు దిగుడు ప్రదేశంలో నడుచుకుంటూ 150 అడుగుల లోతుకు వెళ్ళిపోయారు.

అక్కడి దృశ్యాలు అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఎవరూ కలలోగూడా వూహించని దృశ్యాలు కళ్ళకు స్పష్టంగా కనబడుతున్నాయి.

ఎక్కడ చూసినా ముత్యపు చిప్పలే! లక్షలసంఖ్యలో

వున్నాయి. అన్నీ పెద్ద పెద్ద ముత్యపు చిప్పలు. అందు లోని ముత్యాలు కోట్లుఖరీదు చేస్తాయి.

అంతా అవకాశం ఉన్నంతవరకు ముత్యపు చిప్పలను తోలుసంచులలో భద్రపరచుసన్నారు.

మూడుగంటల సేకరణ పిదప అంతా తిరిగి జలాంత ర్గామివైపు బయలుదేరారు.

జలాంతర్గామికి నాలుగువైపులా ఏర్పాటుచేయబడిన ఫ్లడ్ లైట్స్ దేదీప్యకాంతులను వెదజల్లుతూ, సముద్రంలో ప్రవేశించిన వారికి, దారితప్పే ప్రమాదంలేకుండా తోడ్ప డుతూ వుంటాయి.

మరో గంటలో ఆరుగురూ జలాంతర్గామిని చేరుకు న్నారు.

లోపలకు ప్రవేశించగానే, దుస్తులను మార్చుకొని, తోలుసంచులను క్రింద గుమ్మరించారు.

ఆరుగురూ కలిసి కొన్నివేల ముత్యపు చిప్పలను సేకరిం చారు. అంతా కలిసి ముత్యాలను విడదీసి రాశిగా పోశారు.

అంతా ఆ ముత్యాలనుచూసి ఆశ్చర్యపోసాగారు.

సునీత, ముంతాజ్ ల ఆనందానికి మేరలేకపోయింది. సంతోషం పట్టలేక ఆడుతూ, పాడుతూ నృత్యం చేశారు.

ఆ రోజు మొత్తం విశ్రాంతి అనేది లేకుండా నాలుగు సార్లు సాగరగర్భంలో ప్రవేశించి, లక్షల సంఖ్యలో ముత్యపు చిప్పలను సేకరించారు. జలాంతర్గామిలోని ఒక గదినిండా పెదరాశి పోశారు.

ఆ రాశితో ప్రపంచంలో సగభాగాన్ని తేలికగా కొన వచ్చును.

అయితే, అందరికిగూడా గోల్డ్ ఫిష్ నావ కనబడక పోవడం చాలా నిరాశను కల్గించింది.

"ప్రొఫెసర్, బహుశా ఆ నావ ఈ ప్రాంతాలలోగాక మరో ప్రాంతంలో మునిగిపోయుంటుంది" అనుమానం వెలిబుచ్చాడు మస్తాన్.

"నో. అలా జరగడానికి వీలులేదు మస్తాన్! ఆ నావ గ్యారంటీగా ఈ పరిసరాలలోనే మునిగిపోయుంటుంది. అయినా మనం దానిగురించి అన్వేషించింది బహుతక్కువ. రేపటినుండి మరికొంచెం ముందుకు వెళ్ళి పరిశోధిద్దాం. ఆ నావ కనబడితే చాలు, మన జన్మతరించినట్లే!" ఆశగా అన్నాడు ప్రొఫెసర్.

ఏం మాట్లాడలేదు మస్తాన్. కోట్ల విలువగల ముత్యాలను సేకరించడానికి తోడ్పడిన ప్రొఫెసర్ మాటలు తేలికగా తీసేయడానికి ధైర్యంలేదు. అతనిలోగూడా, ఆ నావ కనబడుతుందేమోనని ఆశగానే వుంది. ఆ ఆశా ప్రపంచంలో విహరిస్తూ ఆ రాత్రికి విశ్రమించారు.

## 9

మన్నార్ అఖాతంలో ప్రవేశించి అయిదు రోజులు దాటింది.

విశ్రాంతితో గూడా నిమిత్తంలేకుండా ఆ అయిదు రోజులూ గోల్డ్ ఫిష్ నావకోసం అన్వేషణ సాగించారు. అయినా ప్రయోజనం కన్పించలేదు. అఖాతంలో దాదాపు మూడువంతులకు పైగా గాలించేశారు.

ఈ అయిదు రోజులలో గణనీయమైన సంఖ్యలో ముత్యాలను, రత్నాలను, వజ్రాలను సేకరించి జలాంతర్గామిలోని రెండు గదులను పూర్తిగా నింపారు.

ఆ రోజు ఉదయం ఏడుగంటలయ్యేటప్పటికి మళ్ళీ నావకొరకు అన్వేషణకై బయలుదేరారు.

ఆ రోజుతో అన్వేషణకు చివరి రోజు అని, ఇక నాగ జాడలు కన్పించకపోతే, సేకరించిన ముత్యాలతో తృప్తిపడి తిరుగు ప్రయాణానికి నాందిపలకవచ్చని, కాబట్టి మరింత శ్రద్ధగా అన్వేషించమని అనుచరులకు వుత్సాహాన్ని నూరిపోస్తూ తగిన సూచనలిచ్చి ముందుకు నడిచాడు ప్రొఫెసర్ ధనంజయ.

ఈసారి పెద్ద పెద్ద రాతిగుట్టలను దాటుకుంటూ ముందుకు నడక సాగించారు.

హఠాత్తుగా ఓ చోట ప్రొఫెసర్ ఆగిపోయాడు. అతని వెనుక వస్తున్న వాళ్ళుగూడా అర్థంగాక ఆగిపోయారు.

ఒక పెద్ద సొరచేప ఓ రాళ్ళగుట్ట చాటునుండి భీకరంగా నోరు తెరుచుకొని ప్రొఫెసర్ మీదకు వురికింది.

అనుక్షణం అప్రమత్తతతో వుండే ప్రొఫెసర్, ఆ విషయం ముందే గమనించి, తుపాకీని సొరచేపకు గురిపెట్టి కాల్చాడు.

తూటా గురితప్పకుండా వెళ్ళి సొరచేప పొట్టలో దిగింది. వరుసగా ఆరు తూటాలు ప్రేల్చాడు. సొరచేప శరీరం తూట్లుపడిపోగా ప్రాణాలు విడిచింది.

మస్తాన్ ప్రొఫెసర్ వైపు కంగారుగా చూశాడు.

సొరచేప చచ్చిపోయిందంటే, చాలా ప్రమాదం. ఆ రక్తం వాసన చూడగానే బోలెడు సొరచేపలు అక్కడకు చేరుకుంటాయి.

ప్రొఫెసర్ వెంటనే ఏంచేయాలో సైగ చేశాడు.

అంతా సొరచేపను గట్టిగా పట్టుకొని, రక్తం కారుతున్న రంధ్రాలను గుడ్డలతో మూసివేసి, ఆ మృతదేహాన్ని రాళ్ళ గుట్టలమధ్య ఆనమాలు గూడా తెలియకుండా పాతిపెట్టేశారు.

తరువాత ప్రొఫెసర్ తృప్తిగా తలపంకించి ముందుకు నడక సాగించాడు.

కొంతదూరం ప్రయాణించిన తరువాత ఓ పెద్ద లోయ కన్పించింది. అంతా ఆ లోయలోకి తొంగిచూశారు.

అంతే, అందరి కళ్ళు ఆనందంతో తళతళ మెరిశాయి.

ఆ లోయలో ఓ నావ పడిపోయివుంది. ఆ నావ శిధిలావస్థలో వుండి గుర్తుపట్టడానికి గూడా వీలులేకుండా వుంది.

అంతా కష్టపడి ఆ లోయలోనికి దిగి నావ వద్దకు నడిచారు.

ఆ నావ దగ్గరకు చేరుకోగానే అందరి హృదయాలు ఆనందంతో గంతులేశాయి.

అదే నావ! గోల్డ్‌ఫిష్ నావ!

ఒక గుట్టగా పడివున్న ఆ నావ శిధిలమైన రేకులను తొలగించి లోపలకు నడిచారు.

అంతా బంగారమే! పెద్దపెద్ద పెట్టెలనిండా ఇటుకల రూపంలో బంగారపు ముద్దలు తళతళ మెరుస్తున్నాయి.

ఆనందం పట్టలేక అంతా ఒకరినొకరు కౌగలించుకున్నారు.

వీలయినంత బంగారం తీసుకొని వెనక్కు మరలారు.

ఆ రోజు రాత్రి జలాంతర్గామిలో పెద్దగా పార్టీ చేసుకున్నారు. ప్రపంచాన్నే జయించినంతగా తృప్తిపడి ఆనందించారు.

ప్రొఫెసర్, మస్తాన్‌లు తమ ప్రేయసిలతో స్వర్గ సౌఖ్యాలను అనుభవించారు.

గోల్డ్‌ఫిష్ ఓడలోని బంగారం మొత్తాన్ని జలాంతర్గామిలోకి చేర్చడానికి పదిహేను రోజులు పట్టింది. దాదాపు పది టన్నుల బంగారం!

ప్రొఫెసర్ పథకం విజయవంతమయింది. అతని పరిశోధన ఫలించి అంతులేని సంపద వారి హస్తగతమయింది.

మొత్తం బంగారం, ముత్యాలు, రత్నాలు, వజ్రాలతో సబ్ మెరీన్‌లో ఖాళీ లేకుండా నింపేశారు.

అందరి కళ్ళు విజయగర్వంతో మెరుస్తూండగా, మస్తాన్ అఖాతానికి గుడ్ బై కొట్టి, జలాంతర్గామి ముందుకు ప్రయాణించసాగింది గర్వంగా!

# 10

మస్తాన్ అఖాతాన్ని వదలి మూడు నెలలు దాటుతోంది.

డిక్సామీటర్ చెడిపోయిన కారణంగా, సూర్య చంద్రులపై భారమేసి జలాంతర్గామి దిశలను మారుస్తున్నారు.

ఒక దారీ తెన్నూ లేకుండా ప్రయాణిస్తోంది జలాంతర్గామి.

మరో రెండు నెలలు గడిచాయి.

అప్పటివరకు తృప్తిగావున్న అందరి హృదయాలలో తిరిగి అశాంతి చెలరేగింది.

ఇంత సంపదను గడించిన తరువాత తిరిగి అసలు ఏ దేశమన్నా చేరగలమా, లేదా? అనే అనుమానంతో అల్లాడిపోసాగారు.

"ప్రొఫెసర్, యీ జలాంతర్గామి ఇండియానే చేరనక్కరలేదు. ప్రపంచంలోని ఏ దేశం చేరినా బాధలేదు. ఈ సంపదతో హాయిగా కాలం గడపవచ్చును" దిగాలుగా అన్నాడు మస్తాన్.

"అవును మస్తాన్! నేనూ అందుకే ప్రయత్నిస్తున్నాను" చిన్నగా నిట్టూరుస్తూ అన్నాడు ధనంజయ.

ధనంజయలో అంతకుముందు కన్పించిన దర్పం, హోదా ఇప్పుడు లేవు. కళ్ళలో బ్రతుకుపై కాంక్ష, సుఖజీవితంపై

ఆశామాత్రం మినుకుమినుకు మంటున్నాయి.

"డియర్, పోనీ ఒక పని చేస్తే?" అడిగింది సునీత.

ఏమిటన్నట్లు సునీత వైపు చూశారు అంతా.

"మనం మానవ ప్రపంచాన్ని చేరుకోలేని ఎడల, ఒక మంచి దీవిని ఎన్నుకొని, ఆ దీవిలోనే సుఖజీవనాన్ని సాగిద్దాం" చెప్పింది.

అయితే ఆ సూచనను చాలామంది నిరాకరించారు.

జీవించడానికి కావలసినది, తిండి, డబ్బేకాదు. సెక్స్ కూడా కావాలి. అందులో నలభైమంది వ్యక్తులలో ఇద్దరికే భార్యలు వున్నారు. మిగిలినవారు?

అందుకే చాలామంది సరంగులు యీ సూచనను నిష్కర్షగా తిరస్కరించారు.

"సారీ మేడం! ఏదో ఒక సంవత్సరమంటే సముద్ర యానానికి ఒప్పుకున్నాం కానీ, జీవితాంతమంటే ఒప్పుకొనే వాళ్ళం కాదు. మాకూ భార్యా బిడ్డలు వారిమీద మమకారాలూ వున్నాయి. ఈ సంపదను అందుకోవడానికి వచ్చింది వాళ్ళను సుఖపెట్టడానికేగానీ, ఇలా అజ్ఞాతంగా వుండిపోవడానికి కాదు" దృఢంగా చెప్పాడు కెప్టెన్ రంజిత్.

"చూడండి కెప్టెన్, మీరంటున్నది నిజమే! అయితే ప్రస్తుత పరిస్థితిని గూడా మీరు ఆలోచించాలి. మనం ఆ నిర్ణయానికి ఎందుకు వచ్చాం? మన దేశాన్ని చేరుకోనేందుకు చేసిన ప్రయత్నాలు విఫలం కాబట్టే గదా! కాబట్టి సునీత గారి మాటలను కూడా తీసివేయడానికి వీల్లేదు" బేగం ముంతాజ్ అంది.

మరికొంతమంది సరంగులు తమ తమ వాదనలను విన్పించారు.

అందరి అభిప్రాయాలు విన్న తరువాత ప్రొఫెసర్

గొంతు సవరించుకొని గంభీరంగా చెప్పాడు.

"డియర్ ఫ్రండ్స్! ప్రపంచంలో ఇంతకుముందు ఎవరూ పూనుకోనటి సాహస కార్యానికి మనం నడుం కట్టాం. అద్భుతమైన వ్యూహ రచనతో బృహత్పథకాన్ని రూపొందించాం. ఆ పథకం దిగ్విజయాన్ని సాధించింది. అనుకున్న ప్రణాళికలను మించి సంపదను సేకరించాం. అయితే, అతిముఖ్యమైన యాంత్రిక లోపం వలన మనం ఒక గడ్డు పరిస్థితిలో చిక్కుకున్నాం.

దిక్సూమీటర్ చెడిపోవడం వలన, అనంత సాగర గర్భంలో అనూహ్య పరిస్థితులమధ్య ఏంచేయాలో తోచని పరిస్థితులలో దిక్కుతోచక వున్నాం.

ఇలాంటి క్లిష్ట సమయంలో ప్రతి ఒక్కరికీ తన అభి ప్రాయాలను వెల్లడించుకొనే హక్కు వుంది. మీ అందరి అభిప్రాయాలను శ్రద్ధగా వింటాను.

మాతృదేశం చేరుకోవాలని, మనం సంపాదించిన సంపదను పదిమందికి గొప్పగా చూపి, దానిని సద్విని యోగం చేయాలని అనుకోవడంలో తప్పులేదు.

కానీ ఎలా? మాతృదేశం కాదుగదా మరో దేశ మేదైనాసరే, సురక్షితంగా చేరే మార్గం వుందా?

లేదు. దైవంపై భారంవేసి ఆరునెలలబట్టి ప్రయాణి స్తున్నాం. గమ్యం కనబడటంలేదు. అందువలన మిత్రులు కొందరు బాధపడటం సహజం. ఇదే సమయంలో కొందరికి సముద్రంపైనే విసుగు పుడుతోంది.

ఈ సమయంలో ఏంచేయాలి? కొందరు చెప్పినట్లు ఏదైనా దీవి మీద నివాసాన్ని ఏర్పాటు చేసుకోవడం సమంజసమేనా? కేవలం ఒక దీవి మీద మనం నివాసం ఏర్పరచుకో దలచుకొంటే, మనం ఇంత శ్రమపడటం, ఇంత సంపదను సేకరించడం వ్యర్థం. మారుమూల దీవిలో

యీ సంపదకు విలువ వుండదు.

అందుకే అన్ని విషయాలు కూలంకషంగా చర్చించి ఈ నిర్ణయానికి వచ్చాను. జాగ్రత్తగా వినండి.

ప్రస్తుతం ఏదైనా మంచి దీవిని ఎన్నుకొని, అక్కడ నివాసాన్ని ఏర్పాటు చేసుకుందాం. ఆ తరువాత వంతుల వారీగా సముద్రంపై ప్రయాణం చేస్తూ, ఏదైనా ఓడ కనబడుతుందేమో వెదకడం ప్రారంభించాలి. మన అదృష్టం బాగుంటే, ఏదో ఓడ కనబడకపోదు. ఆ కెప్టెన్‌కు కొంత బంగారం ఆశచూపి, మన దేశం చేరుకుందాం'' విపులంగా చెప్పాడు ధనంజయ.

ప్రొఫెసర్ మాటను విమర్శించడానికి ఎవరికీ పాయింట్స్ కన్పించలేదు.

అంతా మౌనం దాల్చారు. ఆ మౌనాన్ని అంగీకారంగా తీసుకొన్నాడు ధనంజయ.

"మిస్టర్ రంజిత్, ప్రస్తుతం జలాంతర్గామి ఎంత లోతులో ప్రయాణిస్తోంది?'' అడిగాడు.

మానో మీటర్ వైపు చూసి చెప్పాడు కెప్టెన్.

"300 అడుగుల లోతులో ప్రయాణిస్తోంది.''

"వెల్. వెంటనే వాటర్ బాక్స్‌లను ఖాళీ చేయించండి. సబ్ మెరీన్ పైకిరాగానే మంచి దీవికోసం అన్వేషించండి'' చెప్పాడు ధనంజయ.

"అలాగే బాస్!'' సరంగులవైపు నడిచాడు కెప్టెన్.

అదే సమయంలో ఒక్కసారిగా జలాంతర్గామి కంపించిపోయింది. పెద్ద పెద్ద వురుములు కర్ణభేరులను బద్దలుచేస్తూ వినబడ్డాయి.

అంతా అదిరిపోయారు. కెప్టెన్ పరుగు పరుగున వచ్చాడు.

"వాట్ హేపెండ్?" కంగారుగా అడిగాడు ప్రొఫెసర్.

"సముద్ర కంపం బాస్! ఊహించని విధంగా వచ్చింది. గత్యంతరం లేక జలాంతర్గామిని ఆపు చేశాను" చిన్నగా వణుకుతున్నాడు కెప్టెన్.

"మైగాడ్! జలాంతర్గామిని ఎందుకాపు చేశావ్? సముద్ర కంపము స్తే ఏమవుతుందో తెలుసా?" ఆందోళనగా అంటూ కాబిన్ లోకి పరిగెత్తాడు ధనంజయ.

అప్పటికే అంతా అయిపోయింది. ప్రివ్యూమిర్రర్స లోంచిబయటకు చూసిన కెప్టెన్, ప్రొఫెసర్లు అదిరి పోయారు.

జలాంతర్గామి చుట్టూ పెద్ద పెద్ద రాళ్ళగుట్టలు. బహుశా పైన కూడా పడేవుంటాయి.

వాటర్ బాక్స్లను కాళీ చేయించి మెషిన్స్ను రన్ చేయించాడు ప్రొఫెసర్.

కానీ ఫలితం లేకపోయింది, జలాంతర్గామి వీసమెత్తు కూడా పైకి లేవలేదు.

అంతా ఆందోళనగా కేబిన్ లోకి చేరుకున్నారు.

"నౌ వుయ్ ఆర్ ట్రాప్డ్!" అందరివైపు చూస్తూ చెప్పాడు ధనంజయ.

"మీరనేది నా కర్థం కావడంలేదు" కంగారుగా అన్నాడు మస్తాన్.

"సముద్ర కంపంలో చిక్కుబడిపోయింది మన జలాంతర్గామి. చుట్టూ, పైన కొండలు విరుచుకు పడిపోయినవి. వీటిని చీల్చుకొని పైకిపోవడం మన కిక సాధ్యపడదు. మనం నిర్మించుకున్న సబ్ మెరీన్ లోనే మనం సజీవ సమాధి అయిపోయాం. ఇక సబ్ మెరీన్ లో ఆక్సిజన్

స్టాక్ ఎంతవరకు వస్తే, అంతవరకే మన జీవనం" తాపీగా చెప్పాడు ధనంజయ.

ఆ మాట వినగానే అంతా నిశ్చేష్టులైపోయారు.

"అయితే ఆక్సిజన్ ఇంకా ఎంత సేపు వస్తుంది?" పేలవంగా అడిగాడు మస్తాన్.

"మరో గంట రావచ్చు" చెప్పాడు ప్రొఫెసర్.

"మరి ఏంచేద్దాం?" అడిగారు అంతా ఒగ్గరగా ఆందోళనపడుతూ.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్. ఆ నవ్వులో నిరాశ, నిస్పృహ ఇమిడి వున్నాయి.

"ఇక మనం బ్రతికి బయటపడే ఆశ లేదు. మీరంతా మీ మీ డైరీలు బయటకు తీయండి. ఇప్పటివరకు జరిగిన సంఘటనలను వివరంగా వివరిస్తూ వ్రాయండి. చివరలో మళ్ళీ యీ సంపదకొరకు ఎవరనీ అన్వేషించవద్దని విజ్ఞప్తి చేయండి. అంతా పూర్తయిన తరువాత ఒక్కొక్క డైరీ ఒక్కొక్క ట్యూబులో పెట్టి సీలువేసి సముద్రంలో వదలండి.

"కాలగర్భంలో కొన్ని సంవత్సరాలు గడిచిన తరువాత యీ సముద్ర గర్భంలో కూడా మార్పులు సంభవిస్తాయి. కొన్ని కొండలు యీ సముద్ర ప్రవాహంలో చెల్లాచెదురయినప్పుడు, మన డైరీలలో కొన్నయినా పైకి తేలి, అలలమధ్య ప్రయాణంచేసి ఎవరికయినా దొరకవచ్చు. కనీసం ఆ విధంగానైనా మన గురించి పదిమందికి తెలుస్తుంది" తన డైరీ అందుకుంటూ నిస్పృహగా చెప్పాడు ప్రొఫెసర్ ధనంజయ.

—:ఐపోయింది:—

# మతిపోయిన యువతి!

**అజీజ్**

"భోజనం ఇక్కడికే తెమ్మంటారా?" అడిగేడు హోటల్ బోయ్.

"వద్దు! కిందికి వస్తున్నాను!" అన్నాను టై కట్టుకుంటూ.

బోయ్ వెళ్ళిపోయేడు.

ఓ మారు మిర్రర్‌లో చూసుకుని, ఈల వేసుకుంటూ తలుపు వేపు నడిచేను. నలభై ఏళ్ళు దగ్గర పడుతున్నా, నాలో ధారుఢ్యం, చురుకుదనం తగ్గలేదు. నవ్వుకున్నాను. తలుపు మూసి, లాక్ చేసి మెట్ల వేపు నడిచేను.

అది మద్రాసుకి అరవై మైళ్ళ దూరంలో వున్న తిరువత్తియూర్ సిటీలోని బిగ్గ్ హోటల్,

మెట్లు దిగుతూ టైం చూసుకున్నాను. రాత్రి ఏడవుతోంది.

హాల్లో అడుగుపెట్టి చుట్టూ చూసేను. అట్టే రష్ లేదు. ఎదురు బొదురుగా టేబిల్స్ చుట్టూ కూర్చుని టిఫిన్స్ చేస్తున్నారు కొందరు.

ఎడంవేపు వరసగా కేబిన్స్ కట్టబడున్నాయి. ఆరవ కేబిన్లో ఒకేఒక వ్యక్తి సిగరెట్ కాలుస్తూ ఎవ్వరి కోసమో ఎదురుచూస్తున్నట్టు కూర్చున్నాడు.

నల్లప్యాంటులో తెల్లషర్టు టక్ చేసేడు. కాళ్ళకి బూట్సు. ఊదితే ఎగిరిపడే బక్కపల్చని ఒళ్ళు. అస్తవ్యస్తంగా గుబ్బిన ఉంగరాలజుత్తు. లోతుగా పీక్కుపోయిన కళ్ళు.

అతన్ని క్షణం పరీక్షగా చూసి, హాలుమధ్య ఖాళీగా ఉన్న రౌండ్ టేబిల్ ముందు కూర్చున్నాను. అనారోగ్యం వల్ల డాక్టర్ల సలహా తోసిపుచ్చక, కొన్నాళ్ళు ప్రశాంత వాతావరణంలో రెస్టుతీసుకోవాలని, సెలవుపెట్టి అక్కడికి వచ్చేను.

ట్రే పట్టుకుని బేరర్ రాగానే మీల్స్ కోసం ఆర్డరిచ్చి సిగరెట్ అంటించేను.

సరిగ్గా అదే సమయంలో గుమ్మందగ్గిర ఎవ్వరో హడావిడిగా లోనికి వచ్చిన బూట్సుల చప్పుడు విని అటు చూసేను.

ద్వారందగ్గిర ఎవ్వరో యువతి! తలుపుమధ్య నిల్చుని అక్కడున్న వాళ్ళందర్నీ పరీక్షగా చూస్తోంది. ఆమెకి చెరోపక్క ఇద్దరు మగవాళ్ళు నిల్చునున్నారు.

ఒకడు నున్నగా గీసుకున్న బోడిగుండు! దట్టమైన కనుబొమలు. కండలు తిరిగిన చేతులు.

రెండోవాడు గున్నఏనుగు! నల్లగా కమిలిన ఒళ్ళు. బుర్రమీసాలు. కొట్టొచ్చినట్టు కనిపిస్తున్న గణపతిబొజ్జ.

ఒక్క చూపుతో వాళ్ళు కిరాయి రౌడీలని ఇట్టే పసిగట్ట వచ్చు.

ఆ యువతి దేనికో బెదురుతూ వణుకుతున్నట్టుస్పష్టంగా గమనించేను. ఇరవై రెండేళ్ళుంటాయి. సుకుమారంగా పెరిగిన గొప్పింటి బిడ్డలా కనిపిస్తోంది. కళ్ళు చెదరగొట్టే అందం! భుజాల వరకూ కత్తిరించిన జుత్తు. రాకెట్లు ప్రింట్ చేసిన లేత నీలిరంగు బెల్ బాటమ్ సూట్. ఆ దుస్తుల్ని బట్టి ఆమె కాలేజ్ స్టూడెంట్ అయుంటుందనుకున్నాను.

"త్వరగా చెప్పు! ఎవ్వడు వాడు?" కుడిచేత్తో ఆమె డొక్కలో పొడుస్తూ అడిగేడు గున్నఏనుగు.

అప్పుడు పడింది నాదృష్టి అతని చేతిమీద! నల్లగా నిగనిగ మెరుస్తోంది పిస్తోలు!! హాల్లో కూర్చున్న వాళ్ళంతా గుడ్లు తేలేసి చూస్తున్నారు ఆ దృశ్యాన్ని!

సగం కాల్చిన సిగరెట్‌ని ఆష్ట్రేలో వత్తి రెడీగా కూర్చున్నాను ఏం జరుగుతుందో చూడాలని.

ఆ యువతి గజగజ వణుకుతూ మరోమారు లోన కూర్చున్న వాళ్ళందర్నీ పరీక్షగా చూసి, నామీద దృష్టి నిలిపింది!

"చెప్పేది నీకే! త్వరగా చూపెట్టు!" ఆమెని ముందుకి తోస్తూ అరిచేడు బోడిగుండు.

అంతే! ఆ యువతి గబగబ నేను కూర్చున్న టేబిల్ వేపు రాసాగింది. ఆమెని గానీ, ఆమె వెనక వస్తున్న రౌడీలని గానీ నేనంతకిముందెన్నడూ చూళ్ళేదు!

నేను కూర్చున్న టేబిల్ ముందు రక్కన ఆగి, చేత్తో చూపెడుతూ "ఇతనే!" అందా యువతి వణికే కంఠంతో.

నేనింకా ఆ షాక్‌లోంచి తేరుకోనేలేదు! మెరుపులా వచ్చి నా వెనక నిల్చున్నాడు బోడిగుండు. గున్నఏనుగు ఆ యువతిని ఒక్క ఊపుతో వెనక్కిలాగి నన్ను వురిమి

చూస్తూ "లే!" అన్నాడు.

"దేనికి లేవాలి? ఎవ్వరు మీరు?" పొంగుతున్న కోపాన్ని బలవంతంగా తొక్కిపెడుతూ తీక్షణంగా చూసేను.

"మర్యాదగా చెబితే వినాలి! బుద్ధిగా లేచి మా వెంట బైటికిరా! నీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి!" అతని చేతిలో పిస్తోలు నిగనిగ మెరుస్తోంది.

"మిస్టర్! మీరేదో పొరబాటులో ఉన్నారు. ఇంతకి ముందు నేను మిమ్మల్ని చూళ్ళేదు. నేనీ ప్రాంతానికి కొత్తవాణ్ణి. అనవసరంగా నాకు కోపం తెప్పించక!" అన్నాను కళ్ళు చిట్లిస్తూ.

"చిన్నతంబీ! వీడు మర్యాదగా వినే ఘటంలా లేడు. ఇప్పుడే దారికి తెస్తానుండు" వెనకనించి పిడుగులా మెడ మీద పడింది దెబ్బ.

నేనుగనక సరిపోయింది. వేరొకరైతే బోడిగుండు కొట్టిన ఆ దెబ్బకి హరీమనేవాడు! కుర్చీలోంచి నాకు తెలీకుండానే నేలమీద బోర్లాపడిపోయేను! అటువంటి మెరుపుదాడుల్ని ఎదుర్కోడం నాకు కొత్తకాదు.

కిందపడ్డ మరుక్షణం అరచేతులు నేలకి ఆనించి స్ప్రింగులా ఎగిరి గున్నఏనుగు డొక్కలో ఒక్క తన్ను తన్నేను.

అలా జరుగుతుందని వాడు ఊహించి ఉండడు. బంతిలా ఎగిరి కిందపడ్డాడు. క్షణం వృథా చెయ్యకుండా అదే మూమెంటులో మెరుపులా వెనక్కి తిరిగి బోడిగుండు దవడకింద ఒక్క రైట్ హుక్ ఇచ్చేను. కెవ్వుమంటూ దవడ పట్టుకున్నాడు. వాణ్ణి నేలకూల్చాలని అడుగు ముందుకి వేసేను.

అంతే! తలమీద పడింది దెబ్బ! బుర్ర జివ్వుమంది.

కళ్ళల్లో చుక్కలు మెరిసేయి. కుప్పలా నేలకూలుతూ చూసేను ఆ యువతి భయంతో గావుకేకలు పెడుతూ పిచ్చిగా తలుపువేపు పరిగెత్తడం.

## 2

సన్నగా మూలుగుతూ కళ్లు తెరిచేను. చీకటి! తలలో సూదిపోటు.

కళ్ళు చిట్లిస్తూ చూసేను. కారు ఇంజెన్ చప్పుడు హోరుమంటోంది. అప్పుడు గ్రహించేను. నేనేదో కారు బాక్ సీటుకింద పడున్నానని.

కారు చప్పుడు తప్పితే చుట్టుపక్కలెక్కడా మరే శబ్దం వినిపించడంలేదు. దాంతో, ఆ కారు నగరానికి దూరంగా, నిర్మానుష్యమైన రోడ్డుమీద వెళుతోందని ఊహించేను. బాక్ సీట్లో ఎవ్వరో కూర్చున్నారు. కాళ్లు కనిపిస్తున్నాయి.

"చిన్నతంబీ! వీడి పర్సులో నాలుగొందలున్నాయి!" అది బోడిగుండు కంఠం.

"ఏం? వాడిజేబులో పర్సు తీసేవా?" డ్రైవింగ్ సీటుల్లోంచి గున్న ఏనుగు అరిచేడు.

"ఔను!"

"పిచ్చివేషాలు వెయ్యక! పర్సు జేబులో పెట్టెయ్!"

"దేనికి? ఇప్పుడు ఎలాగూ వీణ్ణి వైకుంఠం పంపిస్తున్నాంగా! డబ్బుతీసుకుంటే పోయిందేమిటి?"

"ఓరి చవటపీనుగా! మనం మామూలుగా వీణ్ణి చంపడం లేదు. ఏక్సిడెంటల్ మర్డర్! రోడ్డు కడ్డంగా పడేసి కారులో చిదగ్గొట్టాలి. రేపు పోలీసులకి వీడు కారుకింద పడి చచ్చినట్టు తెలియాలి. సూటు బూటులోవుండి, జేబులో దమ్మిడీ లేకుండా చచ్చాడంటే పోలీసులకి అను

మానం వస్తుంది. పర్సు జేబులో పెట్టేయ్!"

నా కోటు జేబులో, బోడిగుండు పర్సు పెడుతున్నట్టు చేతులు తగిలేయి!

నాకా నాటకం ఏమిటో అర్థంకావడం లేదు. వాళ్ళు నన్ను దేనికి చంపాలనుకుంటున్నారు? ముక్కూ మొహం తెలీని నన్ను ఆ యువతి దేనికి ఇరికించింది? ఈ గండం నుంచి ఎలా బైటపడాలి? తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

"హోటల్లో మనం వీడితో కలయబడుతున్నప్పుడు ఆ రాస్కెల్ పారిపోయింది! బాస్ కీ విషయం తెలిస్తే మన కొంప మునుగుతుంది!" అంటున్నాడు బోడిగుండు.

"భయపడక! ఎక్కడికి పోతుంది? ఈ చుట్టుపక్కలే ఎక్కడో నక్కి వుంటుంది. వీడి పనవగానే, ఎక్కడున్నా దాన్ని వెతికి, మక్కెలిరగదన్ని తీసికెళ్దాం!" సడన్ బ్రేక్ తో క్రీచ్ మంటూ కారాగిన చప్పుడు.

"ఇక్కడే సఫా చేద్దామా?" అడిగేడు బోడిగుండు.

"ఔను! వాడికి స్పృహవచ్చిందేమో చూడు!" ఫ్రంట్ డోర్ తెరిచి చిన్నతంబి దిగిన చప్పుడు.

మరుక్షణం బోడిగుండు నా డొక్కలో ఒక్క తన్ను తన్ని ముక్కుదగ్గర చెయ్యిపెట్టేడు. నెప్పికి పేగులు మెలికలు తిరుగుతున్నా భరించి, కిక్కురుమనకుండా అలాగే పడుకున్నాను.

"ఇంకా రాలేదు!" అన్నాడు బోడిగుండు చెయ్యి తీసేస్తూ.

"గుడ్! ఎలా చంపాలో క్లియర్ గా చెబుతా విను. బాక్ సీట్లోంచి వీణ్ణి బైటకిలాగి, ఈడ్చుకుంటూ రోడ్డు మీదకి తీసికెళ్ళు. రోడ్డుమధ్య నిటారుగా నిల్చోబెట్టి పట్టుకో. నేను రివర్స్ గేర్ లో కారు వెనక్కి తీసికెళ్తాను. యాభై మైళ్ళ స్పీడ్ లో ముందుకి తోల్తాను. కారు నీకు

వందగజాల దూరం ఉందనగా, వాణ్ణి ముందుకి తోసి, పక్కకి తప్పుకో. దాంతో కారుకింద పడ్డాడా ఊరు కుంటాడు!" అంటున్నాడు చిన్నతంబి.

"ఆల్ రైట్!" అంటూ డోర్ తెరిచాడు బోడిగుండు. నా చంకలుపట్టి బైటికిలాగి ఈడ్చుకుంటూ రోడ్డుమధ్యకి తీసికెళ్ళాడు. కారు హెడ్ లైట్స్ వెలుగుతున్నాయి. నా చంకల్లో రెండు చేతులు ఇరికించి, నిటారుగా నిలోబెట్టేడు.

మరుక్షణం కారు స్టార్టయిన చప్పుడు. రివర్స్ గేర్ లో వెనక్కి వెళ్తోంది. ఫర్లాంగుదూరం వెళ్ళి ఆగిపోయింది. గేర్ మార్చిన శబ్దం! వేగంగా ముందుకి రాసాగింది. నేను స్టడీ అయ్యాను.

కారు వందగజాల దూరం ఉండగా, ఒంట్లో ఉన్న శక్తినంతా కూడదీసుకుని, బోడిగుండు భుజాలుపట్టి రోడ్డు మీద పల్టీ కొట్టించేను.

అలా జరుగుతుందని వాడు కల్లోకూడా ఊహించి ఉండడు. ఒక్క ఊపుతో రోడ్డుమధ్య బోర్లా పడి పోయేడు. కన్నుమూసి తెరిచేలోగా రోడ్డుపక్క చీకట్లోకి గెంతేను.

అంతే! యాభైమైళ్ళ స్పీడ్ లో ఉన్న కారు వాడి మీంచి బాణంలా దూసుకుపోయింది.

కెవ్వున కేక! హృదయవిదారకంగా అరిచిన చావుకేక! బోడిగుండు కారుకింద కొబ్బరి చట్నీ అయ్యుంటాడు! మరు క్షణం క్రీచ్ మన్న శబ్దం. కొంతదూరం వెళ్ళి ఆగిపోయింది కారు.

"కణ్ణన్!" అంటూ గావుకేక పెట్టేడు చిన్నతంబి.

ఆ హఠాత్పరిణామానికి వాడూ షాక్ తినుంటాడు. ఇంక జాగుచెయ్యకూడదు. చీకట్లో పడి తిరువ త్తియూర్

వేపు పరుగుతీసేను. కాళ్ళకి కేన్వాస్ బూట్లు ఉండడంవల్ల చప్పుడు కావడంలేదు.

చిన్నతంబి నన్ను వెదుకుతూ టైం వృథా జెయ్యడని నాకు తెలుసు. బోడిగుండు శవాన్ని వెంటనే అక్రమించి తీసికెళ్ళే ప్రయత్నంలో ఉంటాడు. ఈ అవకాశాన్ని వదులుకోకూడదు. శక్తికొద్దీ పరుగుతీస్తున్నాను.

కడుపులో ఏమీ లేకపోడంవల్ల నీరసం వస్తోంది. మైలు దూరం వచ్చేనేమో! వెనక ఎవ్వరూ వెంబడిస్తున్న చప్పుడులేదు. రోడ్డు పక్క ఓ చెట్టుకింద ఆగిపోయేను. చుట్టూ నిశ్శబ్దం! ఆగి ఆగి నక్కల ఊళలు వినిపిస్తున్నాయి. కీచురాళ్ళ రొద!

ఐదు నిమిషాల తరవాత తిరువ త్తియూర్ వేపు ఏదో వాహనం వస్తున్న హెడ్ లైట్స్ కనిపించేయి. కళ్ళు చిట్లిస్తూ పరీక్షగా చూడసాగేను. చాలా వేగంగా వస్తోంది. నిమిషంలో నన్ను దాటి వెళ్ళిపోయింది. అదే కారు! డ్రైవింగ్ సీట్లో చిన్నతంబి ఆకారం కనిపించింది!

ఆ చీకట్లో నన్ను వెదికి ప్రయోజనంలేదని, శవాన్ని కార్లో వేసుకుని వెళ్ళిపోయాడు. ఆ మిస్టరీ ఏమిటో తెలుసుకోవాలన్న క్యూరియాసిటీ నాలో క్షణక్షణానికీ అధికమౌతోంది.

చిన్నతంబి తిరువ త్తియూర్ వెళ్ళి ఏం జేస్తాడు? నన్నూ, ఆ యువతినీ వెదికి పట్టుకోడానికి ప్రయత్నిస్తాడా?

ఆమె ఎవ్వరు? వాళ్ళు మనిషిమాత్రం కాదని వాళ్ళ మాటలవల్ల తెలిసిపోయింది. ఐతే, హోటల్లో వాళ్ళకి నన్ను చూపెట్టి దేనికి చంపించాలనుకుంది? వాళ్ళు నాతో కలయబడుతున్నప్పుడు ఎక్కడికి పారిపోయింది? వాళ్ళ బాస్ ఎవ్వరు? ఏమిటీ మాయ? తెలుసుకోవాలి! తెలుసుకు

తీరాలి. అంతవరకూ నిద్రపట్టదు.

అపరాధ పరిశోధనలో విసిగి వేసారి, విశ్రాంతి కోసం ఇక్కడికివస్తే ఊహించని విధంగా ఈ రొంపిలో దిగేను. ఏది ఏమైనా ఇకనించి తిరువత్తియూర్‌లో జాగ్రత్తగా ఉంటూ ఈ మిస్టరీని ఛేదించాలి.

నా ఆలోచనలకి బ్రేక్ వేస్తూ దూరంగా ఏదోవాహనం వస్తున్నట్టు హెడ్ లైట్స్ కనిపించేయి. ఇంజెన్ శబ్దాన్ని బట్టి అది లారీ అని గ్రహించేను.

ఆ చీకట్లో తిరువత్తియూర్ ఎలా వెళ్ళాలా అన్న సమస్య తీరిపోయింది. లారీ డ్రైవర్‌కి డబ్బిచ్చి త్వరగా అక్కడికి చేరుకోవాలి. చెట్టువెనకనించి రోడ్డుమీదికి వచ్చి చెయ్యి ఊపసాగేను!

# 3

"ఇక్కడ ఆపు!"

డ్రైవర్ బ్రేక్ వేసేడు. లారీలోంచి దిగి, పర్సులోంచి అయిదు రూపాయలుతీసి డ్రైవర్ చేతిలో పెట్టేను. లారీ వెళ్ళిపోయింది. డ్రైవర్ పుణ్యమా అని అక్కణ్ణించి అర గంటలో తిరువత్తియూర్ జేరుకున్నాను. అదే బిడ్జ హోటల్!

గబగబ హోటల్ వైపు నడుస్తూ రిస్టువాచీ చూసుకున్నాను. తొమ్మిదిన్నర!

హోటల్‌కెళ్ళి, ఆ రౌడీల గురించీ, ఆ యువతి గురించీ ఎవ్వరికైనా తెలుసేమో కనుక్కోవాలి. చిన్నతంబి నన్ను వెతకడానికి ఆ హోటల్‌కి రావచ్చు. వెంటనే రూం ఖాళీచేసి వేరే హోటల్‌కి మకాం మార్చాలి. గబగబ నడుస్తూ హోటల్లో అడుగుపెట్టేను.

కౌంటర్ క్లర్క్ నన్ను చూడగానే నోరు తెరిచేడు!

"వీళ్ళు సజీవంగా మళ్ళీ తిరిగి వస్తారనుకోలేదు!" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఏం?" అడిగేను బల్లనానుకుని నిల్చుని.

"వాళ్ళు కిరాయి రౌడీలు! డబ్బుకోసం దేనికైనా తెగించే మనుషులు. ఇంతకుముందు అనేకసార్లు జైలు కెళ్ళొచ్చారు. వాళ్ళ పేర్లు వింటే ఈ చుట్టుపక్కలందరికీ హడల్!"

"అలాగా! వాళ్ళ వెంట ఉన్న అమ్మాయి ఎవ్వరు?" అడిగేను జేబులోంచి సిగరెట్ తీస్తూ. అతను క్షణం ఆలోచించి, "ఎవ్వరో సరిగ్గా గుర్తురావడంలేదు. కాని, ఆమె ఫోటోని పోయిన ఆదివారం పేపర్లో చూసినట్టు జ్ఞాపకం!" అన్నాడు.

"ఏ పేపర్?" నా కంఠం ఆతృతగా ధ్వనించింది.

"ఇక్కడే ప్రింటవుతుంది! న్యూస్ హెరాల్డ్!"

నా కళ్ళల్లో మెరుపు మెరిసింది. అతనికి థాంక్స్ చెప్పి, పది నిమిషాల్లో ఆ హోటల్ గది ఖాళీచేసి, సామానుతో మెయిన్ బజారులో వున్న ఫోర్ స్క్వేర్ హోటల్లో మారు పేరుతో ఓ సింగిల్ రూం తీసుకున్నాను. లోన సామానుపడేసి, గది లాక్ జేసి బైటికి వచ్చేను.

న్యూస్ హెరాల్డ్ ఆఫీస్ కనుక్కోవడం కష్టంకాలేదు. దినపత్రిక కనక ఆఫీసులో రాత్రింబవళ్ళూ పని జరుగుతుంటుంది.

సర్క్యులేషన్ ఎడిటర్ని కలుసుకుని, కాపీకి ఐదు రూపాయల చొప్పున ఫీజు చెల్లించి పోయిన ఆదివారం నుంచీ వరసగా ఆరోజువరకూ విడుదలైన పత్రికలు కొని, తిరిగి హోటల్ చేరుకున్నాను. తలుపు లోపల గడియ బిగించి సోఫాలో చతికిలబడ్డాను.

ఆదివారం ఎడిషన్ తీసి గబగబ పేజీలు చూడ

సాగేను. కనిపించింది! పాస్‌పోర్ట్ సైజ్ ఫోటో!! ఆ అమ్మాయిది!!!

ఫోటో కింద— "జ్ఞాపకశక్తి కోల్పోయిన యువతి!" అన్న హెడ్‌లైన్ కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

ఊపిరి బిగబట్టి చదవసాగేను!

తిరువత్తియూర్, ఫిబ్రవరి— 17:— గతంరాత్రి రెండు గంటల ప్రాంతంలో ఒక అందమైన యువతి సిటీ హాస్పిటల్ గేటుదగ్గర ఏడుస్తూ కనిపించింది. వాచ్ మెన్ ఆమెని హాస్పిటల్లోకి తీసికెళ్ళి డాక్టర్ కప్పగించేడు. డాక్టర్ పరీక్షించగా ఆమె కణతమీద బలమైన గాయం కనిపించింది. ఎన్ని ప్రశ్నలు వేసినా దేనికీ జవాబివ్వలేక పోయింది. తన పేరు సైతం చెప్పలేకపోతోంది. డాక్టర్స్ కణతమీది గాయంవల్ల ఆమె తన జ్ఞాపకశక్తిని పూర్తిగా కోల్పోయినట్టు నిర్ణయించేరు.

ఆమెకి ఒకే ఒక దృశ్యం గుర్తుంది. అతికష్టంమీద కేవలం అదే చెప్పగలిగింది. తను చీకట్లో ఓ నిర్మానుష్యమైన రోడ్డుమీద నిల్చున్నాననీ, అంతలో ఓ కారువచ్చి తన పక్కన ఆగిందనీ, డ్రైవింగ్ సీట్లో కూర్చున్న వ్యక్తి ఎన్ని ప్రశ్నలు వేసినా, తనేమీ చెప్పలేక పోయాననీ, దాంతో అతను తనని కార్లో కూర్చోబెట్టి, హాస్పిటల్‌కి తీసుకువచ్చి, విడిచిపెట్టి వెళ్ళిపోయేడనీ, చెప్పింది.

ఆ వ్యక్తి గురించి అడిగితే, ఎంతో జాలిగలవాడనీ, తనపట్ల చాలా మర్యాదగా ప్రవర్తించాడని మాత్రం చెప్పిందికానీ, ఆ వ్యక్తి పోలికలు చెప్పలేకపోయింది. హాస్పిటల్ సర్జను వెంటనే స్థానిక ప్రైవేట్ సైకాలజిస్ట్, డాక్టర్ జెనకీని పిలిపించి ఆ యువతిని చూపించేరు. ఆయన ఆ కేసుని పూర్తిగా పరిశీలించి, ఆమెని వెంటనే ఆమె ఇంటి వాతావరణంలోకి వదలడం అత్యవసరమనీ,

తనచుట్టూ ఉన్న బంధుమిత్రుల్ని చూసి ఆమె జ్ఞాపకశక్తి కాలక్రమేణా తిరిగి వస్తుందని చెప్పేరు.

పై ఫోటోలో ఉన్న యువతిని ఎవ్వరైనా గుర్తుపట్ట గలిగితే దయచేసి వెంటనే మా ఆఫీసుకి తెలీజెయ్యగలరు. రాత్రి ఆమెని హాస్పిటల్ గేటుదగ్గర వదిలి వెళ్ళినవారు కూడా దయచేసి, మా ఆఫీసుకి వచ్చి ఆమె ఏ పరిస్థితిలో, ఏ రోడ్డుమీద కనిపించిందో తెల్పగలరు. దాంతో ఆమె అక్కడికెలా వచ్చిందో, ఏవైపునించి వచ్చిందో తెలుసుకో డానికి వీలవుతుంది!

పేపర్ మడిచి సిగరెట్ అంటించేను. వ్యవహారం చాలా చిత్రవిచిత్రంగా తయారవుతోంది.

ఫిబ్రవరి 16వ తేదీ శనివారం అర్థరాత్రి ఆ యువతి హాస్పిటల్ చేర్చబడింది. ఆదివారం పేపర్లో ఆమె ఫోటో ప్రకటించేరు. ఈ రోజు శుక్రవారం! కొన్ని గంటలక్రితం నేను కళ్లారా బ్లిడి హోటల్లో ఆమెని చూసేను. అంటే, ఆమె బంధువులెవ్వరైనా వచ్చి ఆమెని హాస్పిటల్నుంచి తీసికెళ్ళేరా? తీసికెళ్ళి ఉంటే సోమవారం పేపర్లో ప్రక టించి ఉంటారు.

ఆలోచిస్తూ సోమవారం పేపర్ అందుకుని చకచక హెడ్ లైన్స్ చూడసాగేను.

కనిపించింది! "జ్ఞాపకశక్తి కోల్పోయిన యువతి గుర్తింపు!" అన్న హెడ్ లైన్స్.

గబగబ చదవసాగేను! తిరువనంతపురం ఫిబ్రవరి-18:- శనివారం రాత్రి జ్ఞాపకశక్తి కోల్పోయిన సిటీ హాస్పిటల్లో చేర్చబడ్డ యువతి ఎవ్వరో తెలిసిపోయింది. ఆదివారం మా పత్రికలో అచ్చైన ఆమె ఫోటో, ప్రకటనా చూసి ఆమె తండ్రి విశ్వనాథంగారు మద్రాసునించి స్వయంగా వచ్చి ఆ యువతిని తీసికెళ్ళేరు. ఆమె పేరు కాత్యాయని!

విశ్వనాథంగారు చెప్పిన వివరాలనుబట్టి ఆయన బిజినెస్ వ్యవహారంమీద బెంగుళూర్‌నించి తన కూతురు కాత్యాయనితో మద్రాసువచ్చి, హోటల్ స్ప్రింగ్‌లో దిగేరు.

కాత్యాయని, మద్రాసుకి డెభై మైళ్ళ దూరంలో ఉన్న కోవెలూర్‌లోని తన స్నేహితురాల్ని చూట్టానికి కార్లో బైలుదేరింది. బిజినెస్ పనుల్లో బిజీగా ఉన్న విశ్వనాథం గారు తన కూతురు క్షేమంగా కోవెలూర్ చేరుకునుంటుం దనుకున్నారు. ఇంతలో మా సండే ఎడిషన్‌లోపడ్డ ఆమె ఫోటోచూసి ఖంగారుపడి, హుటాహుటిన తిరువ త్తియూర్ చేరుకున్నారు. తన కూతుర్ని గుర్తించి, వెంటనే మద్రాసు తీసికెళ్ళేరు!''

పేపర్ మడిచి, సిగరెట్ దమ్ము గట్టిగా లాగేను. బుర్ర చురుగ్గా పనిచేస్తోంది. కాత్యాయని ఏ రోడ్డుమీద ఆ కురటనక గురెంలో తెలిసిపోయింది. మరి సోమవారం తన తండ్రితో మద్రాసు వెళ్ళిన కాత్యాయని ఈ రోజు ఇక్కడెలా కనిపించింది? ఇక్కడికెందుకొచ్చింది? ఆమె తండ్రి ఎక్కడున్నాడు? అన్నిటికన్నా ముఖ్య విషయం, ఆమె బిడ్డి హోటల్లో నన్ను వేలుపెట్టి ఆ రౌడీలకి దేనికి చూపించింది? తరవాత ఎక్కడికి పారిపోయింది? అంతా అగమ్యం! సిగరెట్ ఏష్‌ట్రేలో పడేసి టీపాయ్‌మీది ఫోన్ అందుకున్నాను. మద్రాసులోని క్రయింబ్రాంచ్ హెడ్‌క్వార్టర్స్‌కి ట్రంకాల్ జేసేను. త్వరలోనే లైన్ దొరికింది. ఇన్‌స్పెక్టర్ రాజారావ్‌ని లైన్‌లోకి పిలవమని చెప్పేను ఆపరేటర్‌కి. రాజారావ్ లైన్‌లోకి రాగానే అతనితో కొద్దిసేపు మాట్లాడి ఫోన్ పెట్టేశాను.

మళ్ళీ పోయిన ఆదివారం పేపర్ అందుకుని, ఆ అమ్మాయి ఫోటో చూడసాగేను.

మేకప్ లేకపోవడంవల్ల లోతుగా పీక్కుపోయిన

కళ్ళు, నుదుటిమీద అస్పష్టంగా పడుతున్న వెంట్రుకలూ కనిపిస్తున్నాయి. ఐనా, ఆ అమ్మాయిలో ఏదో ఆకర్షణ ఉంది.

క్షణం ఫోటోని పరిశీలించి, టైం పాస్ కోసం హెడ్ లైన్స్ చూడసాగేను. ఓ కాలమ్‌లో నా దృష్టి నిలిచి పోయింది.

"కారు ఏక్సిడెంట్!!"

చకచక చదవసాగేను.

తిరువత్తియూర్, ఫిబ్రవరి_ 17:_ గతరాత్రి రెండు గంటల ప్రాంతంలో తిరువత్తియూర్‌కీ, కోవెలూర్‌కీ మధ్య ఘోరమైన కారు ఏక్సిడెంట్ జరిగింది. కారు రోడ్డు టర్నింగ్‌లో పట్టుతప్పి, రోడ్డు పక్క అగాధంలో పడి పోయింది. రాపిడికి పెట్రోల్ టాంక్‌లో మంటలు లేచేయి. ఆ దారినే పోతున్న లారీ డ్రైవర్ ఆ దృశ్యం చూసి వెంటనే తిరువత్తియూర్ వచ్చి పోలీసులకి తెలియ జేసేడు. ఇన్‌స్పెక్టర్ గణేశన్ ఫైర్ స్క్వాడ్‌తో హుటాహుటిన ఆ ప్రదేశం చేరుకుని మంటలు నల్లార్చేరు. కార్లో ముప్ఫై ఏళ్ళ వ్యక్తి శవం దొరికింది. కారు నెంబర్ ఆధారంతో పోలీసులు ఆ వ్యక్తి ఆచూకీ తీస్తున్నారు!

మరో సమయంలో ఐతే నేనావార్తకి అట్టే ప్రాధాన్యం ఇచ్చేవాణ్ణికాదు. కాని, ఒకే ఒక విషయంలో నన్నా వార్త ఆకట్టుకుంది. ఆ సంఘటన శనివారం రాత్రి జరిగింది. కాత్యాయనికూడా అదే రోజు రాత్రి ఓ అనామకుడి ద్వారా హాస్పిటల్‌కి చేర్చబడింది. ఆమె ఏ ప్రదేశంలో, ఏ రోడ్డుమీద జ్ఞాపకశక్తి కోల్పోయిన స్థితిలో దొరికిందో ఇంకా తేలలేదు. అంతేకాదు మద్రాసునించి ఆమె కార్లో కోవెలూర్ బైలుదేరింది. ఐతే, ఆమె ప్రయాణించిన కారు ఏమైనట్టు?

తీవ్రంగా ఆలోచిస్తూ ఫిబ్రవరి 18వ తేదీ పేపర్ అందుకున్నాను. అంతలోనే కాత్యాయని తండ్రి వచ్చి ఆమెని తీసికెళ్ళినట్లు ప్రచురించేరు. ఆ వార్తని వదిలేసి చకచక మిగితా హెడ్ లైన్స్ చూడసాగేను.

"కారు ఏక్సిడెంట్ లో మరణించిన వ్యక్తి గుర్తింపు!" కావలసిన వార్త కనిపించింది.

క్యూరియాసిటీతో చదవసాగేను.

తిరువత్తియూర్, ఫిబ్రవరి 18:- శనివారం రాత్రి కారు ఏక్సిడెంట్ లో మరణించిన వ్యక్తి ఎవ్వరో పోలీసులు కనుక్కొన్నారు. ఆ కారు నెంబర్నిబట్టి, ఆచూకీ తీసిన పోలీసులకి ఆ వ్యక్తి కోవెలూర్ లో ప్రాక్టీస్ జేసుకుంటున్న లాయర్ రామారావ్ అని తెలిసింది. రామారావ్ శనివారం సాయంత్రం ఏడుగంటలకి ఓ పనిమీద బైటకెళ్తున్నాననీ, ఇంటికి రావడానికి చాలా ఆలస్యం కావచ్చనీ తన తల్లికి చెప్పి కార్లో బైలుదేరి అర్ధరాత్రి కోవెలూర్ కీ తిరువత్తియూర్ కీ మధ్య రోడ్డు ఏక్సిడెంట్ లో మరణించేరు. ఆయన ఎక్కడికి బైలుదేరేరో తల్లికిగానీ, ఊళ్ళో ఆయన స్నేహితులగ్గానీ ఎవ్వరికీ తెలీదు.

పోలీసులతోబాటు మా ప్రత్యేక విలేఖరి దర్యాప్తు చేయగా, ఒకే ఒక విషయం తేలింది. రామారావ్ కోవెలూర్ నించి బైలుదేరి, దారిమధ్య ఓ పెట్రోల్ పంపులో పెట్రోల్ పోసుకోడానికి ఆగేరట. టాంక్ లో పెట్రోల్ నింపుకున్నాక పెట్రోల్ బంక్ యజమానిని డాక్టర్ ముత్తురామన్ సేనిటోరియం అడ్రెస్ అడిగేరట.

డాక్టర్ ముత్తురామన్ సేనిటోరియం తిరువత్తియూర్ కీ కోవెలూర్ కీ మధ్య ట్రంక్ రోడ్ నించి ఎడంవేపు మైలు దూరంలో చిన్న గుట్టమీద ఉంటుంది. బంక్ యజమాని రామారావ్ కి ఆ సేనిటోరియం కెలా వెళ్ళాలో చిన్న

కాగితంమీద ప్లాన్ గీసి ఇచ్చేడట. రామారావ్ అతనికి థాంక్స్ చెప్పి కార్లో వెళ్ళిపోయేడట.

బంక్ యజమాని రామారావ్ కారు బాక్ సీట్లో ఎవ్వరో కూర్చున్నట్లు ఓ ఆకారం చూసేడట. కార్లో చీకటిగా ఉండటంవల్ల ఆ కూర్చున్నది ఎవ్వరో సరిగ్గా చూడలేక పోయేడట. రామారావ్ కారు సేనిటోరియం ఇంకా రెండు మైళ్ళుందనగా ఏక్సిడెంట్ కి గురైంది!"

పేపర్ మడిచి, తీవ్రంగా యోచిస్తున్నాను. ఫోన్ మోగింది!

ఆత్రంగా రిసీవర్ అందుకుని, "యస్!" అన్నాను.

"హోటల్ స్ప్రంజ్ లో వాకబ్ చేసేనుసార్! విశ్వనాథం అనే వ్యక్తిగానీ, కాత్యాయని అనే అమ్మాయికానీ ఆ హోటల్లో బస చెయ్యలేదు! నేను రిజిస్టరంతా చెక్ జేసేను. రిజిస్టర్లో విశ్వనాథం అనే పేరేలేదు. సాటి స్పెషన్ కోసం మద్రాసులోని హోటళ్ళన్నీ చెక్ చేసేను. వారంక్రితం ఆ పేరుగల వ్యక్తులెవ్వరూ ఏ హోటల్లోనూ బసచెయ్యలేదు!" అన్నాడు ఇన్ స్పెక్టర్ రాజారావు అవ తలినించి.

"ఆల్ రైట్! అవసరం కలిగితే మళ్ళీ ఫోన్ జేస్తాను!" అంటూ రిసీవర్ క్రెడిల్ జేసి సిగరెట్ అంటించేను.

ఎంత విచిత్రం! ఎవ్వరో వచ్చి కాత్యాయని తన కూతు రంటూ తీసికెళ్ళేడు! హాస్పిటల్ సిబ్బందినీ, పోలీసుల్నీ జోకొట్టడానికి ఏదో కట్టుకధ అల్లి చెప్పేడు. ఎవ్వరు? అతనివెంట వెళ్ళిన కాత్యాయనిని ఈరోజు ఆ రౌడీలు బిడ్లి హోటల్ కి ఎందుకు తీసుకువచ్చేరు? ఆమె హోటల్లోకి రాగానే నన్ను దేనికి చూపెట్టింది? తరవాతఏమైంది? వాళ్ళు మళ్ళీ ఆమెని పట్టుకున్నారా? చంపేశారా?

# 4

"గడచిన ఆదివారం కాత్యాయని అనే అమ్మాయిని మీరు సిటీ హాస్పిటల్లో పరీక్షించేరుకదూ?" అడిగేను.

డాక్టర్ క్షణం నన్ను పరీక్షగా చూసి, "ఔను!" అన్నాడు.

"ఆ అమ్మాయి జ్ఞాపకశక్తిని పోగొట్టుకుందని మీరు ఖచ్చితంగా చెప్పగలరా?"

"ఔను!"

"పేపర్లో పడ్డ ఫోటో చూసి ఆమెని తీసికెళ్ళడానికి మద్రాసునించి ఆమె తండ్రి వచ్చేడుకదా, ఆ అమ్మాయి తన తండ్రిని గుర్తించినట్టు కనిపించిందా?"

"లేదు! జ్ఞాపకశక్తి పూర్తిగా కోల్పోయిన వ్యక్తి ఎవ్వర్ని మట్టుకు ఎలా గుర్తిస్తుంది? ఈయన నీతండ్రి, నిన్ను తీసికెళ్ళడానికి వచ్చేరు, వెళ్ళు! అనగానే అతన్ని పిచ్చిచూపులు చూస్తూ బుద్ధిగా వెళ్ళిపోయింది. ఇంటికి తీసికెళ్ళాక ఇంట్లో ఆమెని ఏవిధంగా ట్రీట్ చెయ్యాలో ఇన్స్ట్రక్షన్స్ ఇచ్చి పంపేను. ఆ సంఘటన జరిగి దాదాపు వారం కావస్తోంది. ఇప్పుడు ఆ అమ్మాయి విషయంలో మీ కేమిటి ఇంట్రస్టు?" అడిగేడు బెనర్జీ.

"కొన్నాళ్ళక్రితం మా బంధువుల్లో ఓ అమ్మాయి ఇంట్లో పోట్లాడి ఎక్కడికో వెళ్ళిపోయింది. ఇంతవరకూ ఆమెజాడ తెలీలేదు. నిన్న కాకతాళీయంగా నేను లాస్ట్ సండే న్యూస్ హెరాల్డ్ పత్రిక చూడ్డం జరిగింది. అందులో ప్రింటైన కాత్యాయని ఫోటో, మా అమ్మాయిని చాలా వరకు పోలివుంది. డౌట్ క్లియర్ జేసుకుందామని ఇలా వచ్చేను!" అపరాధ పరిశోధనలో అబద్ధాలు పరిపాటే. నేను క్రయింబ్రాంచి ఇన్స్పెక్టర్నని డాక్టర్కి చెప్పడం ఇష్టంలేక కథ కల్పించేను.

డాక్టర్ పెద్దగా నవ్వుతూ- "చాలా ఆశ్చర్యంగా ఉంది! రెండురోజుల క్రితం మీలాగే ఒకాయన కన్ ఫ్యూజ్ అయి డౌట్ క్లియర్ కోసం నాకు ఫోన్ చేసేడు!" అన్నాడు.

"ఏమని?" నా క్యూరియాసిటీ బయటపడకుండా మామూలుగా అడిగేను.

"పేపర్లో ఆ అమ్మాయి ఫోటో చూస్తే తన పెద్దకూతురేమో అన్న అనుమానం కలిగిందట ఆయనికి. నేను ఆ అమ్మాయి తండ్రివచ్చి ఆమెని తీసికెళ్ళేడని చెప్పడంతో ఆయన ఆందోళన పోయింది!"

"ఎవ్వరాయన?"

"కోవెలూర్ నించి ఫోన్ చేసేడు! రిటైర్డ్ తహసీల్దారట. పేరు భుజంగరావ్!"

నా కళ్ళు తళుక్కుమన్నాయి. ఈ సంఘటనలకి ఏదో ఒక రూపంలో కోవెలూర్ తో సంబంధం ఉంటోంది. డాక్టర్ని కలుసుకోడంవల్ల నాకు నష్టం కలగలేదు.

"థాంక్యూ డాక్టర్! మీ టైం వృధా చేసినందుకు క్షమించండి!" అన్నాను లేస్తూ.

అతని దగ్గర సెలవు తీసుకుని, రోడ్డుమీదికి వచ్చేను. కనిపించిన టాక్సీ ఎక్కి పోలీస్ స్టేషన్ కి వెళ్ళమన్నాను.

హాస్పిటల్ నించి కాత్యాయనిని తీసికెళ్ళిన వ్యక్తి ఆమె తండ్రికాడు. మద్రాసునించి కార్లో కాత్యాయని కోవెలూర్ బయలుదేరిందని అతను చెప్పింది అబద్ధం! రామారావ్ కోవెలూర్ నించి వస్తూ కారు ఏక్సిడెంట్ కి గురి అయ్యేడు. అతని కార్లో ఇంకా ఎవ్వరో కూర్చునుండగా తను చూసేనని చెప్పేడు పెట్రోల్ బంకతను. అదేరాత్రి కాత్యాయని మతిలేని స్థితిలో హాస్పిటల్ కి చేర్చబడింది. ఆమె ఏరోడ్డుమీద అనామకుడికి దొరికిందో తెలియలేదు.

పేపర్లో కాత్యాయని ఫోటో చూసి, కోవెలూర్‌లో ఉన్న భుజంగరావ్‌కి తన పెద్దకూతురేమో అన్న అనుమానం కలిగింది. అంటే, రామారావ్ కార్లో పెట్రోల్ బంక తను కాత్యాయనినే చూసేడా? కూపీ తియ్యాలి. ఇటువంటి కేసులంటే నాకు చాలా ఇంట్రెస్ట్! సడన్ బ్రేకుతో ఆగింది టాక్సీ! దిగి, మీటర్ బిల్ ఇచ్చేసి, చకచక పోలీస్ స్టేషన్‌లోకి నడిచేను.

"ఏమిటి?" అడిగేడు వసారాలో నిల్చున్న డ్యూటీ గార్డ్.

"ఇన్‌స్పెక్టర్ గణేశన్ ఉన్నారా?"

"ఇంకా రాలేదు! సార్జంట్ ఉన్నారు! వెళ్ళండి" అన్నాడు.

సాలోచనగా తలూపుతూ లోనికెళ్ళాను. ఏదో రాసుకుంటున్న సార్జంట్ నన్ను చూడగానే ఫైల్ మూసి లేచేడు.

"ఇన్‌స్పెక్టర్ గణేశన్‌కోసం వచ్చేను!" అన్నాను.

"కూర్చోండి! ఏమిటి? కంప్లైంటా?" అడిగేడు.

"నో. నో. నేను న్యూస్ రిపోర్టర్ని! కొన్ని వివరాలు సేకరించడానికి వచ్చేను!" అంటూ కుర్చీలో చతికిలబడ్డాను.

నేను వేసిన బాణం పనిచేసింది! న్యూస్ రిపోర్టర్ననగానే సార్జంట్ కళ్ళు మిలమిల మెరిసేయి. ఈ పోలీస్ డిపార్ట్‌మెంట్ వాళ్ళతత్వం నాకు తెలుసు. ఏదో ఒక కేసు సందర్భంలో తమపేరు పత్రికల్లోపడి, పై ఆఫీసర్ల దృష్టికి రావాలనీ, తద్వారా ప్రమోషనో, ఇంక్రిమెంటో, మెడలో నోరకాలనీ తెగ తాపత్రయం! న్యూస్ రిపోర్టర్స్ అడిగిందే తడవుగా విసుగూ, విరామం లేకుండా బుద్ధిగా అడిగిన సమాచారం అందిస్తారు.

"ఏం అడగదలుచుకున్నారో అడగండి, చెబుతాను! ఇన్‌స్పెక్టర్ రావడానికి ఆలస్యం కావచ్చు!" అన్నాడు సార్జంట్ కుర్చీలో సర్దుకు కూర్చుంటూ.

"మొన్న కోవెలూర్ ట్రంక్ రోడ్ మీద జరిగిన కారు ఏక్సిడెంట్ గురించి కొంత సమాచారం కావాలి!"

"మొన్న అంటే, ఆ రోడ్డుమీద గడచిన పాతిక రోజుల్లో రెండు కారు ఏక్సిడెంట్స్ జరిగేయి. దేనిగురించి అడుగుతున్నారు?"

సార్జంట్ ప్రశ్నతో నా కనుబొమలు ముడివడ్డాయి. ఆ రోడ్డుమీద రెండు ఏక్సిడెంట్స్ జరిగేయా? పేపర్లో నేను చదివింది రామారావ్ ఏక్సిడెంట్ గురించి. అది గడచిన శనివారమే జరిగింది. అంటే, అంతకిముందు ఆ రోడ్డుమీద మరో ఏక్సిడెంట్ జరిగిందన్నమాట! ఎవ్వరిది?

"గత శనివారం జరిగిన రామారావ్ కారు ఏక్సిడెంట్ గురించి నాకు క్షుణ్ణంగా తెలుసు! అంతకిముందు జరిగిన ఏక్సిడెంట్ వివరాలు చెప్పండి!" అన్నాను.

"అంతకిముందు అంటే, ఈ నాటికి సరిగ్గా పాతిక రోజుల క్రితం కోవెలూర్ ట్రంక్ రోడ్ మీద పదెనిమిదేళ్ల అమ్మాయి కారు ఏక్సిడెంట్‌కి గురై మరణించింది!" అన్నాడు సార్జంట్.

"కార్లో ఆమె ఒక్కతే ప్రయాణం చేస్తోందా?"

సార్జంట్ తలూపేడు!

"పేరేమిటి?"

"సుభమయి!"

"ఏక్సిడెంట్ ఎలా జరిగింది? అంత రాత్రివేళ ఆమె ఒంటరిగా ఆ రోడ్డుమీద దేనికి ప్రయాణిస్తోంది."

"చెబుతాను. ఆ రోడ్డు ఎటువంటిదో మీకు తెలుసను కుంటాను. విశాలమైన రోడ్డయినా, కొండని కట్ జేసి ఆ

రోడ్డు వేసేరు. రోడ్ కెడంవైపు భయంకరమైన అగాధం. చాలా జాగ్రత్తగా డ్రైవ్ చెయ్యవలసి వుంటుంది. ఖర్మ కాలి స్టీరింగ్ పట్టుతప్పినా, సమయానికి బ్రేకులు పడకున్నా తిన్నగా వైకుంఠం వెళ్ళాల్సిందే. ఆ అమ్మాయి కారూ అటువంటి ఫాల్ట్సకే గురై, ఎడంవేపుఅగాధంలో పడిపోయింది. అదృష్టవశాత్తు కార్లో మంటలు పుట్టలేదు. చాలా ఎత్తునించి పడటంవల్ల పచ్చడైపోయింది. ఆ అమ్మాయి శరీరంలోని ఎముకలు దాదాపు చాలా విరిగిపోయేయి. వెంటనే ప్రాణంపోయి వుంటుంది. కార్లో మంటలు లేకపోవడంవల్లా ఆ కారు నెంబర్నిబట్టి ఆమె ఎవ్వరో సులువుగా తెలిసిపోయింది!"

"ఎవ్వరు?"

"కోవెలూర్ నివాసి, రిటైర్డ్ తహసీల్దార్ భుజంగరావ్ గారి చిన్నకూతురు సుఖమయి!"

నిర్ఘాంతబోయేను! క్షణంపాటు నానోటినించి మాట బైటికి రాలేదు! ఎంతవిచిత్రం! ఇంతవరకూ నే నీ వృత్తిలో ఎన్నో చిత్రవిచిత్ర సంఘటనల్ని ఎదుర్కొన్నాను గాని, మరీ ఇంత థ్రిల్ గా ఏ కేసులోనూ ఫీల్ కాలేదు.

"ఇక్కడ ఉంటున్న తన స్నేహితురాలు ఇంటికి వెళతానని చెప్పి, కోవెలూర్ నించి ఉదయం పదిగంటలకి కార్లో బయలుదేరిందిట సుఖమయి. మమ్మల్ని ఆశ్చర్యపరచిన విషయం ఏమిటంటే కోవెలూర్ నించి, ఇక్కడికి రావడానికి కార్లో గంటప్రయాణం! ఐతే ఉదయం బైలు దేరిన సుఖమయి అసలు ఈ ఊరికి చేరుకోనేలేదు. ఆరోజు రాత్రి రెండుగంటల ప్రాంతంలో ఆమె ఏక్సిడెంట్ కిగురై మరణించింది. ఉదయం బయలుదేరిన వ్యక్తి అంతవరకూ ఎక్కడుంది? ఏంచేసింది? ఈ ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోయేయి. ఇన్స్పెక్టర్ గణేశన్, ఎంత వాకబ్

జేసినా ప్రయోజనం లేకపోయింది!'' అన్నాడు సార్జంట్.

''ఏక్సిడెంట్ రాత్రే జరిగిందని ఎలా నిర్ణయించేరు? ఆ అమ్మాయి పగలు పదిగంటలకి కోవెలూర్ నించి బయలు దేరింది. ఏక్సిడెంట్ పగలే జరిగివుండవచ్చుగా? ఏక్సిడెంట్ జరిగినట్టు మీకెలా తెలిసింది?''

సార్జంట్ తల విదిలించేడు. ''ఏక్సిడెంట్ పగలు జరగ లేదని చెప్పడానికి నిర్దుష్టమైన ఆధారాలున్నాయి. పగలు ఆ రోడ్ మీద కార్లూ, లారీలూ తిరుగుతూనే వుంటాయి. అంతేకాదు, ఆ అమ్మాయి కారుపడ్డ ప్రదేశంలో లంబాడీలూ, కోయజాతివాళ్ళూ, కట్టెలకోసం, వేటకోసం పగలంతా తిరుగుతూనే ఉంటారు. ఏక్సిడెంట్ పగలు జరిగి వుంటే, ఎవ్వరో ఒకరు మాకు తెలీజేసేవారు. రాత్రి ఏక్సిడెంట్ జరిగింది. తెలతెలవారుతుండగా ఇద్దరు లంబాడీలు పరుగెత్తుకువచ్చి మా కాకాను గురించి చెప్పేరు. ఇన్‌స్పెక్టర్ గణేశన్‌తో నేనూ, మరికొంత సిబ్బందీ హుటాహుటిన అక్కడికెళ్ళాం. సుఖమయి శవాన్ని పోస్ట్ మార్టం జేశాక, ఆ అమ్మాయి రాత్రి రెండుగంటల ప్రాంతంలో ప్రాణంవిడిచి ఉంటుందని తేల్చేడు డాక్టర్!''

సాలోచనగా తలూపేను. ఇంతలో బయట మోటార్ బైక్ వచ్చిన శబ్దం వినిపించింది. సార్జంట్ కిటికీలోంచి తొంగిచూసి, ''ఇన్‌స్పెక్టర్ గణేశన్ వచ్చేరు!'' అంటూ లేచేడు.

బూట్సు టకటక చప్పుడు జేసుకుంటూ లోనికివచ్చేడు ఇన్‌స్పెక్టర్. సార్జంట్ ఏదో చెప్పబోతుండగా, చటుక్కున జేబులోంచి నా విజిటింగ్ కార్డ్ తీసి ఇన్‌స్పెక్టర్ చేతిలో పెట్టేను.

''మీ గురించి చాలా విన్నాను. పోయిన ఐ. జి. పి. రిటైరైన సందర్భంలో ఇచ్చిన సెండాఫ్ పార్టీలో మిమ్మల్ని

చూసేను. ఏకో ఓ కేసులో మీతో కలిసి పని చెయ్యాలని కోరికవుంది నాకు. ఇలా, అనుకోకుండా కలుసుకుంటా ననుకోలేదు. ఏదో ఇన్వెస్టిగేషన్‌లో వచ్చి ఉంటారను కుంటాను. ప్లీజ్! కూర్చోండి" అంటూ షేక్‌హాండ్ ఇచ్చేడు ఇన్‌స్పెక్టర్ విజిటింగ్ కార్డు చూసి.

ఇన్‌స్పెక్టర్ గణేశన్‌తో కొద్దిసేపు మాట్లాడి, సెలవు తీసుకొని, సరాసరి టాక్సీస్టాండ్ కెళ్ళి ఓ టాక్సీమాట్లాడు కుని కోవెలూర్ బయలుదేరేను.

సరిగ్గా మూడున్నరకి కోవెలూర్ జేరుకున్నాను. సీక్లాస్ సిటీ కనక భుజంగరావ్ ఇల్లు కనుక్కోడం ఏమంత కష్టం కాలేదు. భుజంగరావ్ మేడని చూస్తుంటే మంచి ఆస్తి పరుడన్న భావం కలుగుతుంది. టాక్సీదిగి, మెయిన్ గేటు గుండా లోని కెళ్ళాను.

## 5

"కూర్చోండి!" అన్నాడు భుజంగరావ్ సోఫా చూపిస్తూ.

"నేను మద్రాసునించి వెలువడే 'దినమణి' పత్రికా విలేఖర్ని!" అన్నాను కూర్చుంటూ.

భుజంగరావ్ కళ్ళు పెద్దవిచేసి, "చెప్పండి!" అన్నాడు.

"కొన్నాళ్ళక్రితం మీ అమ్మాయి సుఖమయి కారు ఏక్సిడెంట్‌లో పోయేరుకదూ?" అడిగేను.

భుజంగరావ్ క్షణం పలకలేదు. దీర్ఘంగా నిట్టూర్చి అన్నాడు_"ఔను! నాకు మగసంతానం లేదు. ఇద్దరే కూతుళ్ళు. సుగంధి, సుఖమయి. తరాలకి సరిపడే ఆస్తి వుంది. మగసంతానం కలుగుతుందనే ఆశ లేకుండా, సుఖమయి తరవాత నా భార్య పోయింది. ఇంక వాళ్ళిద్దరే

నాకు సర్వం అనుకున్నాను. ఆ పరిస్థితిలో గారాబం సహజమే కనక ఇద్దర్నీ ప్రాణంలా పెంచేను. టీన్ ఏజ్ కనక సుఖమయిలో కాస్త చలాకీపాలు ఎక్కువ. పాతిక రోజుల క్రితం, తిరువత్తియూర్‌లో ఉండే ఆమె స్నేహితురాల్ని చూసివస్తానని కార్లో వెళ్ళింది. అంతే..."

భుజంగరావ్ ఆగిపోయేడు. గొంతు పెగలడంలేదు కాబోలు. ఉత్తరీయంతో కళ్లు ఒత్తుకున్నాడు.

"మీ మనఃక్లేశాన్ని ఈ విధంగా కెలికినందుకు మన్నించండి! గత ఆదివారం, తిరువత్తియూర్ నించి వెలువడే న్యూస్ హెరాల్డ్ దినపత్రికలో జ్ఞాపకశక్తి కోల్పోయిన యువతి ఫోటో ఒకటి ప్రకటించేరు. ఆ ఫోటో చూసి మీరు డాక్టర్ బెనర్జీకి ఫోన్ చేసేరట. ఆ ఫోటో చూసేక ఆ అమ్మాయి మీ ఎల్డర్ డాటర్ సుగంధి అన్న అనుమానం దేనికి కలిగింది మీకు?" అడిగేను.

"ఆ ఫోటో మా సుగంధిని చాలావరకు పోలివుంది. ముందే సుఖమయిపోయిన షాక్‌లోంచి నేనింకా తేరుకోలేదు. ఫోటో చూడగానే ఖంగారుపడి డాక్టర్ బెనర్జీకి ఫోన్ చేసి కనుక్కున్నాను. ఆ అమ్మాయి పేరు కాత్యాయని అనీ, మద్రాసునించి ఆమె తండ్రి వచ్చి ఆమెని తీసికెళ్ళాడనీ డాక్టర్ చెప్పడంతో సమాధానపడ్డాను!"

"మీ అమ్మాయి అప్పుడు ఇంట్లో లేదా?"

"లేదు! సుఖమయి మరణం సుగంధిమీద చాలా దెబ్బ తీసింది. కొన్నాళ్ళు వాళ్ళ మేనమామ ఇంట్లో వుండి వస్తానని కార్లో సిరిపురం వెళ్ళింది!"

"ఆమె క్షేమంగా సిరిపురం చేరుకుందో, లేదో కనుక్కున్నారా?"

"లేదు! డాక్టర్ బెనర్జీ పేపర్లో చూసిన ఆ అమ్మాయిని

ఆమె తండ్రి వచ్చి తీసికెళ్ళాడని చెప్పడంతో ఊరు కున్నాను. అదీగాక, సిరిపురానికి టెలిఫోన్ సౌకర్యం లేదు. చాలా చిన్న ఊరు."

"ఆమె వెళ్ళి వారం అవుతోంది. అక్కణ్ణించి మీకేమైనా ఉత్తరాలు రాసిందా?"

"లేదు!"

"దేనికైనా మంచిది! ఓమారు సిరిపురం కబురుచేసి కనుక్కోండి!"

"ఔను! ఇవాళే ఉత్తరం వ్రాస్తాను."

"మీ అమ్మాయిల ఫోటోలు ఏవైనా ఉంటే చూపిస్తారా?"

భుజంగరావ్ క్షణం నావేపు చూసి, సాలోచనగా తలూపుతూ లేచివెళ్ళి రెండు ఫోటోలు పట్టుకొచ్చేడు.

"ఇది చిన్నమ్మాయి సుఖమయి ఫోటో!" అంటూ ఓ కేబినెట్ సైజు ఫోటో అందించేడు.

పద్దెనిమిదేళ్ళుంటాయి. చూడగానే ఆకట్టుకునే ముఖం. నవ్వుతోంది!

రెండో ఫోటోని చేతికిస్తూ- "ఇది పెద్దమ్మాయి సుగంధి ఫోటో!" అన్నాడు భుజంగరావ్.

ఫోటో చూసి అదిరిపడ్డాను. రెప్ప వేయకుండా అలాగే చూస్తూండిపోయాను. సందేహంలేదు. ఆ అమ్మాయే! బ్రిడ్జ హోటల్లో ఆ రౌడీలకి నన్ను చూపెట్టిన అమ్మాయే! నా అనుమానం పటాపంచలైపోయింది. మతిపోగొట్టుకున్న స్థితిలో హాస్పిటల్‌కి చేర్చబడి, పేపర్లో ప్రకటించబడి, ఎవ్వరో అనామకుడి వెంట వెళ్ళిపోయిన కాత్యాయని భుజంగరావ్ కూతురు సుగంధే!

ముందే ఒక కూతురు పోయిన దుఃఖంతో కృంగిపోతున్న వ్యక్తికి, ఈ నగ్నసత్యం చెబితే తట్టుకోగలడా? వద్దు!

చెప్పకూడదు. చెప్పలేను కూడా! నిజం ఎలాగూ దాగదు. ఎప్పుడో ఒకప్పుడు దానంతటదే తెలిసిపోతోంది. ఈ కేసు అంతు తేల్చేవరకూ నిదరపోకూడదు. దృఢ నిశ్చయంతో లేచేను.

"ఏం, వెళుతున్నారా? కాఫీ తీసుకు వెళ్ళండి!" అన్నాడు భుజంగరావు వారిస్తూ.

"థాంక్స్! మళ్ళీ వచ్చినప్పుడు తీసుకుంటాను. తిరువత్తియూర్‌లోని మీ అమ్మాయి సుఖమయి స్నేహితురాలి పేరేమిటి? ఐ వాంట్ టు సీ హర్!"

"ఆ అమ్మాయి ఇక్కడే హాస్టల్లో వుండి చదువుకుంటోంది. బి. ఏ. థర్డియర్ స్టూడెంట్. పేరు లలిత. సెలవు రోజుల్లో ఇంటికెళ్ళి వస్తుంటుంది!"

"థాంక్స్! మీరు వెంటనే సిరిపురానికి లెటర్ వేసి మీ అమ్మాయి గురించి కనుక్కోండి!" అన్నాను అతనికి షేక్‌హాండ్ ఇస్తూ.

# 6

అదే గర్ల్స్ డిగ్రీ కాలేజ్! మెయిన్ గేటు గుండా లోనికెళ్ళాను. చేతుల్లో పుస్తకాలు, నోట్ బుక్స్ పట్టుకుని హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు అమ్మాయిలు.

ఆఫీసులో కెళ్ళి లలితని చూడ్డానికి తిరువత్తియూర్ నించి వచ్చినట్టు చెప్పేను.

"వెయిటింగ్ రూంలో కూర్చోండి! పిలిపిస్తాను!" అంది క్లర్కు.

ప్యూన్ నన్ను వెయిటింగ్ రూంలో కూర్చోబెట్టి వెళ్ళిపోయింది. లీజర్ పీరియడ్ స్టూడెంట్స్ అక్కడక్కడ కూర్చుని ఏవో నోట్స్ రాసుకుంటున్నారు.

పదినిమిషాల తరవాత ప్యూన్‌తో లోనికి ప్రవేశించింది

లలిత. వేలితో నన్ను చూపించి వెళ్ళింది ప్యూన్. లలిత కనుబొమలు ముడిచి, నే నెవ్వరో గుర్తుపట్టడానికి ప్రయ త్నిస్తున్నట్టు చూస్తూ దగ్గరికి వచ్చింది.

"ఎక్స్‌క్యూజ్ మీ! నిన్ను డిస్టర్బ్ చేసినందుకు మన్నించమ్మా! ప్లీజ్, సిడౌన్!" అన్నాను సోఫా చివరికి జరుగుతూ.

"మీరూ..." మాటని మధ్యలోనే తుంచి సంశయిస్తూ కూర్చుంది.

"నేను మద్రాసు క్రయింబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ యుగంధర రెడ్డిని!"

లలిత కళ్ళు పెద్దవయ్యాయి!

"నీ స్నేహితురాలు సుఖమయి కేసుగురించి దర్యాప్తు జేస్తున్నాను!" అన్నాను జేబులోంచి సిగరెట్ కేస్ తీస్తూ.

ఆ మాటతో ఆ అమ్మాయి ముఖం వివర్ణమైనట్టు పసిగట్టేను.

"మీరు వాళ్ళ నాన్నగార్ని కలుసుకుంటే బావుంటుందేమో!" అంది చేతివేళ్ళు చూసుకుంటూ.

"అక్కణ్ణించే వస్తున్నాను. నా ఉద్దేశంలో సుఖమయిది ఏక్సిడెంటల్ డెత్ కాదు! ఆమెని ఎవ్వరో కావాలని హత్యజేసేరు!"

"వాట్!? సుఖమయి కారు ఏక్సిడెంట్‌లో మరణించిందిగా!?"

నవ్వేను— "నీవింకా టీన్ ఏజర్‌వి! ఈ లోకాన్ని క్షుణ్ణంగా అర్థంజేసుకోవడానికి ఇంకా నీ వయసు పండాలి! ఒక మనిషిని చంపడానికి లక్షపద్ధతులున్నాయి. సుఖమయి మరణించిన పరిసితులు అనుమానాస్పదంగా ఉన్నాయి. ఆమెకి చాలా దగ్గరి స్నేహితురాలివి నీవు. నీకు ఆమె పెర్సనల్ విషయాలు ఏమైనా తెలిసివుంటే, దాచకుండా

చెప్పేయ్! నా పరిశోధన సాఫీగా ముందుకి సాగుతుంది!"

వేళ్ళు రాసుకుంటూ క్షణం మాట్లాడలేదు లలిత. "నా స్నేహితురాలి అత్యంత సీక్రెట్ విషయం ఇది! ఎలా చెప్పాలా అని..." అంది నానుస్తూ.

"చూడమ్మా! ఇది ఆలోచిస్తూ కాలం వృధా చేసే సమయంకాదు. నువ్వు చెప్పే విషయాలు నేరస్తుణ్ణి సాధ్యమైనంత త్వరలో పట్టుకోడానికి పనికి రావచ్చు! అంతే కాదు, ఇప్పుడు సుఖమయి అక్క సుగంధి కూడా అపాయంలో ఉంది. బహుశా హంతకుడు ఆమెనీ హత్య చెయ్యవచ్చు!"

"మైగాడ్! ఐతే, చెబుతాను సార్! తప్పకుండా చెబుతాను. సుఖమయి చనిపోడానికి ఒకరోజు ముందు ఇక్కణ్ణించి తిరువత్తియూర్‌లో ఉన్న మా ఇంటికి ఫోన్ చేసింది. తను ఓ ముఖ్యమైన పనిమీద ఒకచోటికి వెళుతున్నాననీ, ఇంట్లో నా దగ్గరకి వస్తున్నట్టు అబద్ధం చెప్పేననీ, తనవాళ్ళు తనగురించి అడిగితే నా దగ్గరే ఉన్నట్టు చెప్పమనీ రిక్వెస్ట్ చేసింది. ఎక్కడికి వెళుతున్నావని ఎంత అడిగినా చెప్పలేదు. ఆ విషయం చెప్పమని ఫోర్స్ చెయ్యవద్దనీ, అది తన భవిష్యత్తుకు సంబంధించిన విషయమనీ, వీలుచూసుకుని తనే చెబుతాననీ చెప్పింది. నా డియరెస్ట్ ఫ్రెండ్ కనుక ఏమీ అనలేకపోయేను. అంతే! మర్నాటి రాత్రి సుఖమయి చచ్చిపోయింది!" లలిత కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

నా బుర్ర చురుగ్గా పని చెయ్యసాగింది! ఇటీజ్ ది మోస్ట్ ఇంపార్టెంట్ పాయింట్. తిరువత్తియూర్‌లో ఉన్న లలిత ఇంటికి వెళుతున్నానని ఇంట్లో అబద్ధం చెప్పి, సుఖమయి ఎక్కడికి కెళ్ళింది? ఏం చేసింది?

"ఆమె కెవరైనా బాయ్‌ఫ్రెండ్ వున్నాడా?"

"వరప్రసాద్ అనే అతనితో చనువుగా వుంటుంది. కానీ అతనెవరో, ఎక్కడుంటాడో నాకు తెలియదు" చెప్పింది లలిత.

# 7

తిరువత్తియూర్ రోడ్ సర్కిల్లో టాక్సీ ఆపించి దిగేను. ఊళ్ళో అప్పుడే లైట్లు వెలిగేయి. రోడ్డుమీద కాస్త రద్దీ ఉంది. టాక్సీ ఫేర్ చెల్లించి, చుట్టూ పరీక్షగా చూస్తూ ఫుట్ పాత్ మీద నడవసాగేను. ఎదురుగా కనిపిస్తోంది ఓ ఇరానీ కేఫ్! మద్రాసుకి ఫోన్ చేసి నా అసిస్టెంట్ ఇన్స్పెక్టర్ రాజారావ్ని పిలిపించాలి.

కేఫ్లో కెళ్ళి మద్రాసుకి ట్రంకాల్ బుక్ చేసేను.

రాజారావ్తో మాట్లాడి కేఫ్లోంచి బైటపడేసరికి అరగంట పట్టింది. తక్షణం బైలుదేరి నేను దిగిన హోటల్కి వస్తానని చెప్పేడు రాజారావ్. మద్రాసునించి తిరువత్తియూర్ చేరడానికి రెండుగంటలు కూడా పట్టదు.

రంగురంగుల లైట్ల తళుకుల్లో వెలిగిపోతున్నాయి దుకాణాలు. పాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని, షాప్స్ వేపు చూస్తూ ఫుట్ పాత్ మీద అడుగులు వేస్తున్నాను. రోడ్డు కుడిపక్క ఓ రెడిమేడ్ షాప్ వేపు చూడగానే నా గుండె ఝల్లుమంది. కాళ్ళకి బ్రేకులుపడ్డాయి.

సేల్స్ కౌంటర్లో నిల్చున్న అమ్మాయిని చూసి, ఒక్కసారి "సుగంధి!" అన్న పదం నాకు తెలీకుండానే నోట్లోంచి బైటికి వచ్చింది. ఆశ్చర్యంతో గుండె వేగం అందుకుంది.

కాస్త పరీక్షగా చూసేక తెలిసింది నేను పొరబడ్డానని! నా పొరపాటుకి కారణం, ఆ అమ్మాయి తొడుక్కున్న రాకెట్స్ ప్రింట్ చేసిన, నీలిరంగు బెల్ బాటమ్

సూట్! ఆ సూట్ సరిగ్గా నిన్న రాత్రి బిడ్డి హోటల్లో రౌడీలవెంట కనిపించిన సుగంధి వేసుకున్నది లాగే ఉంది.

ఉండబట్టలేక గబగబ షాప్ వేపు నడిచేను. సేల్స్ గర్ల్ నన్ను చూడగానే చిరునవ్వుతో ఆహ్వానించింది. ఆ అమ్మాయిలో సుగంధి పోలికలు ఏమీ లేవు!

"చెప్పండి! మా దగ్గర లేటెస్ట్ ఫాషనబుల్ రెడీమేడ్ సూట్స్ దొరుకుతాయి. చూపించమంటారా?" అడిగింది మర్యాదగా.

నవ్వి అన్నాను. "సరిగ్గా నువ్వు తొడుక్కున్నటువంటి బెల్ సూట్ కావాలి! ఉందా?"

"మీకా?" విరగబడి నవ్వుతూ అడిగింది.

"నో. నో! మా అమ్మాయికి. నీ వయసే ఉంటుంది!"

"అయామ్ సారీ! ఇలాంటి సూట్ మా షాప్లో లేదు. అంతేకాదు, ఈ టౌన్లో ఎక్కడా దొరకదు!"

"మరి నీ వెక్కడ కొన్నావ్?"

ఆ అమ్మాయి పకపక నవ్వింది. "ఈ డ్రెస్ దో విచిత్రమైన కథలెండి! ఈ రోజు సాయంత్రం ఓ యువతి షాప్లోకి వచ్చింది. తను చాలా కష్టాల్లో ఉన్నాననీ, చేతిలో చిల్లిగవ్వ లేదనీ, ఇంట్లో తగాదాపడి పారిపోయి వచ్చేననీ, ఈ షాప్లో ఏదైనా ఉద్యోగం ఖాళీవుంటే ఇప్పించమనీ వేడుకుంది.

"మా షాప్ యజమానురాలు చాలా స్వీట్ నేచర్ గలది. ఆ అమ్మాయిని చూస్తే చాలా జాలి వేస్తుంది. గొప్పింటి బిడ్డలావున్నా, రెండు మూడు రోజుల్నించి తిండి తిప్పల్లేక బాగా వాడిపోయి కనిపించింది. ఏ ఊరు, ఏం పేరడిగితే సమాధానం చెప్పదు. వెక్కి వెక్కి ఏడుస్తుంది. పాపం మానసికంగా చాలా కృంగిపోయి ఉందనీ, కాస్త రిలీఫ్ దొరికితే తనే చెబుతుందనీ ఆమె పరిస్థితికి

జాలిపడి, డ్రైవాష్ సెక్షన్‌లో జాబ్ ఇచ్చింది మా ప్రొప్రైటరెస్!

"ఆ అమ్మాయి ఎంత భయంగా ఉందంటే, తను తొడుక్కున్న ఈ బెల్‌బాటమ్ సూట్ ఎవ్వరైనా చూసి గుర్తుపట్టి, మళ్ళీ తనని ఇంటికి లాక్కెళ్ళవచ్చనీ, నా చీర తను కట్టుకుంటాననీ, తను తొడుక్కున్న బెల్ సూట్ కొన్నాళ్ళు నన్ను తొడుక్కోమనీ బ్రతిమాలింది. ఇది చాలా ఖరీదైన సూట్. పైగా కొత్తది! నేను అభ్యంతరం చెప్పకుండా, నా చీర ఆమె కిచ్చి ఈ సూట్ తీసుకున్నాను!"

నా గుండెల్లో గుర్రాలు దౌడుతీసేయి. సందేహంలేదు. ఆ అమ్మాయి ఎవ్వరోకాదు. సుగంధి! వెతకబోయిన తీగ కాలికి తగిలింది. ఎంత విచిత్రం! సుగంధి బ్రతికే ఉంది. క్షేమంగా ఉంది. ఆ కిరాతకులకి చిక్కకుండా తనని తాను కాపాడుకుంది.

"ఇప్పుడా అమ్మాయి ఎక్కడుంది?" నా ఆత్రుతని బైటపడనివ్వకుండా అడిగేను.

"మా యజమానురాలి ఇంట్లో! రెండు రోజులు రెస్టు తీసుకున్నాక పన్లో చేరమని ఆ అమ్మాయిని తనింటికి తీసికెళ్ళిందావిడ!"

"ఆవిడ పేరేమిటి? ఎక్కడుంటుంది?"

"పార్వతమ్మాళ్! కోయిల్ వీధి. డోర్ నెంబర్ 710. ఇంతకీ, దేనికలా అడుగుతున్నారు?" సేల్స్‌గర్ల్ కంఠంలో అనుమానం ధ్వనించింది.

"ఆ అమ్మాయి ఎవ్వరోకాదు. నా కజిన్ డాటర్! వివరాలు చెప్పినందుకి నీకు మెనీ థాంక్స్!" ఆశ్చర్యంతో విప్పారిన ఆ పిల్ల ముహం చూడకుండా వెనుదిరిగేను.

# 8

"ఈ రోజు మీరు ఓ కొత్త అమ్మాయికి మీ షాప్‌లో ఉద్యోగం ఇచ్చేరటగా?" అడిగేను పార్వతమ్మాళ్ చూపించిన సోఫాలో కూర్చుంటూ.

ఆవిడ తలూపి, ప్రశ్నార్థకంగా చూసింది.

"ఆ అమ్మాయి నా కజిన్ డాటర్! వారం రోజుల క్రితం ఇంట్లో తగాదాపడి ఇల్లువిడిచి వచ్చేసింది. అప్పటి నించి నిద్రాహారాలు మాని ఆమెకోసం వెదుకుతున్నాం! ఎంక్వైరీ జేస్తే మీ దగ్గిర తలదాచుకున్నట్టు తెలిసింది!" అన్నాను.

పార్వతమ్మాళ్ నిట్టూర్చింది. "ఈ కాలం పిల్లలు అంతే నండీ. వేడిరక్తం! తమ మాటే నెగ్గాలంటారు. పెద్దవాళ్లు కాస్త పట్టుబడితే, ఇలాంటి అఘాయిత్యాలే ఏవో చేసి తమ పంతం నెగ్గించుకుంటారు. నాకూ ఓ కొడుకుండే వాడు. చాలా చిన్న విషయానికి తగాదాపడి చెప్పా చెయ్యకుండా మిలిటరీలో చేరిపోయేడు. ఏంచేస్తాం? కలి కాలం!" అంది వేదాంత ధోరణిలో.

"మా అమ్మాయి ఎక్కడుంది?" అడిగేను ఇల్లు పరీక్షగా చూస్తూ.

"లోపల! పడుకుంది. పిల్చుకొస్తానుండండి" అంటూ లోనికెళ్ళి, ఐదు నిమిషాల్లో తిరిగి వచ్చింది పార్వతమ్మాళ్. ఆమె వెనక వచ్చిన అమ్మాయిని చూడగానే నా కళ్ళు విప్పారేయి.

సందేహంలేదు. ఆమె సుగంధే! అప్పుడు బెల్ బాటమ్ సూట్ లోవుంది. ఇప్పుడు చీరకట్టుకుంది.

నన్ను చూడగానే ఉలిక్కిపడి వెనుదిరగబోయింది. ఆమె లోనికెళ్ళకుండా మెరుపులా లేచి వెళ్ళి చెయ్యిపట్టు కున్నాను. బెదిరిన లేడిలా చూసింది.

"అమ్మా సుగంధీ! నీకోసం మీ అమ్మా, నాన్నా ఎంత ఖంగారు పడుతున్నారో తెలుసా? ఇంటికి వస్తే నీవు ఎలా చెబితే అలా వింటామని మాటిచ్చేరు. పదమ్మా!" అప రాధ పరిశోధనలో సమయాన్నిబట్టి అలా నటించడం అత్యవసరం. సుగంధ నావేపు విచిత్రంగా చూస్తోంది!

"వెళ్ళమ్మాయ్, వెళ్ళు! ఆడపిల్లలు మరీ అంత పెట్టు చెయ్యకూడదు!" నేనూహించినట్టే పార్వతమ్మాళ్ నాకు సపోర్టిచ్చింది.

సుగంధి మారుమాటాడకుండా నావెంట బైటికి వచ్చింది. వీధిలో ఓ టాక్సీ ఆపి, ఫోర్ స్క్వేర్ హోటల్ కి పోనియ్యమని, సుగంధితో బాక్ సీట్లో కూర్చున్నాను.

# 9

"నన్ను సుగంధి అని పిలిచేరుకదూ? నిజంగా నాపేరు అదేనా?" వణికే కంఠంతో అడిగింది సుగంధి.

ఆప్యాయంగా వీపుతట్టి అన్నాను–"హోటల్ చేరగానే వివరాలన్నీ చెబుతాను! భయపడక!"

సుగంధి మళ్ళీ పలకలేదు. హోటల్ చేరేవరకూ పిచ్చి పిచ్చిగా నన్నే చూస్తూ కూర్చుంది.

డ్రైవర్ కి బిల్ పే చేసి, ఆమెని నా రూంలోకి తీసి కెళ్ళేను. గదితలుపు మూసి, "కూర్చో!" అన్నాను.

బుద్ధిగా కూర్చుని అడిగింది. "నిన్నరాత్రి ఆరౌడీలకి నేను చూపించిన వ్యక్తి మీరేకదూ? పార్వతమ్మాళ్ దగ్గర, మా బంధువని దేనికి అబద్ధమాడేరు?"

సోఫాలో కూర్చుని జేబులోంచి సిగరెట్ కేస్ తీసేను "నిన్ను రక్షించడానికి అలా అబద్ధమాడవలసి వచ్చింది. నిజంగా నీపేరు సుగంధే! నిన్నరాత్రి నువ్వు ఆ రౌడీలకి చూపించిన వ్యక్తిని నేనే!!" అంటూ సిగరెట్ అంటిం చేను. గట్టిగా పొగలాగి వదిలి అడిగేను.

"ఇప్పుడు చెప్పు! ఆ రౌడీలకి నన్ను దేనికి చూపించేవు? ఎవ్వరు వాళ్ళు?"

"మీ రెవ్వరో చెప్పనే లేదు! నా విషయంలో దేనికింత ఆసక్తి తీసుకుంటున్నారు?"

"నేను మద్రాసు క్రైంబ్రాంచ్ పోలీస్ ఇన్స్పెక్టర్ని. నీగురించి ఎన్నో వివరాలు సేకరించేను. ముందు నా ప్రశ్నలకి జవాబివ్వు. ఈ నెల పదహారవ తేదీ, శనివారం రాత్రి నువ్వు తిరువత్తియూర్ నించి కోవెలూర్ వెళ్ళే నిర్మానుష్యమైన రోడ్డుమీద ఓ అజ్ఞాతవ్యక్తికి కనిపించావ్. అతను తనకార్లో నిన్ను ఇక్కడ సిటీ హాస్పిటల్ కి చేర్చి వెళ్ళిపోయేడు. తరవాత పేపర్లోపడ్డ నీఫోటో చూసి విశ్వనాథం పేరుతో నీతండ్రినంటూ వచ్చి ఓ మోసగాడు నిన్ను హాస్పిటల్ నించి తీసికెళ్ళేడు..." నామాట ఇంకా పూర్తి కాలేదు.

"ఆగండి! ఇంకేం చెప్పకండి! మొదటినించీ ఇప్పటి వరకూ జరిగిన విషయాలన్నీ మీకు చెప్పేస్తాను!" అంది సుగంధి మధ్యలో.

క్యూరియాసిటీతో కాస్త ముందుకువంగి కూర్చున్నాను.

భారంగా నిట్టూర్చి చెప్పసాగింది. "ఔను! ఆ భయంకర మైన చీకటిరాత్రి నేను ఓ నిర్మానుష్యమైన రోడ్డుమీద రోడ్డుకి కాస్త ఎడంగా ఓ పెద్ద రాయిమీద స్పృహ తప్పి పడున్నాను. కళ్ళు తెరిచిచూస్తే, ఆ బండపక్కనే పెద్ద అగాధం కనిపించింది. భయంతో గావుకేక పెట్టేను. చుట్టూ మసక చీకటి. కీచురాళ్ళ నిస్వనం. చుట్టుపక్క లెక్కడా మనిషిమాత్రుడు లేడు.

"నేనెవ్వరో, అక్కడ దేనికి పడున్నానో, అంతకి ముందు ఏం జరిగిందో నాకేమీ గుర్తురావడంలేదు. కణత మీద విపరీతమైన నొప్పి. సుత్తితో కొట్టినట్టు తల జివ్వు

మంటోంది. అతికష్టంమీద లేచి, జాగ్రత్తగా చూసు కుంటూ రోడ్ వైపు నడిచేను. సరిగ్గా అదే సమయంలో ఆవేపు ఓకారు వస్తున్నట్టు లైట్లు కనిపించేయి. తిన్నగా వెళ్ళి రోడ్ మధ్య నిల్చున్నాను. కారువచ్చి నాముందు ఆగిపోయింది.

"కార్లో ఒకేఒక వ్యక్తి కూర్చునున్నాడు. నన్ను చూసి ఎన్నో ప్రశ్నలు వేసేడు. ఏమీ చెప్పలేకపోయేను. చివ రికి నా బట్టలూ, నా పరిస్థితీ, కణతమీద గాయం చూసి వెంటనే కారుతలుపు తెరిచి లోన కూర్చోమన్నాడు. నా తలలోనూ, ఒంట్లోనూ విపరీతంగా నెప్పివుందనీ, నాపేరే మిటో, నేనెవ్వరో జ్ఞాపకం రావడంలేదనీ, వెంటనే ఏదైనా సాయంచెయ్యమనీ వేడుకున్నాను. ఆ సమయంలో నన్ను తనింటికి తీసికెళ్ళలేననీ, కావలిస్తే హాస్పిటల్ వరకూ తీసి కెళ్ళి వదిలిపెడతాననీ చెప్పి, కారు వెనక్కితిప్పి, ఇక్క డికి తీసుకువచ్చేడు. హాస్పిటల్ గేటు దగ్గర వదిలిపెట్టి వెళ్ళిపోయేడు!"

"చిత్రమైన మనిషి! తన పేరుకూడా చెప్పలేదా?" అడిగేను.

తల అడ్డం తిప్పింది సుగంధి. "పేరు చెప్పేవాడైతే, నన్ను హాస్పిటల్లోకి తీసికెళ్ళి డాక్టర్ కప్పగించేవాడు. అటువంటప్పుడు నేను అతనికి ఎక్కడ దొరికానో చెప్ప వలసివస్తుందనీ, తన భార్య చాలా అనుమానపు మనిషనీ, గయ్యాళి రకమనీ, తనపేరూ, నేను తనకి ఏ రోడ్ మీద దొరికానో చెబితే, ఆ సంగతి తన భార్యకి తెలిస్తే అంత రాత్రివేళ తనా రోడ్ మీద దేనికి వెళ్ళవలసి వచ్చిందని రాచిరంపాన పెడుతుందనీ సంజాయిషీ చెప్పుకున్నాడు!"

నవ్వుకున్నాను. పెళ్ళాం మంచిదికాదని ఆమె కళ్ళు గప్పి ఎవ్వరో ప్రియురాలిని కలుసుకోడానికి కార్లో ఆవేపు

వెళుతున్నాడు కాబోలతను. నా ఆలోచనకి బ్రేక్ వేస్తూ చెప్పింది సుగంధి. "అతను తన గురించి ఏమీ చెప్పలేక పోయినా, కాకతాళీయంగా అతనెవ్వరో, చిరునామా ఏమిటో నాకు తెలిసిపోయింది!"

"ఎలా?" ఆత్రంగా అడిగేను.

"నన్ను కార్లో కూర్చోబెట్టడానికి అతను ముందుకు వంగి, కారు తలుపు తెరుస్తున్నప్పుడు, కోటుజేబులోంచి అతని విజిటింగ్ కార్డు సీట్లో పడిపోయింది. నేను కారులో కూర్చోగానే తెల్లగా కాగితంలా కనిపించినదాన్ని అందుకుని, నా కణతలోంచి కారుతున్న రక్తాన్ని ఆపడానికి కణత దగ్గర అదిమి పట్టుకున్నాను. అతను నన్ను హాస్పిటల్ గేటుదగ్గిర వదిలి వెళ్ళిపోయేక చూసేను. ఎక్సైజ్ ఆఫీసర్, వినోద్ కుమార్, హిల్ రోడ్, తిరువత్తియూర్ అని ఉంది. చదవగానే చించివేసేను.

క్షణం ఆగి చెప్పసాగింది. "మర్నాడు నా తండ్రినంటూ ఓ వ్యక్తి హాస్పిటల్ కి వచ్చేడు. అతను నిజంగా నా తండ్రి అవునో కాదో ఎంతకీ నాకు జ్ఞాపకంరాలేదు. మారు మాటాడకుండా, అతనివెంట హాస్పిటల్ బైటికి వచ్చేను. గేటుదగ్గిర ఆగివున్న కారులో కూర్చోగానే, అతను తినడానికి కొన్ని సేండ్విచెస్ ఇచ్చేడు నాకు. బాగా ఆకలిలో ఉండటంవల్ల కాదనకుండా తీసుకున్నాను. అవి తిన్న మరుక్షణం నాకళ్ళు బైర్లుకమ్మేయి. నాకు తెలీకుండానే, సీట్లో ఒరిగిపోయేను. కళ్ళు తెరిచి చూస్తే ఓ గదిలో బంధించబడున్నాను.

"నాకేమీ అర్థంకాలేదు. నిన్నరాత్రి హోటల్లో మీతో పోట్లాడిన బోడిగుండు రోజూ రెండుపూటల భోజనం తెచ్చిపెట్టేవాడు. నన్ను కారులో హాస్పిటల్ చేర్చిన వ్యక్తి ఎవ్వరో, అతని పేరేమిటో చెప్పమని నానా

హింసలు పెట్టేరు. వాళ్ళలా అతని గురించి ఆరాతీస్తుంటే నా కనుమానం వేసింది, నేను నిజంచెబితే వాళ్ళతన్ని చంపేస్తారని. అందుకే నోరు విప్పలేదు.

"చివరికి నిన్నరాత్రి ఆ బోడిగుండూ, చిన్నకంపీ నా గదిలోకి వచ్చి, నన్ను బ్రిడ్జి హోటల్‌కి తీసికెళ్తున్నామనీ అక్కడ ఆ వ్యక్తి ఉంటాడనీ, అతన్ని గుర్తించి చూపెట్టాలనీ చెప్పి, నా కళ్ళకి గంతలుకట్టి, కారులో బ్రిడ్జిహోటల్ తీసికెళ్లేరు. హోటల్లో అడుగు పెట్టగానే ఆరవ కేబిన్‌లో ఆ వ్యక్తి నాకు కనిపించేడు. సన్నగా, రివటలా ఉండే అతను ఆ రౌడీలతో ఎలా పోట్లాడతాడు? పాపం, వాళ్ల ఒక్క పిడికిలి పోటుకే ప్రాణాలు వదులుతాడు. నాకు సాయంజేసిన వ్యక్తిని, ఆ కిరాతకులకి బలిపెట్టడం చాలా అన్యాయంగా తోచింది నాకు.

"అదే క్షణంలో నా దృష్టి మీమీద పడింది. హోటల్లో కూర్చున్న వాళ్ళందరికన్నా, మీరు చాలా పొడుగ్గా, బలిష్ఠంగా కనిపించేరు. ఆ రౌడీ లిద్దర్నీ మీరు సులువుగా చితగ్గొట్టగలరన్న ఆలోచన వచ్చింది నాలో. క్షణం ఆలస్యం చెయ్యకుండా మీ దగ్గరికివచ్చి మిమ్మల్ని చూపించేను వాళ్ళకి.

"మీరు వాళ్ళతో కలయబడుతున్నప్పుడు నేను పారిపోడానికి మంచి అవకాశం దొరికింది. జాగుచెయ్యకుండా బైటికి పరుగుతీసేను. ఒంట్లోవున్న శక్తికొద్దీ పరిగెత్తేను. అదృష్టవశాత్తూ ఓచోట పాడుపడ్డ ఇల్లొకటి కనిపించింది. రాత్రంతా అందులోనే గడిపేను. ఆకలి దహించి వెయ్యసాగింది. చేతిలో చిల్లికాని లేదు. ఏంచెయ్యాలి? పగలంతా అక్కడేవుండి, చీకటిపడ్డాక, తెగించి బైటికి వచ్చేను. వీధిలో నడుస్తుంటే ఆ రెడీమేడ్ షాప్ కనిపించింది. బ్రతకడానికి ఏదో ఒకటి చెయ్యాలిగా? పార్వ

తమ్మాళ్ నా పరిస్థితికి జాలిపడి ఉద్యోగం ఇచ్చింది..."

"నీ అదృష్టం బావుంది అన్నీ కలిసి వచ్చేయి. బిడిజ హోటల్లో వాళ్ళకి నన్ను చూపించి చాలా మంచిపని చేశావ్!" అన్నాను సిగరెట్‌ని ఏష్ ట్రేలో నొక్కుతూ.

"నా గురించి ఏవో వివరాలు సేకరించేనన్నారు? ఏమిటవి?" కుతూహలంగా అడిగింది సుగంధి.

"మీది క్లోవెలూర్! అక్కడ మీ స్వంత మేడవుంది. మీ నాన్నగారు రిటైర్డ్ తహసీల్దార్. పేరు భుజంగరావ్. నీకు సుఖమణి అనే చెల్లెలుండేది. ఈనెల పదహారవ తేదీ రాత్రి నీవు లాయర్ రామారావ్ అనే వ్యక్తితో క్లోవెలూర్‌నించి బయలుదేరావు. దారిలో పెట్రోల్ బంక్ యజమానితో డాక్టర్ ముత్తురామన్ సేనిటోరియం ఎక్కడుందో వివరాలడిగి ముందుకు సాగేరు. తరువాత ఏం జరిగిందో తెలీదు...మీ కారు రోడ్డుపక్క అగాధంలో పడిపోయింది. లాయర్ రామారావ్ మరణించేడు..." నా మాట ఇంకా పూర్తికాలేదు.

సుగంధి చేత్తో నుదురు రాసుకుంటూ, "సేనిటోరియం సేనిటోరియం!" అని కలవరించసాగింది.

నా కనుబొమలు ముడివడ్డాయి. "బాగా ఆలోచించు తీవ్రంగా ఆలోచించి చెప్పు. నీవూ, లాయర్ అప్పుడు సేనిటోరియం దేనికి వెళుతున్నారు?" అడిగేను.

"సేనిటోరియం...ఆఁ! ఏదో జ్ఞాపకం వస్తోంది...సేనిటోరియం!" కళ్ళు చిట్లిస్తూ తీవ్రంగా యోచిస్తోంది సుగంధి.

"తొందరపడక! నింపాదిగా జ్ఞాపకం తెచ్చుకో. నేను వినోద్‌కుమార్ గురించి వాకబ్ చేస్తాను!" అంటూ లేచి ఫోన్ వేపు నడిచేను.

డైరెక్టరీ తిరగేసి చకచక స్థానిక ఫోన్ నెంబర్స్ చూడసాగేను. కనిపించింది. 8525 వినోద్‌కుమార్

నెంబర్.

టైం చూసేను. రాత్రి ఏడున్నర. వినోద్‌కుమార్ ఆఫీస్‌నించి ఇల్లు చేరిఉంటాడు.

ఫోన్ రింగ్ చేసి, రిసీవర్ అందుకున్నాను.

"ఎస్! వినోద్‌కుమార్ స్పీకింగ్!"

నాలో ఉత్సాహం ఉరకలు వేసింది. "మద్రాసునించి మీ డియరెస్ట్ ఫ్రెండ్ ఒకరు మీతో కొన్ని విషయాలు చెప్పమని నన్ను పంపేరు. ఫోన్ సైర్వర్ హోటల్లో దిగేను. రూం నెంబర్ 23. దయచేసి వెంటనే రండి!" అన్నాను.

"ఏ ఫ్రెండ్?"

"సారీ! ఫోన్‌లో ఏమీ చెప్పను!" అంటూ రిసీవర్ క్రెడిల్ చేసేను.

# 10

పావుగంట తరవాత తలుపుతట్టిన చప్పుడయింది!

నాకు తెలుసు. వినోద్‌కుమార్ వచ్చివుంటాడు. "గడియతీసివుంది రండి!" అన్నాను.

కిర్రుమంటూ తెరుచుకుంది తలుపు. అతనే! రాత్రి బిడిజ హోటల్లో ఆరవ కేబిన్‌లో నేను చూసిన వ్యక్తి అతనే!

గదిలో అడుగుపెట్టిన వినోద్‌కుమార్, సుగంధిని చూడగానే ఉలిక్కిపడ్డాడు.

నన్ను పరీక్షగా చూసి, "ఆ రోజు బిడిజ హోటల్లో ఆ రౌడీలతో పోరాడింది మీరేకదూ?" అన్నాడు ఆశ్చర్యంగా.

తలూపేను. "ముందా తలుపు మూసి, ఇలా వచ్చి కూర్చోండి!" అన్నాను నవ్వుతూ.

వినోద్ కుమార్ తలుపు దగ్గరగా వేసివచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"మిమ్మల్ని పిలిపించడానికి ఫోన్లో అబద్ధం చెప్పినందుకు మన్నించాలి. నేను మద్రాసు క్రైంబ్రాంచి ఇన్ స్పెక్టర్ యుగంధరరెడ్డిని. కాకతాళీయంగా ఈ కేసులో ఇరుక్కున్నాను. ఇంతవరకూ అనేక వివరాలు సేకరించేను. ఇంకా ఎన్నో విషయాలు గుప్తంగా ఉన్నాయి. మీవల్ల కొన్ని తెలియవచ్చు. మీకు తెలిసినవన్నీ దయచేసి దాచకుండా చెప్పండి!" అన్నాను అతనికి సిగరెట్ ఆఫర్ చేస్తూ.

లైటర్తో సిగరెట్ కాల్చి అన్నాడు వినోద్ కుమార్. "మిమ్మల్ని నిన్న బ్లిడి హోటల్లో చూసినప్పుడే ఎక్కడో చూసినట్లు తోచింది. పేపర్లలో మీ గురించి చాలా చదివేను. ఇలా కలుసుకుంటాననుకోలేదు!" ఆగి, క్షణం సుగంధని పరీక్షగా చూసి చెప్పసాగేడు.

"మీరు ఇన్ స్పెక్టర్ యుగంధరరెడ్డి అని తెలిసేక నాలో కొండంత ధైర్యం వచ్చింది. చెబుతాను. అంతా చెప్పేస్తాను. ఈ నెల పదహారవ తేది రాత్రి కోవెలూర్ రోడ్ మీద ఈ అమ్మాయి చిత్రమైన పరిస్థితిలో ఎదురు పడింది నాకు. అప్పుడా విషయాన్ని నేనంతగా కేర్ చెయ్యలేదు. కాని, ఈమెని ఇక్కడి హాస్పిటల్ గేటు దగ్గర వదలి వెళ్ళిన మర్నాటి ఉదయం పేపర్ చదివేక తెలిసింది అసలు సంగతి. ఈ అమ్మాయి ఏ చోటైతే నాకు దొరికిందో అక్కడే కారుతోసహా రోడ్ పక్క అగాధంలోపడి రామారావ్ అనే వ్యక్తి మరణించాడని.

"అంతకిముందు అటువంటి పరిస్థితిలోనే సుఖమయి అనే అమ్మాయి కారు ఏక్సిడెంట్లో మరణించింది. నిజా

నికి ఆ అమ్మాయి ఎలా మరణించిందో నాకు తెలుసు! ఆమె కారు ఏక్సిడెంట్‌లో చావలేదు. అదేరోజు ఉదయం కారులో ఒంటరిగా డాక్టర్ ముత్తురామన్ సేనిటోరియంకి వచ్చిందిట. తన కింకా పెళ్ళికాలేదనీ, ఓ మోసగాడి కామానికి బలయ్యాననీ, నెల తప్పిందనీ,ఎంతడబ్బైనా సరే తనకి ఎబార్షన్ చేసి ఆ కడుపు పోగొట్టమనీ వేడుకుందిట.

"ఆ సేనిటోరియంకి అటువంటి కేసులే వస్తాయి. డాక్టర్ ముత్తురామన్ అటువంటి పేషంట్ల దగ్గర వేలకివేలు గుంజి గుప్తంగా ఎబార్షన్స్ చేసి పంపిస్తాడు. ఆ ఆపరేషన్‌లో పేషంట్ బ్లడ్ ప్రెషర్ కండిషన్‌లో లేకుంటే పేషంట్ మరణించే ప్రమాదముంటుంది. సుఖమయి విషయంలో సరిగ్గా అదే జరిగింది. ఆపరేషన్ సగంలో వుండగానే మరణించింది.

"ముత్తురామన్ చట్టం కన్నుగప్పడానికి ఏక్సిడెంట్ సృష్టించేడు. సుఖమయి వచ్చిన కార్లోనే ఆమె శవాన్ని పడుకోబెట్టి, కారు కోవెలూర్ రోడ్డుమీదకి తెచ్చి, అగాధంలోకి తోయించేడు. బ్రిడ్జి హోటల్లో మీతో పోట్లాడిన బోడిగుండూ, గున్నఏనుగూ అతని మనుషులే!"

"ఈ విషయాలన్నీ మీ కెలా తెలిసింది?" ఆశ్చర్యంగా అడిగేను.

వినోద్‌కుమార్ చెప్పడానికి కాసేపు తటపటాయించేడు. తరవాత నవ్వి అన్నాడు– "చల్లకి వచ్చి ముంత దాచడం దేనికి? చెబుతాను! ఆ సేనిటోరియంలోనే పనిజేస్తున్న గ్లోరియా అనే నర్స్ నా డియరెస్ట్ ఫ్రెండ్! ఐమీన్..."

నవ్వుతూ తలూపేను అర్ధమైనట్టు!

"ఆమె ద్వారా తెలిసింది అసలు సంగతి. సుఖమయి కారు ఏక్సిడెంట్‌లో మరణించినట్టు పేపర్లో వచ్చిన రోజు, తాగిన మైకంలో ఆ రహస్యం చెప్పింది నాకు. ఈ

అమ్మాయీ, లాయర్ రామారావ్ అటువంటి ఏక్సిడెంట్ కే గురికావడంతో నాలో ఒక ఆలోచన వచ్చింది. ఈ అమ్మాయి కూడా అటువంటి కేసు విషయంలోనే డాక్టర్ ముత్తురామన్ని కలుసుకునుంటుందనీ, లేదా లాయర్ రామారావ్ కి ఆ సేనిటోరియం విషయంలో అనుమానం వచ్చి ఈ అమ్మాయిని వెంటపెట్టుకుని దర్యాప్తు జరప డానికి డాక్టర్ ముత్తురామన్ని కలుసుకునుంటాడనీ, ముత్తురామన్ కి వీళ్ళమీద అనుమానం వేసి, వీళ్ళని చంప డానికి కారు ఏక్సిడెంట్ సృష్టించి ఉంటాడనీ, అదృష్ట వశాత్తూ ఈమె బ్రతికి బయటపడుంటుందనీ ఊహించి, డాక్టర్ ముత్తురామన్ కి ఫోన్ చేసేను!"

"ఏమని?"

"నాకు సేనిటోరియంలో జరుగుతున్న రహస్యాలు తెలిసిపోయేయనీ, అంతేకాదు సుభమయి ఎలా మరణిం చిందో కూడా తెలుసుననీ, ఈ నెల పదహారవ తేదీ శనివారం రాత్రి లాయర్ రామారావ్ ఎలా చంపబడ్డాడో కూడా తెలుసుననీ, నా నోరు మూయించాలంటే పదివేల రొఖ్ఖం ముట్టజెప్పాలనీ బ్లాక్ మెయిల్ జేస్తూ బెదిరిం చేను.

"ముత్తురామన్ కాసేపు మౌనం వహించి అడిగేడు డబ్బు ఎక్కడ ముట్టజెప్పాలని."

"దాంతో నా గెస్ సరైనదేనని రూఢిపరచుకున్నాను. డబ్బు ఓ పేకట్ లో చుట్టి, సాయంత్రం సరిగ్గా ఏడు గంటలకి హోటల్ ఓడిస్సీ రావాలనీ, అక్కడ నెంబర్ త్రీ కేబిన్ లో టేబిల్ కింద పేకెట్ ని టేప్ తో అతికించి వెళ్ళిపోవాలనీ, నేను అక్కడే ఎక్కడో ఉండి వాళ్ళ చర్యలు గమనిస్తుంటాననీ చెప్పేను. ముత్తురామన్ వెంటనే ఒప్పుకున్నాడు.

ఆ రాత్రి ఆరున్నరకే బృజ్జీ హోటల్ చేరుకున్నాను. ఏడుకి పదిహేను నిమిషాలుందనగా, మీరు పైనించి కిందకి వచ్చేరు. క్షణం నన్ను పరీక్షగా చూసి, వెళ్ళి ఓ టేబిల్ ముందు కూర్చున్నారు. నేను ఆరవ కేబిన్‌లో కూర్చుని అంతా గమనిస్తూనే ఉన్నాను.

"సరిగ్గా ఏడుగంటలకి ఈ అమ్మాయి ఆ రౌడీలతో అడుగుపెట్టింది. ఈమెని వాళ్ళవెంట చూడగానే నా పై ప్రాణాలు పైనేపోయేయి. ఆ రాత్రి ఈమెని కార్లో హాస్పిటల్ దగ్గర వదిలి వెళ్ళిన వ్యక్తీ, తనని బ్లాక్ మెయిల్ చేస్తున్న వ్యక్తీ ఒక్కరేనని డాక్టర్ ముత్తురామన్ ఊహించి ఉంటాడు. బృజ్జీ హోటల్లో నేను ఎలాగూ ఉంటానని ఫోన్లో చెప్పాను కనక, నన్ను గుర్తుపట్టడానికి వాళ్ళ మనుషులచేత ఈమెని పంపేడు. కానీ, ఈమె వాళ్ళకి నన్ను చూపించకుండా సరాసరి మీ దగ్గరకెళ్ళి మిమ్మల్ని చూసే పెట్టేసరికి నిర్ఘాంతపోయేను..." వినోద్ కుమార్ మాట ఇంకా పూర్తికాలేదు.

ఉన్నట్టుండి తలపట్టుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది సుగంధి.

"ఏమిటమ్మా? ఏంజరిగింది?" ఖంగారుగా అడిగేను.

సుగంధి వెంటనే మాట్లాడలేకపోయింది. తరవాత తలెత్తి చెప్పసాగింది.

"ఇన్‌స్పెక్టర్ గారూ! నాకు జ్ఞాపకం వస్తోంది! అంతా జ్ఞాపకం వస్తోంది. నా చెల్లి సుషమయి ఈ ఊళ్ళో ఉన్న తన స్నేహితురాలు లలిత ఇంటికి వెళుతున్నానని చెప్పి, ఒంటరిగా వెళ్ళిన మరుసటిరోజు హఠాత్తుగా ఆమె కారు ఏక్సిడెంట్‌లో మరణించినట్టు తెలిసింది మాకు. నాన్నా పిచ్చివాళ్ళమైపోయాం!

"సుషమయి మరణించిన ఎనిమిది రోజుల తరవాత

తెలిసింది నాకు అసలు సంగతి. సుఖమయి బట్టల బీరువా సర్దుతున్నప్పుడు ఆమె డైరీ దొరికింది. చదివి విషయాలన్నీ గ్రహించేను. తనకాలేజీలో చదువుతున్న వరప్రసాద్ అనే అబ్బాయిని ప్రేమించినట్టూ, తొందరపడి ఒకరోజు కాలుజారినట్టూ, తనకి నెలతప్పినట్టూ, తన వాళ్ళని పెళ్ళికి ఒప్పించడానికి వరప్రసాద్ వాళ్ళ ఊరు వెళ్ళినట్టూ, అంతా ఉంది అందులో. వాళ్ళ ఊరినించి వరప్రసాద్ రాసిన ఉత్తరం కూడా డైరీలోనే ఉంది.

తమ పెళ్ళికి వాళ్ళ నాన్న ఒప్పుకోలేదనీ, ఆత్మహత్య చేసుకుంటాననీ బెదిరించేడనీ, తను పెద్ద చిక్కుల్లో ఇరుక్కున్నాననీ, ఎక్కడికైనా వెళ్ళి ఎబార్షన్ చేయించుకోమనీ రాసేడు రాస్కెల్! డైరీ చివరి పేజీలు చదివేక తెలిసింది సుఖమయి లలిత ఇంటికి వెళుతున్నానని అబద్ధం చెప్పి, డాక్టర్ ముత్తురామన్ సేనిటోరియంకి ఎబార్షన్ కోసం వెళ్ళిందని.

కానీ, ఆ రోజు సుఖమయి, కార్లో ఉదయం పది గంటలకి కోవెలూర్ నించి బైలుదేరింది. ఆమె కారు ఏక్సిడెంట్ అర్ధరాత్రి జరిగినట్టు తెలిసింది. కోవెలూర్ నించి తిరువత్తియూర్ చేరడానికి గంటకూడా పట్టదు. ఆలోచిస్తే నాకేదో అనుమానం కలిగింది. నా స్నేహితుడైన లాయర్ రామారావ్‌ని కలుసుకుని, విషయాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పేను. సేనిటోరియం కెళ్ళి ఎంక్వైరీ చేద్దామన్నాడతను.

"నాన్నకి మామయ్య ఊరు వెళుతున్నానని చెప్పి యిద్దరం కార్లో బైలుదేరాం! దార్లో ఓ పెట్రోల్ బంక్ దగ్గిర కారాపి, సేనిటోరియంకి దారి కనుక్కున్నాడు రామారావ్. సేనిటోరియం చేరగానే, ముత్తురామన్ని సుఖమయి గురించి అడిగేము. మేముచేసిన పొరపాటు

అదే. ముత్తురామన్ వెంటనే గ్రహించేడు మాకు సుఖమయి ఏక్సిడెంట్ విషయంలో అనుమానం కలిగించవని, ఎంక్వైరీ జేస్తున్నామని. మమ్మల్ని గదిలో కూర్చోబెట్టి బైటి కెళ్ళేడు.

“అంతే! అతనికి బదులుగా ఆ బోడిగుండూ, చిన్న తంబీ చేతుల్లో ఇనుప కడ్డీలు పట్టుకుని, గదిలోకి వచ్చేరు. మేము పరిస్థితి గ్రహించేలోగా, కణతలమీద మెరుపు దెబ్బలు కొట్టేరు. అంతే! తరవాత ఏం జరిగిందో నాకు తెలీదు. కళ్ళు తెరిచి చూస్తే అర్ధరాత్రి చీకట్లో రోడ్ పక్కగా పెద్దరాతి బండమీద పడున్నాను!”

కేసు పూర్తిగా విడిపోయింది! కోవెలూర్‌లో వరప్రసాద్‌తో మాట్లాడుతున్నప్పుడు నాలో మెరుపులా మెరిసిన ఆలోచన అదే! సేనిటోరియం!! “ఆ సేనిటోరియంలో అన్ని అక్రమాలు జరుగుతున్నా, స్థానిక పోలీసులు ఏంజేస్తున్నట్టు?” అడిగేను వినోద్‌కుమార్ని.

పకపక నవ్వేడతను. “మీకు అసలు విషయమే చెప్పడం మరిచేను ఇన్‌స్పెక్టర్! ఇక్కడి పోలీస్ ఇన్‌స్పెక్టర్ గణేశన్ ఎవ్వరనుకున్నారు? డాక్టర్ ముత్తురామన్ బావమరిది. వాళ్ళిద్దరూ కలసి కట్టుగా ఈ వ్యవహారం నడుపుతున్నారు!”

నిర్ఘాంతబోయేను! చట్టాన్ని కాపాడవలసిన పోలీస్ ఆఫీసర్ నేరస్థుడితో చేతులు కలపడమా? వెంటనే మద్రాసుకి ఫోన్ జేసి, స్పెషల్ స్క్వాడ్‌ని పిలిపించాలి. రాస్కెల్స్‌ని మక్కెలు విరగదన్ని అరెస్ట్ జేసి తీసి కెళ్ళాలి.

వినోద్‌కుమార్ ఇంకా ఏదో చెప్పబోయేడు. సరిగ్గా అదే సమయంలో గది తలుపు కిర్రుమంటూ తెరుచుకుంది!

తలుపువేపు చూసి ముగ్గురం ఉలిక్కిపడ్డాం! ఇన్

స్పెక్టర్ గణేశన్! చాలా నింపాదిగా గదిలో అడుగు పెట్టేడు. కుడిచేతిలో నల్లగా నిగనిగ మెరుస్తోంది పిస్తోలు. అతని వెనకే బిడ్డి హోటల్లో నాతో స్టంట్ చేసిన చిన్నతంబి గదిలోకి వచ్చి, తలుపుమూసి వెనుదిరిగేడు. లైటు కాంతిలో తళుక్కుమంది పిస్తోలు. సోఫాలోంచి మెరుపులా లేవబోయేను.

"డోంట్ మూవ్!" అరిచేడు గణేశన్.

ఆగిపోయేను!

"పిచ్చివేషాలు వేస్తే కుక్కని చంపినట్టు చంపేస్తాను! ముగ్గురూ లేవండి. లేవండి!" గణేశన్ కంఠం కర్కశంగా ఉంది.

తొందరపడకూడదు. సుగంధినీ, వినోద్‌కుమార్ని లేవ మన్నట్టు సైగచేసి సోఫాలోంచి లేచేను. సుగంధి బెదిరిన లేడిలా ఉంది. వినోద్‌కుమార్ చమటతో తడిసిపోతు న్నాడు.

ఇన్‌స్పెక్టర్ గణేశన్ మమ్మల్ని పరీక్షగా చూసి నవ్వేడు. "మిస్టర్ యుగంధరరెడ్డి! నిజంగా అఖండుడివి. కాకతాళీయంగానే ఐనా, మా రహస్యాలు పూర్తిగా తెలుసుకున్నావ్! నీవు ప్రాణాలతో బైటపడడం, మా కెంత ప్రమాదమో నాకంటే నీకే ఎక్కువ తెలుసు..."

నా బుర్ర చురుగ్గా పనిచెయ్యసాగింది. నేనొక్కణ్ణే గనక ఉండివుంటే ఈపాటికి తెగించేవాణ్ణి. నాతోబాటు సుగంధీ, వినోద్‌కుమార్ ఉన్నారు. ఈ పరిస్థితిలో నేను తిరగబడితే వాళ్ళు నిస్సందేహంగా కాల్చేస్తారు. సమయం అనుకూలించేవరకూ వాళ్ళని మాటల్లో దింపాలి.

చిన్నగా నవ్వి అన్నాను. "ఇన్‌స్పెక్టర్ గణేశన్! మిమ్మల్ని చంపి నీవు ఎలా తప్పుకోగలవు? నువ్వు నా గదికి వచ్చినట్టు హోటల్ వాళ్ళు చూసి ఉంటారు. నువ్వు

వచ్చేక మూడు హత్యలు జరిగితే ఎవ్వరికైనా అనుమానం వస్తుంది. ఈ హోటల్ గదిలో మిమ్మల్ని చంపడం నీకెంత ప్రమాదమో వేరే చెప్పనవసరంలేదు!'' అన్నాను.

పకపక నవ్వేడు గణేశన్. "నేనంత తెలివి తక్కువ దద్దమ్మని కాను. నిక్షేపంగా మిమ్మల్ని ఇక్కడే చంపి, అటు ప్రభుత్వాన్నీ, ఇటు ప్రజల్నీ ఎలా బోల్తా కొట్టిస్తానో విను. ముందు చిన్నతంబి నిన్నూ, సుగంధినీ కాల్చేస్తాడు. నేను నా పిస్తోలుతో వినోద్‌కుమార్ని షూట్ జేస్తాను. తరవాత చిన్నతంబి తన పిస్తోలుమీద తన వేలిముద్రలు లేకుండా క్లీన్ జేసి వినోద్‌కుమార్ శవం చేతిలో పెడతాడు.

"తరవాత నేను ప్రభుత్వానికి ఏంచెబుతానో తెలుసా? హత్యలు జరక్కముందు నీవు నా సహాయం అరిస్తూ ఫోన్ జేసేవనీ, వెంటనే నేను బైలుదేరి వచ్చేననీ, అప్పటికే ఆలస్యం జరిగిపోయిందనీ, నిన్నూ, ఈ అమ్మాయినీ వినోద్ కుమార్ చంపేసేడనీ, వినోద్‌కుమార్ ఒక బ్లాక్ మెయి లర్ అనీ, అతను తన రహస్యాలు కనుక్కున్న నిన్ను చంపడానికే ఇక్కడికి వచ్చేడనీ, గదిలోకి వచ్చిన నా మీద కూడా పిస్తోలు పేల్చేడనీ, నా ప్రాణాలు కాపాడు కోడానికి నేనతన్ని షూట్ జేసేననీ పై ఆఫీసర్లకి రిపోర్టు ఇస్తాను.

"ఇప్పుడు చెప్పు! నా ప్లాన్‌లో ఏమైనా లోపా లున్నాయా? బ్రహ్మదేవుడు కూడా కనిపెట్టగలడా?''

బ్రహ్మాండంగా ఆల్లేడు ప్లాన్! ఇంక ఎక్కువసేపు కాచుకోడు. మమ్మల్ని చంపేస్తాడు. చట్టాని కందకుండా సులువుగా తప్పుకుంటాడు. ప్రభుత్వం ఉప్పుతింటూ ప్రభుత్వానికే క్షమించరాని ద్రోహం జేస్తున్న ఓ కిరా

తనడి చేతిలో, నా చావు రాసిపెట్టి ఉందే అన్న దిగులు పట్టుకుంది. అటో, ఇటో చివరి ప్రయత్నంగా ఏదో చెయ్యాలి. తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

"ఆలస్యం చెయ్యకండి బాస్! వీడు జిత్తులమారి నక్క!" అంటున్నాడు చిన్నతంబి.

"ఊం! కాల్చెయ్!" ఆజ్ఞాపించేడు గణేశన్.

చిన్నతంబి పిస్తోలు షేక్ కాకుండా రెండు చేతులతో పట్టుకుని మావేపు గురిపెట్టేడు. అంతే_ "ఢాం! ఢాం!" రెండుసార్లు పేలింది పిస్తోలు.

గుండు నా గుండెలో దిగిందే అనుకున్నాను. కాని, గణేశన్, చిన్నతంబీ గావుకేకలు పెడుతూ కింద పడిపోడంతో నివ్వెరబోయి, వెనుదిరిగి చూసేను.

కిటికీ అవతల నా అసిస్టెంట్ రాజారావ్! అతని, చేతిలో పొగలు కక్కుతున్న రివాల్వర్! నా కళ్ళని నేను నమ్మలేకపోయేను. నవ్వుతూ కిటికీగుండా లోనికి దూకేడు రాజారావ్.

"సమయానికి నీవు రాకుంటే ఈ పాటికి మేం వైకుంఠంలో ఉండేవాళ్ళం!" అన్నాను నిట్టూరుస్తూ.

ఇన్స్పెక్టర్ గణేశన్, చిన్నతంబీ కింద నెప్పికి గిలగిల తన్నుకుంటున్నారు.

రాజారావ్ కాల్చిన గుళ్ళు వాళ్ళ భుజాల్లో కాపురం పెట్టేయి. వాళ్ళ పిస్టల్స్ ఎగిరి దూరంగా పడ్డాయి!

"మనకి భగవంతుడి మద్దతు ఉంది సార్! మీ ఫోన్ కాల్ అందగానే మద్రాసునించి మోటర్ బైక్ మీద బైలుదేరేను. హోటల్ చేరగానే సరాసరి మీ గదికి వచ్చేను. తలుపు మూసివుంది. లోపలి మాటలు విని గ్రహించేను

పరిస్థితి సీరియస్‌గా ఉందని.క్షణం ఆలస్యం జెయ్యకుండా హోటల్ బైటికెళ్ళి, వాటర్‌పైప్ ద్వారా మీ గది కిటికీ చేరుకున్నాను!'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజారావ్ నవ్వుతూ.

''వెరీగుడ్ మైబాయ్! వెంటనే స్థానిక హాస్పిటల్‌కీ, మద్రాసు పోలీస్ హెడ్‌క్వార్టర్స్‌కీ ఫోన్ చెయ్యి!'' అన్నాను ఆప్యాయంగా అతని భుజంతడుతూ.

—: ఐ పో యిం ది :—

# నరకం - నరలోకం

## సుజనశ్రీ

త్రీస్టార్ హోటల్లో కూర్చుని, తాపీగా సిగరెట్ పీలుస్తూ దూరంగా సముద్రంలో ఉవ్వెత్తున లేచి పడుతున్న తరంగాల వేపు చూస్తున్నాడు కిరణ్‌కుమార్. అతడు గంభీర సముద్రంలా పైకి తాపీగా ఉన్నాడన్నమాటే గాని, అతడి మనసులో భీభత్సంగా తుఫాను వీస్తోంది.

అంతకు క్రితం ఒక గంట ముందు అతడు బాస్‌ని కలుసుకుని విన్న విషయాలూ, అతడి స్వంత విషయాలూ కలగాపులగంగా చిక్కుముడి వేసుకుపోయి అతడి మనసులో పెద్ద సమస్యను తెచ్చిపెట్టినయ్.

మూడు రోజుల క్రితం పేపరు అతడి ప్రక్కనే పడి ఉంది. అందులో హెడ్ లైన్స్‌వంక చూశాడు మరోసారి.

"ఇండియా మొదటిసారిగా మానవుడ్ని అంతరిక్షంలోకి పంపిన వైనం."

ఆ తర్వాత వాక్యాల్ని చదవలేకపోయాను. అందులోని సారాంశమంతా తన బుర్రలో నాటుకుపోయింది ఎప్పుడో!

అణ్వస్త్ర పరీక్ష జరిపినందుకే కొన్ని దేశాలు ఇండియాను దుయ్యబట్టినయ్. అయినా భారతదేశం వాటిని లక్ష్య పెట్టకుండా, తనకు అవసరమైన విజ్ఞానాన్ని పెంపొందించుకుంటూ వచ్చింది. శ్రీహరికోటనుంచి రాకెట్లు ప్రేల్చడంతో మొదలైన అంతరిక్ష పరిశోధనా కార్యక్రమంలో ఆ సంఘటన సువర్ణాక్షరాలతో లిఖించబడాల్సిన రోజు.

మేజర్ వినయ్ సక్సేనా రాకెట్‌లో కూర్చుని అంతరిక్షంలోకి దూసుకుపోయాడు. భూమిచుట్టూ పరిభ్రమించి మూడురోజుల తర్వాత అతడు బంగాళాఖాతంలో దిగవలసి ఉన్నది. కాని అతడు నిర్ణీత కార్యక్రమం ప్రకారం బంగాళాఖాతంలోకి దిగలేదు. అతడు భూమికి సురక్షితంగా దిగివచ్చినట్టు రాడార్, టెలివిజన్ యంత్రాలు రూఢి చేశాయి.

కాని లెక్కల్లో ఎక్కడో తప్పు దొర్లివుండాలి, రాకెట్ ఎక్కడో నేలమీదికి దిగి ఉండాలని శాస్త్రజ్ఞులు అంచనా వేశారు.

అతడు బహుశా చైనా గడ్డమీద దిగవచ్చునని వారి ఊహ. ఆ ఊహే నిజమయితే తాము వ్యయప్రయాసలకు ఓర్చి, జరిపిన ఈ ప్రయోగం అంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. చైనా ఇండియాల మధ్య సత్సంబంధాలు లేని కారణంగా, ఆ రాకెట్‌ని చైనావారు స్వాధీన పరచుకుంటారు. మేజర్ సక్సేనాను గూఢచారి కలాపాల నెపంతో

అరెస్టుచేసి అతడినుంచి తమకు కావలసిన రహస్యాల్ని సేకరిస్తారు.

రెండు దేశాలమధ్యా రాయబార కార్యాలయాలుగూడ లేవు ఈ విషయమై సంప్రదింపులు జరపటానికి. అయినా భారత ప్రభుత్వం మెస్సేజ్ కి చైనావారు తమ భూభాగంలో ఎలాంటి రాకెట్ దిగలేదని సమాధానం పంపారు. భారత ప్రభుత్వం కలవరపడిపోయింది. ఏం చెయ్యటానికి పాలుపోలేదు. మేజర్ సక్సేనా, అతడి రాకెట్ ఇతర దేశస్థుల చేతిలో పడినందుకే బాధపడుతున్నారు.

రక్షణమంత్రి ఇంటలిజెన్స్ డిపార్ట్ మెంట్ ని సమావేశపరచి కర్తవ్యం గురించి చర్చించాడు. చైనా భూభాగంలోకి ఇండియన్ ఏజెంట్స్ ని పంపి సక్సేనను తిరిగి తెచ్చుకోవడమే గత్యంతరం. అయితే అది అంత సులభమయిన పనికాదు. కాని అంతకన్న మరో మార్గంలేదు. పైగా చైనావారు తమ భూమిమీద దిగిన రాకెట్ కోసం అన్వేషణ చేసి వెదికి పట్టుకుంటారు. ఈ లోపలే భారత ఏజెంట్లు అక్కడకు చేరవలసి ఉంటుంది.

ఇంతవరకు రాకెట్ ఏ ప్రదేశంలో దిగిందో ఖచ్చితంగా అంచెనా వేయలేకపోతున్నారు. రాకెట్ దిగే రోజు రాత్రి వాతావరణం బాగాలేదు. పెను తుఫాను వీస్తోంది బంగాళాదేశ్ వైపునుంచి. దాంతో రాడార్ లు 'జామ్' అయిపోయాయి. టెలివిజన్ కెమెరాల్లో ఏమీ కనబడకుండా పోయింది.

దేశంలో నలుమూలలా కేంద్రీకృతమై ఉన్న సీక్రెట్ ఏజెంట్స్ అందరూ పిలిపించబడ్డారు. ఏ వేళకు ఏవరితో అవసరం వస్తుందో అని అందర్నీ అప్రమత్తతతోనూ, ఏ క్షణంలో అయినా ఎటువంటి సాహసకార్యానికైనా

రెడీగా ఉండమని ఆదేశాలివ్వబడినై.

అటువంటి వారిలో కిరణ్ కుమార్ ఒకడు. మేజర్ సక్సేనా అదృశ్యం కావటం దేశ క్షేమదృష్ట్యా ప్రమాద కరమైనది. మరో విధంగా కూడా సక్సేనాతో కిరణ్ కుమార్‌కు సఖ్యత ఉంది.

మిలిటరీ హాస్పిటల్ నర్స్‌గా పనిచేస్తున్న అరుణను తను ప్రేమించాడు. ఆమె వివాహానికి సమ్మతిస్తే తను ఈ ఉద్యోగాన్ని వదిలిపెట్టి ఎక్కడన్నా శాశ్వతంగా స్థిర పడదామని అనుకున్నాడు. కాని ఆమె తన స్నేహానికి మాత్రమే తన ఇష్టతను చూపింది. ఆమే, సక్సేనా ఇద్దరూ ప్రేమించుకున్నారనీ, మిలిటరీలో తమ వ్యవధి పూర్తికాగానే వివాహం చేసుకోవటానికి సిద్ధంగా ఉన్నారని తెలిసి కిరణ్ కుమార్ బాధపడ్డాడు.

"ఏ విధంగా చూసినా నేను సక్సేనాకు తీసిపోను ఎందులోనూ. పైగా అతడికన్న ఎక్కువ మెరిట్ గల వాడ్నే నేను. నన్ను కాదని అతనిలో ఏం చూసి నీవు అతడ్ని ప్రేమించావ్?" కిరణ్ కుమార్ సూటిగా ఆమెనే అడిగేశాడు.

అరుణ నవ్వింది. "నీలో అన్నీ మంచి గుణాలే ఉన్నాయ్. కాని నా భర్త రోజూ నా కళ్ళెదుటే ఉండా లనీ, రిస్క్ లేని ఉద్యోగంలో సెటిల్ అవాలనీ నా కోరిక. కాని నీ ఉద్యోగ విధులు వీటికి విరుద్ధం" అంది.

అదీ నిజమే! తను ఏదన్నా సాధించుకురావటానికి వెళితే ఒక్కోసారి నెలల తరబడి హెడ్ క్వార్టర్స్‌కు రాడు. అసలు తను తిరిగి రాగలడో, లేడో తనకే నమ్మకం లేదు. అందుకే అతడు అవివాహితుడుగానే ఉండి పోయాడు. కాని అరుణను చూసిన తర్వాత అతడి మన సులో మధురభావాలు కలగసాగినై. ఈలోపల మేజర్

సక్సేనా అంతరిక్షయాత్రకు శిక్షణ నిచ్చేందుకు ఎన్నుకో బడ్డాడు. అరుణ వివాహం వాయిదా పడింది.

"అంతరిక్షంలోకి దూసుకుపోయి, తిరిగి రాగలడో లేడో నమ్మకంలేని వ్యక్తినా నీవు పెళ్ళాడేది?" అని కసిగా అడిగాడు ఆమెను.

"పోనీ నీ తర్వాత అసైన్ మెంట్ నుంచి నీవు సురక్షితంగా రాగలవేమో గుండెమీద చెయ్యివేసుకుని చెప్పు!" అన్నది అరుణ. ఎటువంటి ప్రశ్నకయినా చురుకుగా, వెనువెంటనే తెలివైన జవాబివ్వగల శక్తి ఉంది ఆమెకు. అందుకే ఆమె అంటే తనకు ఇష్టం.

ఇది జరిగిన ఏడాదికి మేజర్ సక్సేన్ అంతరిక్షంలోకి పంపబడ్డాడు. కాని అతడు అనుకున్న ప్రదేశానికి తిరిగి దిగలేకపోయాడు. పైగా ప్రమాదకర భూమిలో దిగాడు. అతడ్ని వెదికి వెనక్కు తీసుకురావలసిన భారం తమమీద మోపబడింది. అసలతడు బ్రతికి ఉన్నాడో లేదో. భూమికి ఢీకొని రాకెట్ బ్రద్దలయిపోయినా అయివుండవచ్చు.

అరుణను కలుసుకుందామని హెడ్ క్వార్టర్స్ కి వెళ్ళిన కిరణ్ కుమార్ కి ఆశాభంగం అయింది మరోసారి.

"అరుణ తన ప్రియుడికి సాధ్యమైనంత దగ్గరగా ఉండాలని ఆమెగూడ హాంగ్ కాంగ్ వెళ్ళింది. చైనా గడ్డపై అడుగు పెట్టవలసిన మొట్టమొదటి ఏజెంట్ సుందర్ వెంటే వెళ్ళిందట. శత్రువులు అతడిని చంపి ఆమెను బంధించారట" చెప్పారు అక్కడి అధికారులు.

కిరణ్ కుమార్ వెంటనే హాంగ్ కాంగ్ కు ప్రయాణానికి బయలుదేరాడు.

## 2

మేజర్ వినయ్ సక్సేనా కళ్ళు తెరిచాడు. అతడి వంట్లో నీరసంగా ఉంది. కుడికాలు విరిగిపోయిందా అన్నంత

బాధగా ఉంది. మనిషి కదలలేకుండా ఉన్నాడు. అంతలోనే మెలకువ, ఆ తర్వాత మళ్ళీ మగత, మెలకువ, మళ్ళీ మగత ఇలా అలలమధ్య ఊగాడుతున్నాడు అతడు.

అతడి ప్రక్కనే ఒక ముసలమ్మ, మరో ముసలాయన నిలబడి నిస్సహాయంగా చూస్తున్నారు.

"పాపం! బ్రతుకుతాడో లేదో!" ముసిల్ది సానుభూతిగా అంది.

"అందరం పోయేవాళ్ళమే ఏదో ఒక నాటికి!" అతడు వేదాంతిలా జవాబిచ్చాడు.

సక్సేనా మూలిగాడు బాధగా.

"లీన్ షూ అన్నా త్వరగా మందులు తెస్తే బాగుండును."

సక్సేనా మనసు ఇంకా అంతరిక్షంలో పరిభ్రమిస్తున్నది. అనేక మందిని పరీక్షించి, వడబోసి మరీ తనను ఎన్నుకున్నారు అంతరిక్షయానానికి. అప్పుడు అతడు తన జన్మ సార్థకమైనట్టుగా సంతోషించాడు. తను ఇంకా రాకెట్ లో పరిభ్రమిస్తున్నట్టు కలలో తేలిపోసాగాడు. అంతలోనే మళ్ళీ బాధతో మూలిగేవాడు. కలకూ వాస్తవానికీ మధ్య అతడు ఊగులాడుతున్నాడు. తను నేలమీద పడటం బాగా గుర్తు. ఆ తర్వాత తను రాకెట్ కాప్స్యూల్ ని తెరుచుకుని నేలమీద పడిపోయాడు. ఎవరో తనని మోసుకుపోయినట్టు లీలగా గుర్తు.

బలాన్నంతా కూడగట్టుకుని కళ్ళు తెరిచాడు. తన ముఖంలోకి చూస్తూ ముసలావిడ అడిగింది.

"నా మాటలు వినబడుతున్నాయా?"

"ఆఁ! వినబడుతున్నాయ్!... అమ్మా!" అన్నాడు బాధగా.

"కొంచెం ఓర్చుకో. నీకు మందులు తేవటానికి 'లీన్ షూ'ని పంపాం. నిదానంగా వస్తుంది. డాక్టరికి కబురు

చేశామంటే ప్రమాదం. పోలీసులు వచ్చి పడతారు."

"డాక్టరు వద్దులే! నా విషయం ఎవరికన్నా చెప్పారా?"

"లేదు. ఎవరికీ చెప్పలేదు."

"ఇది ఏ దేశం?"

"చైనా దేశం!"

సక్సేనా కళ్ళు మూసుకున్నాడు నీరసంతో, బాధగా.

"నీవు రష్యాదేశానికి చెందినవాడివేమో పోలీసులకు తెలియజేద్దాం అనుకున్నాం. కాని రాకెట్‌ని చూడంగానే నీవు భారతీయుడివని గుర్తించాం. నీవు ఇక్కడ్నుంచి సురక్షితంగా ఎలా బయటకు చేరగలవా అనే ఆలోచిస్తున్నాం. నా కుమారుడు వాంగ్-ఫూ ఢిల్లీకి వెళ్ళాడు. నీ విషయం మీ వాళ్ళకు అందజేయటానికి ప్రయత్నిస్తాడు. ఆపైన అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది."

"సరే!" అని తల ఊపి మళ్ళీ మగతలో పడిపోయాడు సక్సేనా.

ఆకాశ వీధిలో నక్షత్రాలు వేగంగా జరిగిపోతున్నాయ్. భూమి నారింజపండులాగ కనబడుతోంది. తన పరిభ్రమణంలో ప్రపంచంలోని దేశాలన్నిటినీ చూడగలుగుతున్నాడు. రాకెట్‌లో తన గదిలో టేప్ రికార్డులు తిరుగుతున్నయ్. వాతావరణాన్ని రికార్డుచేసే మీటర్లు, అంతరిక్షంలోని ధూళిలో ఉన్న రసాయనిక పదార్థాలను కొలిచే యంత్రాలూ అన్నీ పనిచేస్తున్నయ్.

అంతలోనే రాకెట్ చివర మరో చిన్నసైజు రాకెట్ పేలింది. రాకెట్ భూమివైపుగా మళ్ళీ శూన్యంలోంచి వాతావరణంలోకి దూసుకుపోతోంది. షెడ్యూలు ప్రకారం

తను ముప్పయి రెండుసార్లు భూమిచుట్టూ పరిభ్రమించాల్సి ఉండగా, ఇరవయ్ ఎనిమిది పరిభ్రమణాల అనంతరం భూమికి దిగుతోంది. ఎక్కడో ఏదో పొరబాటు జరిగి ఉండాలి.

అతడు భయంతో తనముందున్న మీటర్ని నొక్కాడు. బలంగా లాగాడు. ఏంచేసినా రాకెట్ వేగం తగ్గలేదు. ప్రయాణం మళ్ళలేదు. సంవత్సరకాలం ఇచ్చిన శిక్షణని మరిచి అతడు మరణానికి భయపడుతూన్న మామూలు సామాన్య మానవుడు అయిపోయాడు.

షెడ్యూల్ ప్రకారం తను బంగాళాఖాతంలో దిగాల్సి ఉంది. భారత నౌకలు, హెలికాప్టర్లూ తనకోసం కాచుకూర్చుని ఉంటయ్.

కాని తను నీళ్ళమీద కాకుండా నేలమీదకు దిగుతున్నాడు. రాకెట్‌కున్న పారాచూట్‌లు తెరుచుకుని రాకెట్ నేలకు ఢీకొని వుండిపోకుండా కాపాడినయ్.

తను కూర్చున్న గది రాకెట్‌నుంచి విడిపోయింది. పారాచూట్‌లు తెరుచుకుని నిదానంగా నేలకు దిగుతుండగా రాకెట్ మిగతా భాగం గాలిలో నుసి అయిపోయింది.

తను ఎక్కడ దిగుతోంది తనకే తెలియలేదు. కొండలూ, అడవుల మధ్యలో, కుండపోతగా కురుస్తున్న వర్షంలో దిగాడు తను. చెట్ల కొమ్మలను విరిచేస్తూ, స్వర్గంనుంచి విసిరివేయబడ్డ రాయిలా క్యాప్సూల్ నేలమీద ఆనింది.

దూరాన కనబడే చిన్నచిన్న దీపాల కాంతివల్ల అది రాత్రి అని తెలుసుకున్నాడు. ఆ తర్వాత అతడికి తెలివి తప్పిపోయింది.

కళ్ళు తెరిచిన తర్వాత అతడికి రాతితో కట్టబడిన పాత ఇల్లు కనుపించింది. తను ఇంకా బ్రతికి ఉన్నందుకు

తన అదృష్టాన్ని మెచ్చుకున్నాడు. అయితే ఒక కాలికి మాత్రం బలంగా దెబ్బ తగిలింది. బహుశా ఫ్రాక్చర్ కూడ అయిందేమో. బాధ భరించ లేనంతగా ఉంది.

"ఇంకా మందులు రాలేదా?" కళ్ళు తెరిచి ముసిలాడ్ని అడిగాడు.

"రాలేదు నాయనా?"

"మీరు హిందీ బాగానే మాట్లాడుతున్నారే!" సక్సేనా అడిగాడు.

"అవును. భారత చైనాల మధ్య యుద్ధం రాకముందు నేను ఉత్తర ప్రదేశ్ లో పండ్ల డాక్టర్, అంటే డెంటిస్ట్ గా ఉండేవాణ్ణి. భారతీయ భాషలు ఇంకా తెలుగు, అరవం, హిందీ, బెంగాలీ వచ్చునాకు. యుద్ధం మూలంగా మమ్మల్ని చైనాకు తిరిగి అప్పజెప్పారు. అప్పట్నుంచి మాకు కష్టాలు ప్రారంభమయినయ్. శరణార్థులుగా మమ్మల్ని ఆదుకో వలసిన ప్రభుత్వం, మమ్మల్ని సమాజంలోంచి వెలి వేసింది. కారణం! మేము భారత దేశంలో ఉండి వచ్చామనిట!

"ఈ అడవిలో కట్టెలు, కలపకొట్టి దాన్ని ఇతర గ్రామాల్లో అమ్మి దానితో మేము జీవించాలి. ఈ వృద్ధాప్యంలో కూడ కష్టపడక తప్పలేదు" ముసలాడు దీనంగా తమ కథను చెప్పాడు.

"నీకు పిల్లలు లేరా?" సక్సేనా అడిగాడు.

"ఉన్నారు. ఇద్దరు కొడుకులూ, ఒక కూతురూ! పెద్ద కొడుకు దేశంలో మార్పు తెస్తున్న 'కల్చరల్ రివల్యూషన్'ని విమర్శించాడు. వాడ్ని పట్టుకు కట్టేసి మా కళ్లెదుటే కాల్చి చంపారు. రెండో కొడుకు ఓడలో పైలెట్ గా పని చేస్తున్నాడు. మా అమ్మాయి ఆ కసబదే ఊళ్ళో హెల్త్ విజిటర్ గా పని చేస్తున్నది."

"వాంగ్-ఛూ నా సమాచారాన్ని గోప్యంగా మా

దేశానికి అందజేయగలడా? అక్కడ్నుంచి సహాయం వచ్చేలోపల తన గదిలోని టేప్‌లనూ, ఇతర సాంకేతిక పరికరాల్ని జాగ్రత్తగా కాపాడాలి. నా ప్రాణాలకన్నా అవి ముఖ్యం."

"అవన్నీ మా అమ్మాయి చూసుకుంటుందిలే. నీ రాకెట్‌కి కట్టివున్న పారాచూట్‌లు అన్నీ చుట్టచుట్టి భూమిలో పాతేసింది అదే!"

అతడు నిద్రలోకి జారుకున్నాడు.

ఎవరో అతడ్ని తట్టిలేపారు. "మందులు తెచ్చాను. అవి వేసుకోండి!" అతడి కళ్ళలోకి చూస్తూ పంథొమ్మిదేళ్ళ అమ్మాయి అంది.

ఈమే లిన్‌షూ అయివుండాలనుకున్నాడు సక్సేనా. ఆమె మోకాళ్ళవరకూ వ్రేలాడే పొడవాటి గౌన్ తొడుక్కుంది. బాబ్డ్ హెయిర్. ఆమెలో భారతీయత దాగివుంది అనుకున్నాడు సక్సేనా.

"పెన్సిలిన్ టాబ్స్ తెచ్చాను వేసుకోండి! యాంటిబయాటిక్స్ గూడ తెచ్చాను. మీ కాలికి చీము పొయ్యకుండా ఆపుతయ్, సరైన వైద్యసదుపాయందొరికేదాకా!"

"థాంక్యూ మాడమ్!" అతడి నోట్లో టాబ్లెట్ వేసి లోటాతో నీళ్ళు పోసింది.

"ఆ మందులు ఎక్కడ తెచ్చావ్?" ఆమె తండ్రి అడిగాడు.

"ఎక్కడ తెస్తేనేం! తెచ్చాను గదా!" ఆమె విసుగ్గా అంది.

"ఎవరికీ తెలియకుండా తెచ్చావు గదా అని అడిగానమ్మా! ఘుంగ్‌లీ ఇప్పించాడు కదూ వాటిని?"

"ఆ పోలీసువాడు అనుమానిస్తాడేమో!"

"అంతకన్న మనకు ఎవరూ మందులివ్వరు. వాడికి అను

మానం కలక్కుండా ఉండటానికి నేను త్వరగా వెళ్ళాను. వాడు ఇక్కడకు రాకుండా జాగ్రత్తపడాలి? ఎలావుంది ఇప్పుడు?" సక్సేనా వంక చూస్తూ అడిగింది.

"కొంచెం నయం! కాని మిమ్మల్ని ప్రమాదంలో ముంచటానికే నేను బ్రతికి ఉన్నట్టున్నాను."

"ఇక్కడ ఇరవయినాలుగంటలూ ప్రమాదమే! ఏవేళప్పుడు ఎవడికి మూడుతుందో తెలియదు."

"నామీద కోపంగా ఉందా?"

"అబ్బే! కోపం ఎందుకు!" ఆమె వెటకారంగా అంది. "ఈ ముసలి దంపతులు నా తల్లిదండ్రులు. నేను ఈ గ్రామంలోని హెల్త్ సెంటర్‌లో నర్సుని. ఇక మా అన్నయ్య నీ ఉనికిని మీ వాళ్ళకు తెలియజేయటానికి వెళ్ళాడు. అంటే మేమందరం కత్తిమీద సాము చేస్తున్నాం."

"ఇందాక పోలీసు దగ్గర మందులు తెచ్చానన్నావేమిటి?"

"అవును! ఇక్కడ ముఖ్యమయిన మందులు అడిగితే వారినిగూడ పోలీసులు అనుమానిస్తారు. ఇది కియాంగ్సా అనే చిన్న పల్లె. సముద్రానికి అరవయ్ మైళ్ళ దూరంలో ఉంది. ఘుంగ్‌లీ అనేవాడు ఇక్కడ ఇన్‌స్పెక్టర్. వాడు నామీద కన్నేశాడు. చాలాకాలంనుంచి నన్ను పట్టాలని పగబట్టాడు. అవును! నీవు ఎవరో స్త్రీ పేరు కలవరించావు! ఎవరామె? నీ భార్యా?"

"కాదు! నా కాబోయే భార్య ఆమె!"

"అలాగా! సరే! ఇక పడుకోండి. మీపై కోపగించుకుంటున్నందుకు నాకూ విచారంగానే ఉంది. కాని నీ రాకవల్ల ఈ కుటుంబం ఇంకా పతనమైపోతుంది. ఇప్పటికే మమ్మల్ని సంఘంలోంచి వెలివేసి ఊరికి దూరంగా అడవిలో

ఉంచారు. నీకు ఆశ్రయం ఇచ్చిన సంగతి పోలీసులకు తెలిస్తే మమ్మల్ని దేశద్రోహుల క్రింద జమకట్టి చుట్టూ ఉన్న చెట్లకు మమ్మల్ని ఉరితీస్తారు. ఇక పడుకోండి వస్తాను" అంటూ ఆమె వెళ్ళిపోయింది, దుప్పటి గొంతు వరకూ కప్పి.

అయితేతను అరుణ పేరు కలవరించాడా? కిరణ్ కుమార్ ఆమెను తనకు పరిచయం చేశాడు. ఆ తర్వాత తామిద్దరి స్నేహం బాగా పెంపొంది వివాహందాకా వచ్చింది. ఆలోచిస్తూనే అతడు నిద్రలోకి జారుకున్నాడు.

# 3

తన రూమ్ హ్యాండిల్ మీద చెయ్యి వేయబోయి ఆగాడు కిరణ్ కుమార్.

తను లేనప్పుడు దొంగతనంగా ఎవరైనా విదేశీ ఏజెంట్లు జొరబడవచ్చేమో అని ఊహించి, హ్యాండిల్ మీద పల్చటి పౌడర్ చల్లాడు బయటకు వెళ్ళేటప్పుడు. హ్యాండిల్ మీద వ్రేలిముద్రలు ఎవరివో స్పష్టంగా కనుపిస్తున్నయ్.

జేబులోని పిస్టల్ ని గట్టిగా పట్టుకుని రెండో చేతో హ్యాండిల్ త్రిప్పి లోపలకు వెళ్ళాడు. తలుపు పక్కనే ఒక పుస్తకాన్ని దోవకడ్డంగా పడేసి వెళ్ళాడు తను. ఆగంతకుడు లోపలకు పోవాలంటే, దాన్ని తొక్కిగాని లోపలకు పోవాలి లేదా ప్రక్కకు తన్నాలి. పుస్తకం ప్రక్కకు తన్ని వేయబడివుంది.

తలుపు తన వెనుకనే మూసేసి లాక్ చేశాడు. అక్కడే నిలబడి రూమ్ అంతా కలయజూశాడు. బెడ్ క్రిందా, కిటికీ కర్టెన చాటునా ఎవరూ లేరు. అతడి దృష్టి బాత్ రూమ్ వేపు మళ్ళింది.

అడుగులో అడుగు వేసుకుంటూ బాత్ రూమ్ దగ్గరకు

వెళ్ళి దభాలున తలుపు తోశాడు. పిస్టల్ గురిపెట్టి చూస్తూ "ఎవరు లోపల. వెంటనే బయటకు రావాలి. లేదా లోపలకు చేతిబాంబు విసురుతున్నాను" అన్నాడు.

లోపల్నుంచి సమాధానం రాలేదు.

"ఎవరూ లేరా లోపల? బాంబ్ విసురుతున్నాను" అంటూ బూట్ కాలుతో నేలమీది వస్తువును లోపల పడేలా తన్నాడు.

"ఆగండి! నన్ను చంపద్దు!" అంటూ లోపల్నుంచి ఎయిర్ హోస్టెస్ తనను వెంటాడిన స్త్రీ బయటకుదూకింది.

"చేతులు పైకెత్తు!" అని ఆజ్ఞాపించాడు కిరణ్ కుమార్. ఆమె జేబుల్ని వెతికాడు. రివాల్వర్ దొరికింది. మరో జేబులో సిగరెట్ ప్యాక్ దొరికింది. వాటిని టేబుల్ మీద పడేశాడు. ఆ తర్వాత ఆమె రొమ్ముల మధ్యగా చెయ్యిపెట్టి వెదికాడు.

ఆమె చక్కిలిగిలిగా కదిలింది. "అక్కడ ఏం లేవు!" అంది.

"ఎవరు నీవు? ఎందుకు వచ్చావ్?" గద్దించి అడిగాడు.

"ఆ బోడిగుండు వెధవ నీ దగ్గర కాగితాలు వెదకమని పంపాడు.

"ఎవడు వాడు?"

"వాడెవరో నాకూ తెలియదు. అతడి పేరు ప్యావో అని మాత్రమే తెలుసు. అంతకన్న అతడ్ని గురించిన వివరాలు నాకు తెలీవు!"

"అయితే నువ్వు ఆడ ఏజంటువా? ఏదేశం తరఫున పనిచేస్తున్నావ్?"

"అదంతా నాకూ తెలియదు. 'ప్యావో' చెప్పినవిధంగా చేయడమే నా పని. ఎందుకు, ఏమిటి, ఎవరికోసం అని అడిగే అధికారం నాకు లేదు."

కిరణ్ కుమార్ ఛెడేలున ఆమె దవడమీద కొట్టాడు. ఆమె కళ్ళంట నీరు జలజల కారింది. "చెప్పు! ఊఁ!" అన్నాడు.

"నన్ను నమ్మండి. 'ప్యావో' అంటే నాకు ద్వేషం. కాని అతడు చెప్పినట్టుగా చేయక తప్పలేదు. నాతమ్ముడు షాంగ్ అతడి చేతుల్లో ఉన్నాడు. అందుకే నేను అతడు చెప్పినట్టల్లా చేయాల్సివస్తోంది. లేకపోతే అతడ్ని చిత్రహింసపెట్టి నామీద పగను అతడిమీద తీర్చుకుంటాడు!"

"నీ తమ్ముడా? ఎక్కడున్నాడు అతడు?"

"తైపేలో ఏదో స్కూల్లో ఉన్నాడని చెప్పాడు. అతడి క్షేమం గురించే నేను ఆ వెధవ చెప్పినట్టల్లా చేయాల్సి వస్తున్నది."

"అయితే నిన్ను బ్లాక్ మెయిల్ చేసి, వాళ్ళు నీచేత ఈ పనులు చేయిస్తున్నారా?"

"అవును. వాడు చాలా దుర్మార్గుడు. వాడు అరుణను నీకోసమే కిడ్నాప్ చేశాడు. ఆమెను వెతుక్కుంటూ నీవు వస్తావని అన్నాడు."

"నన్ను పట్టుకోవడంకోసం వాడు అరుణని ఎత్తుకెళ్ళాడా? వాడ్ని ప్రాణాలతో వదలకూడదు. 'ప్యావో' గురించి చెప్పు ఇంకా!"

"అతడ్ని గురించి నాకంతగా తెలీదు. కాని నీ గురించిన సమాచారం అంతా అతడికి తెలుసునని చెప్పాడు. నీవూ, అరుణ లోగడ ప్రేమించుకున్నారట గదా! ఆమె కోసం నీవు నిప్పుల్లోగూడ దూకుతావట. నిన్నూ, నీతో బాటు ఆ పేరేమిటబ్బా, ఆఁ! సక్సేనా అట! మీ ఇద్దర్నీ ప్రాణాలతో పట్టిస్తే చైనా ప్రభుత్వం అతగాడికి ప్రమోషన్ ఇస్తుందట. పెద్ద బహుమతిగూడ ఇస్తుందన్నాడు."

"అందుకని, ఈ పనికి నిన్ను ఉపయోగించుకుంటు

న్నాడా?"

"అంతేకాదు. తనపని పూర్తికాగానే నా తమ్ముణ్ని అప్పజెబుతానన్నాడు గూడా!"

కిరణ్ కుమార్ ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆమె ముఖంలో అమాయకత్వం తొణికిసలాడింది. ఆమె చెప్పే విషయాలు నమ్మదగినవిగానే కనుపించాయి.

"ప్యావో వాడి అసలు పేరేనా? లేక మారుపేరా?"

"నాకు తెలియదు. రెడ్ గార్డ్స్ ఉద్యమానికి ముందు నేను చైనాలో టీచర్ గా పనిచేస్తుండేదాన్ని. అప్పుడు నా తమ్ముడు చిన్నపిల్లవాడు. సైనిక సంచలనంలో నా తండ్రి దేశద్రోహ నేరంక్రింద చంపబడ్డాడు. నేను నా తమ్ముడ్ని తీసుకుని పారిపోయాను. హాంగ్ కాంగ్ చేరుకుని అక్కడ్నుంచి మరోదేశం పారిపోదామనుకున్నాను. కాని చైనాతీరం దాటకుండానే పట్టుబడిపోయాం. నన్ను కొన్నాళ్ళు జైల్లో ఉంచారు. ఆ తర్వాత నేను హాంగ్ కాంగ్ పోవటానికి అనుమతించబడింది, వాళ్ళకు గూఢచారిగా పనిచేయటానికి. నేను వాళ్ళ చేతుల్లోంచి పారిపోకుండా ఉండగలందులకు నా తమ్ముడ్ని తమ చేతుల్లోనే అట్టే పెట్టుకున్నారు."

"నీ పేరేమిటన్నావ్!"

"ఇక్కడి పేరు మేరీ! ప్రస్తుతం ఆ పేరుతోనే పిలవండి!"

"ప్యావోని మళ్ళీ ఎప్పుడు కలవాలి నువ్వు!"

"ఈ రోజు సాయంత్రం కలుసుకుని నీ ప్లాన్ గురించి కబురు చెప్పాలి!"

"గుడ్! తర్వాత మరో ముఖ్యవిషయం! నీ తమ్ముడ్ని విడిపించి నిన్నూ అతడ్నీ స్వేచ్ఛా ప్రపంచంలోకి వదిలేస్తాం! నావెంట వస్తావా?" కిరణ్ కుమార్ అడిగాడు.

"ఎందుకు?" మేరీ అనుమానాస్పదంగా అడిగింది.

"ప్యావోని పట్టుకోవాలి! అరుణను విడిపించుకోవాలి. అందుకు నీ అవసరం ఉంది!"

మేరీ ఆశ్చర్యపోయింది. "చూస్తూ చూస్తూ పులిబోను లోకి నడుస్తావా?"

"అలాంటి పులుల్ని ఎన్నిటినో లొంగదీసుకున్నాం! వీడో లెక్కా? ఏమంటావ్?"

ఆమె తటపటాయించింది.

కిరణ్‌కుమార్ తన కిట్‌లోంచి సిరంజ్ తీసి అందులోకి మందు ఎక్కించాడు.

కంగారుపడుతున్న మేరీ చేయిపుచ్చుకుని కసుక్కున సిరెంజ్‌తో ఇంజెక్షన్ ఇచ్చాడు.

"ఏమిటిది? ఎందుకు?" అన్నది కంగారుగా మేరీ.

"భయపడకు. కొంచెం మైకం కమ్ముతుంది అంతే. నిన్ను నాతోపాటు తీసుకువెడుతున్నాను. ప్యావో అరుణను నాకు అప్పగించేదాకా నీవు నా బందీవి" అన్నాడు నవ్వుతో.

"అయ్యో! నా కెవరు దిక్కు? సాయంత్రానికి ప్యావోని కలవకపోతే నా తమ్ముడ్ని చంపేస్తారు!"

"ప్యావో అంత తెలివితక్కువ వాడని అనుకోను! అయినా నీ తమ్ముడి ప్రాణం కాపాడే భారం నాది."

మేరీ ఏదో మాట్లాడబోయింది. కాని ఆమెను మత్తు ఆవహించింది.

కిరణ్‌కుమార్ ఆమెకు మేకప్ చేయసాగాడు. మరో అరగంటలో ఆమె మగవాడి దుస్తుల్లోవుంది.

## 4

ఎండ తీవ్రంగా కాస్తోంది. కప్పులోని రంధ్రంగుండా ఎండ పొడ అతనిమీద పడింది. కళ్ళు నులుముకుంటూ

లేచాడు వినయ్‌సక్సేనా. అతడి శరీరంలో బాధ తగ్గింది. లీన్‌షూ ఇచ్చిన మందులు బాగానే పనిచేశాయన్నమాట అనుకున్నాడు.

"ఇప్పుడు కులాసాగా ఉందనుకుంటాను?" లీన్‌షూ అడిగింది.

"అవును! చాలా కృతజ్ఞుడిని!"

"నన్ను అభినందించకండి! మా అమ్మా నాన్న కోరిక మీద మీకు ఆశ్రయం ఇవ్వాల్సి వచ్చింది. నేనైతే పోలీసులకు వెంటనే అప్పజెప్పేదాన్ని. మా కుటుంబం ఇప్పటికే చితికిపోయింది. సంఘద్రోహులుగా మేం వెలివేయబడ్డాం. మీకు ఆశ్రయం ఇచ్చిన నేరానికి దేశద్రోహులుగా ఎంచబడతాం" బాధగా చూసింది లీన్‌షూ.

"మీ నాన్న ఎక్కడ?" టాపిక్ మారుస్తూ అడిగాడు సక్సేనా.

"అడవిలో కలప కోస్తున్నాడు. ఈ వృద్ధాప్యంలో గూడ అతడికి కష్టాలు తప్పలేదు!"

"నాకు తినటానికి ఏమైనా ఉందా?"

ఆమె లేచింది. రొట్టె, సూప్ తెచ్చి అతనిముందు పెట్టింది. గత రెండురోజులుగా ఆహారం లేదేమో వాటిని ఆవురావురుమంటూ తినేశాడు.

ఖాళీ ప్లేటునీ, గిన్నెని లీన్‌షూ తీసుకుని వెళ్ళింది లోపలకు. వినయ్‌సక్సేనా తన పాకెట్ జేబులోకి చెయ్యిపెట్టి విటమిన్ టాబ్లెట్స్ బయటకు లాగాడు. ఒక టాబ్లెట్‌ని నోట్లో వేసుకుని గ్లాసులో నీళ్ళు గొంతులో పోసుకున్నాడు. ఒక గంటలో అతడికి సత్తువ వచ్చింది. లేచి తిరగాలన్న కోరిక కలిగింది.

లేచి నిలబడ్డాడు సక్సేనా. అతడు కాలు సరిగా మోపలేకపోయాడు. గోడపట్టుకుని నడిచాడు కొంతదూరం.

తిరిగి అలానే బెడ్ దగ్గరకు వచ్చి చేరాడు. ఇలా తను ఇక్కడ అసహాయుడుగా ఎన్నాళ్ళుండాలో! ఇండియా నుంచి తనకు సహాయం వస్తుందా? ఈ లోపల చైనీయులు తనను వెదకి పట్టుకోరుగదా? ఇవే అతడ్ని వేధిస్తున్నయ్.

బయట ఎవరివో మాటలు వినిపించినయ్. అవి ముసలాడి మాటలని గుర్తుపట్టాడు. అతడు చైనా భాషలో మాట్లాడుతున్నా అతడి కంఠంలో ఆతృతను తేలికగా పసిగట్టాడు సక్సేనా. వారంత ఆదుర్దా పడాల్సిన విషయం ఏమైవుంటుంది? తన విషయాన్ని పోలీసులు కనిపెట్టేశారా? అతడి హృదయం దడదడ కొట్టుకుంది.

ముసలాడూ, అతడి భార్యా లోపలకు వచ్చారు.

"నువ్వు చెప్పేది నిజమేనంటావా?" లీన్‌షూ నమ్మలేనట్టుగా అడిగింది.

"నిజంగానే తల్లీ! చుంగ్ లీ సైకిల్ మీద వస్తూండడం మేమిద్దరం కళ్ళారా చూశాం. అతడు మనింటికే బయలుదేరి ఉంటాడు. ఇప్పుడెలా?"

"పోనీ అతడ్ని అప్పజెప్పితేనో?" లీన్‌షూ అన్నది.

"ఒకవంక వాంగ్ ఛూని పంపాంకదా? అతడు వచ్చేదాకానన్నా ఇతడ్ని కాపాడ్డం మన ధర్మం. ఆ తర్వాత ఆ అబ్బాయి అదృష్టం."

"ఆ అబ్బాయి అదృష్టం అలా ఉంచు. ముందు మన గతి చూడండి. ఇన్‌స్పెక్టర్ అతడ్ని కనుక్కున్నాడంటే మనం ఏమయిపోతాం? అతడొక్కడి ప్రాణాలకోసం ఇందరి ప్రాణాల్ని బలిచేయాలా?"

"అలా అనకే తల్లీ! భారతదేశంలో మనం రాజుల్లా బ్రతికాం. ఇంకా ఆ శక్తి మా రక్తంలో ప్రవహిస్తూనే వున్నది. అప్పటికి నీవు చిన్నపిల్లవు. ఇక్కడకువచ్చి మన దేశంలోనే మనం హీనంగా చూడబడుతున్నాం" ముసి

లాడు అన్నాడు ఆవేశంతో.

"మనం వాదించుకుంటూ కాలం గడిపితే ప్రయోజనం లేదు" అంటూ ముసిలావిడ విలువైన క్షణాల గురించి గుర్తు చేసింది.

ముగ్గురూ వాకిలి తలుపు మూసేశారు. సక్సేనాను తీసుకు వెళ్ళి పశువుల కొట్టంలో పడుకోబెట్టారు.

సరిగ్గా అదే సమయానికి తలుపు తట్టాడు ఇన్‌స్పెక్టర్ ఛుంగ్ లీ. ఆదరా బాదరాగా సక్సేనామీద గడ్డికప్పింది లీన్‌షూ. ముసిలాడు వెళ్ళి తలుపు తీశాడు. ముసలిది వెళ్లి సక్సేనా బెడ్ మీద పడుకుంది.

"లీన్‌షూ! ఎక్కడున్నావ్?" కర్కశమైన గొంతు వినిపించింది. వెంటనే పశువులకొట్టం వాకిలి దగ్గరే ఎదురు పడ్డాడు ఛుంగ్ .

"మీ రిచ్చిన మందులు మా అమ్మకు బాగా పనిచేసినయ్! రండి! అలా వెళ్ళి మాట్లాడుకుందాం!" అంది లీన్‌షూ ముఖంమీద నవ్వు పులుముకుంటూ.

"వద్దు! ఇక్కడే మనకు ఏకాంతంగా ఉంటుంది" అంటూ ఆమెకు అడ్డువచ్చాడు ఇన్స్పెక్టర్.

అతడు ఆరడుగుల వ్యక్తి. ఆకుపచ్చని యూనిఫారమ్‌లో ఉన్నాడు. పాలిష్ చేసిన బూట్లు, నడుము బెల్టులో రివాల్వర్, కోరమీసాలు, ముఖంలో కొట్టవస్తూన్న క్రూరత్వం వీటన్నిటినీ సక్సేనా గడ్డిలోంచి గమనిస్తూనే ఉన్నాడు.

అతడు తన వెనుకగా తలుపు మూసేశాడు. "నిన్న రాత్రి కలుస్తానంటివిగదా?" అని అడిగాడు ఆమెనున్నటి చెక్కిలిపై వ్రేలితో రాస్తూ.

"ఎవరో పేషెంట్స్ వచ్చారు. అందుకే రాలేక పోయాను."

"అలాగా! మీ అమ్మ ఆరోగ్యం తెలుసుకున్నట్టూ ఉంటుంది. నీతో మాట్లాడినట్టూ ఉంటుందని నేనే వచ్చాను. ఇక్కడ మీకే ఇబ్బంది లేదనుకుంటాను. మిమ్మల్ని రెడ్ గార్డ్స్ బాధించకుండా కాపాడాను. ప్రశాంతంగా ఇక్కడ నివసించే ఏర్పాటు చేశాను. నాకు చేతనైన సహాయం చేశానా లేదా?"

"అవును! మాకు చాలా సాయం చేశారు" అని ఎటో చూస్తున్న ఆమె నడుం చుట్టూ చేతులు వేసి తన కౌగిలిలో బంధించేశాడు.

ఆ కాముకుడి కళ్ళల్లో అనంతమైన తృష్ణను చూశాడు సక్సేనా. కాని అతడు నిస్సహాయుడు. ఈ సీను ఎప్పుడు అయిపోతుందా అని బిగబట్టుకుని పడుకున్నాడు.

ఘుంగ్ సీ ఆమె పెదవులపై గట్టిగా ముద్దు పెట్టుకున్నప్పుడు ఆమె గింజుకోలేదు ఎప్పటిలా. ఆమె గౌను క్రిందుగా చేయిపోనిచ్చి అండర్ వేర్ జిప్ లాగేశాడు అతడు. డ్రాయర్ క్రిందకు జారింది. ఆమె నిస్సహాయంగా, జాలిగా అతడి కళ్ళల్లోకి చూసింది.

"ఇక్కడా? వద్దు ఇన్స్పెక్టర్?" అంది ఆకులా వణికిపోతూ.

అతడు నవ్వాడు పైశాచికంగా. "ఇదే అసలైన చోటు!" అంటూ ఆమె వక్షోజాల దగ్గర గౌన్ హుక్స్ విప్పాడు. పాలపిట్టల్లాంటి పాలిండ్లు యవ్వనంతో, ఆవేశ భయాలకు ఎగిరెగిరి పడుతున్నయ్. ఇద్దరూ ఒకరివంక మరొకరు చూసుకున్నారు. తీరని కామదాహంతో కోపంగా కుమ్మబోయే ఆబోతులా ఒకరు చూస్తే, నిస్సహాయంగా, చేసేదిలేక దీనంగా చూస్తోంది ఆమె. ఆమెను నేలమీదకు ఒరగేలా చేశాడు. ఆ తర్వాత ఆమెమీదకు వాలిపోయి ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు.

అతడి ఉచ్ఛ్వాస నిశ్వాసాలూ, అంతవరకూ ఏ మగ వాడికీ చోటివ్వని ఆ అమ్మాయి సన్నని మూలుగులు పక్కనాకు వినబడుతూనే ఉన్నాయ్.

పది నిముషాలు గడిచినయ్. ఆమె లేచి తన గుడ్డలు సరిచేసుకున్నది. ఇన్స్పెక్టర్ తన డ్రెస్ తొడుక్కున్నాడు.

"నీకో ముఖ్యమయిన విషయం చెప్పడం మరిచాను. ఈ చుట్టుప్రక్కల ఏదో రాకెట్ వచ్చి పడిందట. సైన్యం దానికోసమై గాలిస్తున్నది. వీలైనంతమటుకు నీవు బయటి ఊళ్ళకు వెళ్ళద్దు."

"ఎందుకని?"

"నీవు తల్లిదండ్రుల్ని అంటిపెట్టుకుని ఉండు. పొరుగూరులో సైనికులు నిన్ను చూసేరంటే నీ దగ్గర కొత్తదానివని అనుమానిస్తారు. అదే ఇక్కడ అయితే నేను నీకేం అపకారం జరగకుండా చూస్తాను. ఏం?"

"అలాగే!"

"నీవు ఇంత తేలిగ్గా లొంగుతావని అనుకోలేదు. ఐనా నీవు పూర్తిగా సహకరించలేదు. నేను మరోసారి వీలు చూసుకుని వస్తాను. అప్పుడు నన్ను పూర్తిగా తృప్తి పరచకపోతే ఊరుకునేది లేదు! అన్నట్టు ఈ చుట్టుపట్లను ఎవరూ కొత్తమనిషి రాలేదుకదా?" ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

"ఈ 'కియాంగ్సూ'కి ఎవరొస్తారు ఇన్స్పెక్టర్" తేలికగా నవ్వుతూ అంది లీన్షూ.

అతడు నవ్వాడు. లీన్షూని మరోసారి కౌగలించుకుని గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

ఆ తర్వాత చకచకా నడిచి బయటకు వెళ్ళిపోయాడు. లీన్షూ గేట్లో నిలబడి సైకిలెక్కి వెళ్ళిపోతున్న ఇన్

స్పెక్టర్ ఛుంగ్ లీ వంక ద్వేషంగా చూసింది.

వినయ్ సక్సేనాకు తనమీద తనకే అసహ్యం వేసింది. తన కళ్లముందర ఒక యువతి తన రక్షణకోసం తన శీలాన్ని బలిచేసుకుంటే సహించలేకపోయాడు. గడ్డిని ప్రక్కకు తోసేసి లేచాడు. భారతదేశంనుంచి సహాయం వస్తుందో రాదో! ఆలస్యమయేకొద్ది చైనా సేనలు తనకోసం ప్రతి గజంమేరా వెతుకుతూ వస్తారు. వారి చక్రబంధంలో తను బిగవకముందే తప్పించుకోవాలి. రాకెట్ ఎక్కడ కూలిపోయిందో తనే వెతుక్కుంటూ వెళ్ళి, అందులోని ముఖ్యమైన టేప్ లూ, మీటర్లూ తీసుకుని ఎలా తప్పించుకోవాలో ఆ మార్గాన్ని వెతుక్కోవాలి. తనలాంటి మేజర్ ఇలా చేతులు ముడుచుకుని కూర్చోవటం ఏంబాగోలేదు అనుకున్నాడు.

ఒకవైపు కాలు బాధపెడుతున్నా లెక్కచేయకుండా నాలుగు గజాలు నడిచాడు. ఆ తర్వాత అతడు కాలు మోపిన చోట రాయి కదిలిపోయింది. తమాయించుకోలేక అతడు పడిపోయాడు. తలకు దెబ్బ తగిలింది. తర్వాత అతడికి స్పృహ తప్పిపోయింది.

## 5

నేలంతా తడితడిగా ఉంది. ఆకాశంలో మబ్బులు కమ్మి మళ్ళీ వర్షించేలా ఉంది. మబ్బులు కమ్మటం మూలాన్ని అది ఉదయమో, సాయంకాలమో గూడ తేడా తెలీటంలేదు.

కిరణ్ కుమార్ తన ప్రక్కనున్న వ్యక్తిని పేషెంట్ ని నడిపించే డాక్టర్ లా ఒకచేత్తో పట్టుకుని అడుగులు వేయిస్తున్నాడు. మగవేషంలో ఉన్న ఆ వ్యక్తి మేరీ. అతడిచ్చిన ఇంజెక్షన్ ప్రభావం ఇంకా పోలేదు. అందుకే

ఆమె పిచ్చిదానిలా చూస్తూ అతడు నడిపించినట్టుగా నడు స్తోంది.

హాంగ్‌కాంగ్‌లోని హో-యాంగ్-హో నది ఒడ్డున ఒక ఓడరేవు అది. తీరం అంతటా పడవలతోనూ లాంచీల తోనూ సందులేకుండా ఉంది.

ఒక లాంచీ దగ్గరకు వెళ్ళి "'సీ డ్రాగన్'ని చేరుకునే లాంచీ ఏదీ?" అని అడిగాడు కిరణ్‌కుమార్. లాంచీ అంచుమీద కూర్చుని వ్రేలాడుతున్న ఒక వ్యక్తి ఒడ్డుకు దూకి వారికి దగ్గరగా వచ్చాడు.

అతడు ఆరడుగుల ఎత్తు ఉన్నాడు. నల్లగా, బలిష్ఠంగా ఉన్నాడు.

"ఎవరు మీరు? వరదకాలంలో వచ్చారేం?" అని అడిగాడు అతడు.

"వాన అయినా వరద అయినా మేం వెనుదీయం. మేము భారతీయులం!" చిన్నగా గొణిగాడు కిరణ్ కుమార్. కోడ్‌వర్డ్ చెప్పాడు.

నల్లని వ్యక్తి అతడివంక ఎగాదిగా చూశాడు "నీ పేరు?"

"కిరణ్‌కుమార్!"

"నేను మరో పేరు విన్నానే!"

"అతను శత్రువుల చేత చంపబడ్డాడు. అందుకే నేను వచ్చాను అతడి స్థానే."

"ఉదయంనుంచీ మీ కోసం ఎదురుచూస్తున్నాను. ఎవరూ రాకపోవడంతో విసుగెత్తింది. సాయంత్రందాకా ఎవరూ రాకపోతే తిరిగి వెళ్ళిపోదామనుకున్నాను. ఇక పదండి వెడదాం! ఈ నదిలో, మనం ఇరవయ్ మైళ్ళు ప్రయాణం చేస్తేకాని 'సీ డ్రాగన్'ని చేరలేం!"

ముగ్గురూ నడిచారు ముందుకు. ఇది హోయాంగ్‌హో

నది అయి ఉండాలనుకున్నాడు కిరణ్ కుమార్.

"ఈ అబ్బాయి ఎవరు?" మూడో వ్యక్తి అడిగాడు.

"అబ్బాయి కాదు! అమ్మాయి! నా సెక్రటరీ! అన్నట్టు నీ పేరు?"

"వాంగ్-ఛూ! 'సీ డ్రాగన్' స్టీమరులో ఓడనడిపే పైలెట్ ని."

ముగ్గురూ పెద్ద తెప్పలోకి ఎక్కారు. "నేను కాపలా కాస్తుంటాను. మీరు తెడ్లువేయండి. ఇన్స్పెక్షన్ కని సెర్చిలైట్లుమీద పడేటప్పుడు ఒరిగి కూర్చోండి" వాంగ్-ఛూ చెప్పాడు.

ప్రవాహంలో తెప్ప ముందుకు జారుతోంది ఆట్టే తెడ్లు వేయకుండానే. మేరీ ఇంకా మత్తులోనే ఉంది. యాంత్రికంగా చెప్పిన పనులు చేసుకుపోతోంది.

మధ్యమధ్యలో పాట్రోల్ లాంచీల్లోంచి సెర్చిలైట్లు వచ్చి పడుతున్నయ్. అప్పుడు మాత్రం ఇద్దరూ తెప్పలోని సరుకుల చాటుగా వంగి కూర్చుంటున్నారు.

నది పొడుగునా లాంచీలు, మోటార్ బోట్లు, నాటు పడవలూ రెండు వేపులా లంగర్లువేసి ఉన్నాయ్. మరి కొన్ని ప్రవాహానికి ఎదురుగా ప్రయాణిస్తున్నయ్. నది చాలా వెడల్పుగా ఉండటంచేత ఒకదానికొకటి ఎదురు పడకుండా సాగిపోతున్నయ్.

నాలుగు గంటలు ప్రయాణం చేసిన తర్వాత తెప్ప సముద్రం చేరుకుంది.

దూరంగా సముద్రంలో 'సీ డ్రాగన్' లంగరు వేయబడి ఉంది.

"ఓడ కాప్టెన్ ఆశాపరుడు. అతడికివ్వటానికి డబ్బు తెచ్చారా?"

"పది బంగారు బిస్కట్లు! పని అయింతర్వాత మా

దేశంనుంచి ఇంకా పెద్ద బహుమతీ దొరుకుంది.''

''శుష్క వాగ్దానాలకు వాడు లొంగే రకంకాదు. కొంచెం తక్కువైనా బంగారం వాడి ముఖాన విసిరికొట్టితే సరి!''

తెప్ప స్టీమరు దగ్గరకు చేరింది. పైనించి త్రాటినిచ్చెన దింపబడింది. దాని మీదుగా ముందు మేరీ ఎక్కింది, తర్వాత కిరణ్‌కుమార్ ఎక్కాడు.

వాంగ్-ఛూ తెప్ప మరో వ్యక్తికి అప్పజెప్పి అతడి చేతిలో ఒక బంగారు బిస్కట్‌ని పెట్టాడు. అతడు కళ్ళు పెద్దవిచేసి దాన్ని చూశాడు.

''దాచుకోరా పుండాకోర్! పోలీసులు చూశారంటే...'' వాంగ్-ఛూ తర్వాత అనకుండానే వాడు దాన్ని చొక్కా లోపలి జేబులో దాచేసుకున్నాడు.

వాంగ్-ఛూ తాడు నిచ్చెన మీదుగా స్టీమరులోకి ఎక్కాడు. డెక్ మీద ఓడ కెప్టెన్ సాలూంగ్ వాళ్ళ ముగ్గురివంకా అనుమానంగా చూశాడు.

''వీళ్ళేనా నీవు చెప్పింది?'' వాంగ్-ఛూని ఉద్దేశ్యించి అడిగాడు.

''అవును! ఇతడే నేను చెప్పిన గూఢచారి. ఈ మగ వేషంలో ఉన్న స్త్రీ అతడి సెక్రటరీ అట.''

''గూఢచారివెంట సెక్రటరీ ఎందుకు?'' అతడు వికటంగా నవ్వాడు.

''ఆమెగూడ మరో గూఢచారిణి!'' కిరణ్‌కుమార్ జవాబు చెప్పాడు.

''అలా చెప్పు! సరే! వాంగ్-ఛూ! నేను చెప్పినది సిద్ధంచేశావా?''

వాంగ్ ఛూ కిరణ్‌కుమార్‌కి సంజ్ఞ చేశాడు. తనభుజానికి తగిలించుకున్న కిట్ జిప్ లాగి అందులోనుంచి

ప్యాకెట్ ని అందించాడు.

దాన్ని ఊడదీసి చూశాడు కెప్టెన్ సాలూంగ్. దాన్నిండా బంగారం బిస్కట్లు పడివున్నయ్. కెప్టెన్ కళ్ళు వింతగా మెరిసినయ్.

"సరే! వీళ్ళిద్దర్నీ స్టోర్ రూమ్‌లో దాచిపెట్టు. కస్టమ్స్ అధికారుల ఇన్‌స్పెక్షన్ కాంగానే పైకి రావచ్చు."

వాంగ్ ఛూ తల ఊపాడు. తనవెంట రమ్మన్నట్టు సైగ చేసి ముందుకి కదిలాడు.

"కెప్టెన్ నేనొకసారి ఒడ్డుకు వెళ్ళి రావచ్చా?" అనడిగాడు కిరణ్ కుమార్.

కెప్టెన్ కోపంగా చూశాడు అతడివేపు. "నీకేం మతిపోలేదుకదా? నిన్ను దొంగచాటుగా దాటేస్తున్నాం. ఈ సంగతి పోలీసులు పసిగట్టారంటే స్టీమర్ని యిక్కడే ఆపేస్తారు!" అని అరిచాడు. "మొత్తానికి భలే తెలివైనవాళ్ళనే ఎక్కించావ్? సముద్రంలోకి దూకుతారో, పోలీసుల చేతుల్లోపడి జైలుకెళ్తారో వెళ్ళమను!" అని వాంగ్-ఛూ కేసి చూశాడు.

"వాళ్ళ మనిషి నెవరో ఎత్తుకుపోయారట! అందుకని అతడు కొంచెం బాధపడుతున్నాడు. అంతకన్న మరేం లేదు!" వాంగ్-ఛూ సర్ది చెప్పాడు.

"సంతోషించాలే! వీళ్ళను క్రిందకు తీసుకువెళ్ళు ముందు. ఆ గదిలో వీళ్ళను ఉంచి గదికి తాళంవేయి. లేకపోతే సమయం సందర్భం లేకుండా డెక్ మీదకు రాగలరు!"

కిరణ్ కుమార్, వాంగ్-ఛూ వెనకాలే నడిచాడు. అరుణ! ఆమె ఎక్కడుందో, ఎన్ని కష్టాలు పడుతూందో! తను ఆమెకు సహాయం చేసే స్థితిలో లేడు.

నిచ్చెన మీదుగా దిగి లోపల గదిలోకి వెళ్ళారు ముగ్గురూ. ఇంజన్ రూమ్ ప్రక్కనే ఉంది స్టోర్ రూమ్.

"ఆ కెప్టెన్ ముక్కోపి. కాని మంచివాడే. కాస్సేపు ఉంటే వాడి కోపం అదే చల్లారుతుంది. ఇతగాడి భార్యా, పిల్లల్ని రెడ్ గార్డ్స్ చంపేశారు. ఇతడూ చైనావాడైనా ఆ దేశం అంటే మీ కంత స్నేహమో అతగాడికీ అంతే!"

"కస్టమ్స్ వాళ్ళు ఓడ అంతా చెక్ చేస్తారా?" కిరణ్ కుమార్ అడిగాడు.

"లేదు! ఏదో రొటీన్ చెకింగ్. వాళ్ళ మామూళ్ళు పుచ్చుకుని వెళ్ళిపోతారు. ఓడలో మీకంటె విలువైన సరకు ఉంది. అది వాళ్ళ కంటబడితే, ఓడనే ప్రేల్చేస్తాడు కెప్టెన్. నేను మళ్ళీ వచ్చేటప్పుడు మీకు చైనా దుస్తులూ, ప్యాస్‌పోర్టులూ తెస్తాను" అంటూ వాంగ్-ఛూ బయటకు వెళ్ళి తలుపులు మూసేసి బయట తాళం వేశాడు.

# 6

వినయ్ సక్సేనా మౌనంగా బెడ్ మీద పడుకున్నాడు. లీన్‌షూని పలకరించటానికే అతడికి బాధగా ఉంది. ఆమె తనమీద కారాలూ, మిరియాలూ నూరుతున్నది. తను ఆ ఇంటినుంచి బయటపడడానికి ప్రయత్నించి పడిపోయాడు. ఇంట్లో లేకపోవడం చూసి తనను వెతుక్కుంటూ వచ్చింది లీన్‌షూ.

పడిపోయిన తనకు చేయూతనిచ్చి మళ్ళీ వెనక్కు తీసుకువచ్చింది.

"లీన్‌షూ! నువ్వు కోప్పడకుండా ఉంటే ఒకమాట!" అన్నాడు సక్సేనా.

"ఏంటి?" అంటూ ఉరిమింది లీన్‌షూ.

"నా క్యాప్సుల్‌ని ఒకసారి చేరుకోవాలి. ముఖ్యమయిన టేప్‌లూ అంతరిక్ష పరిశోధన లేబరేటరీకి అప్పగించవలసిన పరికరాల్ని తీసి భద్రపరచాలి. అవి లేకపోతే నేను మా దేశం తిరిగిపోవడం శుద్ధ దండుగ. ఏదన్నా పాయిజన్

మ్రింగి చనిపోవటం మేలు."

లీన్‌షూ అతని మాటలకు కరిగిపోయింది. "ఘుంగ్‌లీ నన్ను బలాత్కారించటం చూసి సహించలేక నీవు పారిపోయావేమో అనుకున్నాను. ఇదే నీవు మీ దేశంలో చాలి ఉంటే, ఈ పాటికి నీకు ఎన్నో సన్మానాలూ, బహుమతులూ అంది ఉండేవి!" ఆమె చేయూత ఇస్తే అతడు నడవసాగాడు. ఇద్దరూ కాప్సుల్ పడిన చోటికి బయలుదేరారు.

"అవును! నీవుకూడ నాతోపాటు మా దేశం వచ్చేయకూడదూ?"

"నేను వచ్చేస్తే ఈ ముసలి తల్లిదండ్రుల్ని ఎవరు చూస్తారు? నా తమ్ముడు వాంగ్-ఘూ ఎప్పుడూ సముద్రం మీదే ఉంటాడాయె!"

"దైవం అనుకూలించి నాకు సహాయం సకాలంలో అందితే మీ అందర్నీ నా దేశం తీసుకువెడతాను."

"మరీ అంతటి అత్యాశకూడదు. ముందు వాంగ్-ఘూ తన పని ఎంతవరకూ నెరవేరుస్తాడో చూడాలి గదా?"

ఆకాశంలో పెద్దగా శబ్దం వినవచ్చింది. జెట్ ప్లేన్ ఎగురుతూన్న శబ్దం అది. ఇద్దరూ మౌనంగా విన్నారు ఆ శబ్దాన్ని. ఇద్దరిలోనూ ఆతృత ఎక్కువైంది.

"ఈ విమానాలు ఎప్పుడూ వస్తుంటాయా?" సక్సేనా అడిగాడు.

"లేదు! ఈ ప్రక్కగా ఎప్పుడూ విమానాలు రావు. ఇది మొట్టమొదటిసారి జెట్ ప్లేన్‌ని చూడటం."

"అయితే నిస్సందేహంగా వాళ్ళు నా కోసమే వెదుకుతున్నారు. ఆకాశంలోంచి చూస్తే నేను దిగిన చోటు వాళ్ళకు స్పష్టంగా తెలిసిపోతుంది" నిస్పృహగా అన్నాడు సక్సేనా.

"అందుకూ అవకాశంలేదు. క్యాప్సుల్ చెట్లకొమ్మల్ని విరుస్తూ భూమిని తాకింది. దాన్ని చెట్లనీడల్లోకి లాగాం. పోతే పారాచూట్‌లను గోతిలో పడేసి పైన ఆకుల లములు కప్పాం."

"ఏమో! కాసేపు నేను సురక్షితంగా బయటపడలేనేమో అని నిస్పృహ నన్ను ఆవరిస్తోంది. మరి కాసేపు వాంగ్-ఛూ తనవెంట భారత ఏజెంట్లను వెంటబెట్టుకు వస్తాడని ఆశగా ఉంది."

"అన్నట్టు నీ ప్రియురాలు అరుణకోసమన్నా నీవు ఆత్మహత్య చేసుకోకూడదు. ఆమె అందంగా ఉంటుందా? నాకంటె గూడానా?" లీన్‌షూ అడిగింది.

"నీకంటె అందగత్తెకాదు" అన్నాడు సక్సేనా.

"అబద్ధం! ఆమె నాకంటె సుకుమారంగానూ, అందంగానూ ఉండవచ్చు. పల్లెలో మోటుపనులు చేస్తూ మొరటు చేతులు గలదాన్ని. పైగా పోలీసు వాడిచేత మోటుగా బలాత్కరింపబడిన దాన్ని."

"నిజంగానే చెబుతున్నాను!"

"నువ్వు అబద్ధాలకోరువి. నేనేమన్నా కష్టపెట్టుకుంటానేమో అని అలా చెబుతున్నావ్! అయినా నువ్వంటే ఎందుకో నాకు అభిమానం కలుగుతోంది."

ఇద్దరూ పొదలచాటుగా, చెట్ల క్రీనీడల్లో నడుస్తూ రెండు గంటలు ప్రయాణించారు. నేలంతా ముళ్ళూ, కంపలతో నిండి త్వరగా నడవటానికి ఆటంకం కలిగించినయ్. పైగా సక్సేనా, కాలి బాధతో త్వరగా నడవలేక పోయాడు. రహదారి వెంట వెడితే ఎవరైనా ఎదురుపడవచ్చని అడ్డదారినే తీసుకువెడుతోంది లీన్‌షూ.

ఈ లోపల ఆకాశంలో జెట్ విమానం మరోసారి విహారంచేసి కొండల చాటున అదృశ్యమయింది.

వారు నిల్చున్న ఎత్తైన గుట్టమీదినుంచి చూస్తే 'కియాంగ్సూ' గ్రామం స్పష్టంగా కనబడుతోంది. ఆ గ్రామం చాలా చిన్నది. అన్నీ గుడిసెలే! మొత్తం రెండు వందల ఇళ్ళు వుంటాయేమో! లీన్‌షూ నివసించే ఇల్లు ఊరికి చాల దూరంగా, వెలివేయబడినట్టుగా ఉంది. గ్రామానికి ఒక మైలు దూరంలో ఎర్రని రోడ్డు, రోడ్డుకి వందగజాల దూరంలో యాక్సికియాంగ్ నది పారుతున్నది.

"నాకు ఆ ఇన్‌స్పెక్టర్‌మీద చెప్పలేనంత కోపం వచ్చింది" అన్నాడు సక్సేనా.

"వాడుచేసిన పనికి నా చేతిలో వాడి చావు రాసి వుంది. అయినా నీవు ఇంకా ఆ విషయం గురించే ఆలోచిస్తున్నావా?"

సక్సేనా ఆయాసంతో ఆగాడు. అతడికి దగ్గరగా నిలబడి ఉంది, లీన్‌షూ. ఆమెను దగ్గరకు తీసుకుని ఆమెను పెదవులమీద ముద్దుపెట్టుకున్నాడు తేలికగా. ఆమె ప్రతిఘటించలేదు. చేతోతన పెదవిమీది తడిని తుడుచుకుంది.

"నన్ను లోకువ కట్టేస్తున్నావ్. నీ కళ్ళముందే నన్ను ఆ పోలీసువాడు బలాత్కరించాడని నేను నీ దృష్టిలో చులకనయ్యానా?"

"అలా అనకు! నీవు నా ప్రాణం కాపాడిన దేవతవు!"

"చాల్లే! పొగడ్తలు ఆపు! నీవు నా ముందు ఇలా మాట్లాడావని అరుణకు తెలిస్తే ఆమె కోపం తెచ్చుకోగలదు" అంటూ లీన్‌షూ నవ్వింది.

వినయ్ సక్సేనా చిరునవ్వు నవ్వాడు. ఇద్దరూ ముందుకు సాగారు మళ్ళీ.

ఇప్పుడు అరుణ ఏంచేస్తుంటుందో! ఆమె తనను గురించే ఆలోచిస్తుంటుందా తన ఇంట్లో తీరికగా కూర్చుని? అనుకున్నాడు సక్సేనా.

# 7

"ఆమె నిజంగా నీ సెక్రటరీయేనా?" వాంగ్-ఛూ నిదానంగా అడిగాడు.

"కాదు!" తలవంచుకునే సమాధానమిచ్చాడు కిరణ్.

"నమ్మదగ్గ మనిషేనా? ఇక పైనుంచి ప్రతి రేవులోనూ మన ఓడను అధికారులు చెకింగ్ కోసం ఒకపూట, ఒక రోజల్లా కూడ ఆపుచేస్తారు. అధికారుల ముందు ఆగం చేసి మన సంగతి బయటపెట్టదు గదా?"

"అలా చేయదనే నా నమ్మకం!"

"ఆమె తమ్ముడి సంగతేమిటి? మనం అతడ్ని తేగలమా?"

"పులినోట్లో తలదూర్చటమే!"

"వచ్చే రేవులోనే మనం దిగితే ఆమె తమ్ముడున్న చోటికి తేలిగ్గా పోవచ్చు. ఆమెకూడ పాపం అతడ్ని గురించి గగ్గోలు పెడుతున్నది."

"మనం అక్కడికి వెళ్ళాలంటే తగిన ఆయుధాలు అన్నా ఉండాలిగదా!"

"ఆయుధాలా?" అని నవ్వాడు వాంగ్-ఛూ. తన చుట్టూ ఒకసారి కలయజూసి దగ్గర్లో ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని మళ్ళీ అన్నాడు. "ఈ ఓడలో ఒక బెటాలియన్ సైన్యానికి సరిపడే ఆయుధాలున్నై. హ్యాండ్ గ్రెనేడ్స్, మోర్టార్స్, రైఫిల్స్, మిషన్ గన్స్, ఆటోమేటిక్ పిస్టల్స్ వీటికి సరిపడే మందుగుండు సామానూ ఉంది. ఎవరన్నా శత్రువులకు మన సమాచారం తెలిస్తే ఓడనే ప్రేల్చివేయటానికి అనువుగా అన్నీ వైర్‌తో కనెక్షన్ చేయబడినై."

"నిజంగా పేల్చేస్తారా అపాయం వస్తే!"

"వాళ్ళ చేతుల్లో చిత్రహింసలుపడి వాళ్ళ ప్రశ్నలకు జవాబులు చెప్పేకన్నా అదే నయం. అంతేకాక ఈ

ఆయుధాలు చైనీయులకు దక్కరాదు. అందుకని ఓడలోని సరుకులూ, మనుషులతో సహా ఓడ పేలిపోతుంది."

"మనం ఎప్పుడు లంగరెత్తేది ఇక్కడనుంచి?"

"ఇంకో గంటలో బయలుదేరుదాం. వచ్చే రేవులో మన ఓడని ఒకటి రెండురోజులు ఆపాల్సి వస్తుంది. ఇంజన్ రూమ్‌లో వెల్డింగ్ పనులు చేయించాలట."

"ఎక్కడికక్కడ ఇలా రోజుల తరబడి మనకు ఆలస్యం అయితే మరీ ఆలస్యం అవుతుందేమో!"

"ఏం ఫరవాలేదు. అతడు మా ఇంట్లో సురక్షితంగా ఉంటాడు."

"ఇంతకీ అతడెక్కడున్నదీ చెప్పనేలేదు నీవు!"

"యాక్సికియాంగ్ నదీతీరం వెంబడే కియాంగ్సూ అనే చిన్న గ్రామంవుంది. ఆ గ్రామంలో ఊరికి వెలుపలగా నా ఇల్లువుంది. అక్కడే ఉన్నాడు వినయ్‌సక్సేనా!"

"ఇలా నదిలో నిదానంగా వెళ్ళేకంటే నేలమీదుగా పోతే మనం త్వరగా వెళ్ళగలమేమో!" కిరణ్ అడిగాడు.

"లాభంలేదు! దోవలో అన్నీ పల్లెలు. కొత్త మనిషిని ఇట్టే పసిగట్టేస్తారు" వాంగ్ ఛూ పెదవి విరిచాడు.

"ఇంతకూ మేరీ తమ్ముడి విషయం ఏమిటి? వచ్చే రేవులో ఓడ లంగరు వేయంగానే మనం బయలుదేరితే తిరిగి సాయంత్రానికి వచ్చేయచ్చు అతడ్ని వెంటబెట్టుకుని" వాంగ్ ఛూ మళ్ళీ అడిగాడు.

"చూద్దాం!"

కెప్టెన్, కస్టమ్స్ అధికారుల వెంట డెక్ మీదకు వచ్చాడు. వాంగ్-ఛూ ఓడ చక్రం ముందుకు వెళ్ళి నిలబడ్డాడు.

కిరణ్ కుమార్ తన గదికి చేరుకున్నాడు తిరిగి, అధికారులు వెళ్ళిపోంగానే,

"వాంగ్ ఛూ గూడ నీకు సాయంగా ఉంటానన్నాడు నా తమ్ముడ్ని రక్షించే ప్రయత్నంలో."

కిరణ్‌కుమార్ విసుక్కున్నాడు. "నేను యింత కష్టపడి, ప్రాణాలకు తెగించి వచ్చింది నీ తమ్ముడ్ని రక్షించటానికి కాదు! అక్కడ నేలమీదకు దిగిపోయిన సక్సేనాని విడిపించాక గాని అటు అరుణనికాని, ఇటు నీ తమ్ముడ్ని గాని విడిపించే యత్నం చేయటానికి వీలుండదు."

మేరీముఖం చిన్నబుచ్చుకుని పడుకుంది తన ప్రక్కమీద. కిరణ్‌కుమార్ ఆమె ప్రక్కగా తన ప్రక్క పరుచుకుని పడుకున్నాడు. మేరీ అటుతిరిగి పడుకుంది. ఆమె నిద్రపోతున్నదో, మెలకువలో ఉన్నదో!

తనకంటె ముందు బయలుదేరిన ఏజెంట్ హత్య చేయబడిన తీరు గురించే ఆలోచిస్తూ చాలాసేపు మెలుకువగా ఉన్నాడు. ఓడ సాగంగానే అతడికి నిద్రపట్టింది.

అతడికి మెలకువ వచ్చేసరికి తెల్లవారింది. అతని ప్రక్కన మేరీలేదు. ఓడ, రేవుని చేరినట్టుంది లంగరేసి ఆగివుంది. కిరణ్‌కుమార్ మనసు ఏదో కీడుని శంకించింది. లేచి గబగబ డెక్‌మీదకు వెళ్ళాడు. స్టీరింగ్ వీల్ ముందు వాంగ్ ఛూ నిలబడి కాఫీ త్రాగుతున్నాడు. డెక్ మీద నాలుగు ప్రక్కలా కలయజూశాడు కిరణ్‌కుమార్.

"కాఫీ త్రాగుదాం రండి!" అంటూ కిరణ్‌కుమార్‌కి మరో పింగాణీ గిన్నెలోకి కెటిల్‌లోంచి కాఫీ వంచిపోశాడు.

"మేరీ వచ్చిందా డెక్ మీదకు?" కాఫీ త్రాగుతూ అడిగాడు కిరణ్.

"డెక్‌మీదకు రాలేదే? గదిలో లేదా ఆమె?" వాంగ్ ఛూ కంగారుగా అడిగాడు.

"లేదు. ఒకవేళ ఆమెగాని..." అంటూ కిరణ్

కుమార్ ఆగిపోయాడు వాంగ్ ఛూ కళ్ళల్లోకి చూస్తూ.

"అవును! నా భయంగూడ అదే! ఆమె తమ్ముడ్ని రక్షించటానికి వీలవదని అంత నిష్కర్షంగా చెప్పకుండా ఉండాల్సింది!"

ఇద్దరూ ఓడ అంతా కలయ తిరిగి వెదికారు. మేరీ దొరకలేదు. కెప్టెన్ని అడిగారు ఆమె గురించి.

"అది సముద్ర ప్రయాణంతో విసుగెత్తి భూమిమీదకు పారిపోయి వుంటుందిలే!" అని చప్పరించాడు కెప్టెన్.

"ఆమె తన పైఅధికారి ప్యావోని కలుసుకుని మన ఓడగురించి చెప్పిందంటే చైనా సైన్యం అంతా పరుగెత్తుకొస్తారు మనకోసం!" కిరణ్ కుమార్ ఆదుర్దాగా చెప్పాడు.

"అవునా?" అని వాంగ్ ఛూ వంక చూస్తూ అడిగాడు కెప్టెన్.

"ఆమె అంత తేలిగ్గా చెప్పదనుకోండి!" వాంగ్ ఛూ ఆమెని సమర్థించబోయాడు.

"కాని ఆమెకు మనగురించి సర్వం తెలుసు. అతను చెప్పేదే కరెక్ట్. ఆమె మనల్నందర్ని వెధవల్ని చేసి తప్పించుకోబోయింది. ఆమెను నీ పక్కలో వేసుకుని, గట్టిగా కౌగలించుకుని పడుకుని ఉండాల్సింది. ఇప్పుడేం చేయటం! వాంగ్ ఛూ! నీవు వెళ్ళి ఆమెను లాక్కురాగలవా సాయంత్రంలోగా!"

"నేనూ ఇతడూ గూడ వెడతాం!"

"ఊఁ! వెళ్ళండి!" అని అరిచాడు కెప్టెన్.

# 8

రేవులోని జనంలోంచి దోవచేసుకుని కిరణ్ కుమార్, వాంగ్ ఛూ ఇద్దరూ బస్ ఎక్కారు. ఇద్దరూ మౌనంగా

ఎవరి ఆలోచనల్లో వారున్నారు. చిన్న చిన్న పల్లెల్లోంచి బస్ పోతున్నది. ఆ పల్లెల్లో ఎక్కువగా పూరిళ్ళు, బంగళా పెంకులతో కట్టిన ఇళ్ళేగాని మేడలు కనబడలేదు కిరణ్ కుమార్‌కి. ప్రతి గ్రామంచుట్టూ దట్టంగా చెట్లూ, వందల కొలదీ ఎకరాల్లో పైరూ పచ్చగా కనబడుతున్నయ్.

ఒకగంట ప్రయాణం తర్వాత ఇద్దరూ ఒకచోటదిగారు. రోడ్డుప్రక్కనేవున్న బడ్డీ హోటల్లోకి వెళ్ళి టిఫిన్ చేసి, టీ త్రాగారు. పావుగంట గడిచేసరికి మరో బస్ వచ్చింది. మళ్ళీ అందులోకి ఎక్కారు ఇద్దరూ.

గంటన్నర బస్సు ప్రయాణం వాళ్ళను ట్సియాంగ్ చేర్చింది. వాంగ్ ఛూకి ఈ ప్రదేశాలన్నీ క్షుణ్ణంగా తెలుసు కాబోలు చకచకా జనాన్ని తోసుకుని ముందుకు పోతున్నాడు. ఆవు వెంటపోయే దూడలా కిరణ్ కుమార్ అతడ్ని అనుసరిస్తున్నాడు.

మార్కెట్ దగ్గర ఆగిపోయాడు వాంగ్ ఛూ.

"అదిగో! ఆ టక్కులాడి మనకంటె ఎంత ముందర వచ్చిందో!" అన్నాడు వాంగ్ ఛూ.

అతడు చూపిన దిక్కుగా చూశాడు కిరణ్ కుమార్. మార్కెట్ కి ఎదురుగా పెద్ద హైస్కూలు, ఆ ఆవరణ లోనే హాస్టలూ ఉంది. మేరీ గేటులో నిలబడి లోపలకు వెళ్ళేవారివంక కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తున్నది.

అయితే ఆ గుంపుల్లో తన తమ్ముడు కనుపించలేదు ఆమెకు. అయినా ఆమె ప్రక్కగా నిలబడి ఇంకా వెతుకుతూనేవుంది ఆతడికోసం.

"ఆమెని వెళ్ళి కలుద్దామా?" వాంగ్ ఛూ అడిగాడు.

"వద్దు! అంటిపెట్టుకుని ఎన్ని నేత్రాలు కాపలా కాస్తున్నయ్యో! మనకోసం వాళ్ళు వలపన్నే ఉంటారు!"

"మరిప్పుడేం చేయడం!"

"ఆమెని ఎవరన్నా కనిపెట్టుకుని ఉన్నారేమో చూద్దాం!" అన్నాడు కిరణ్ కుమార్.

ఈలోపల మేరీ గేటు ఈ చివరినుంచి ఆ చివరకు మారింది. ఆమె అచ్చం చైనాలో వరిపొలాల్లో పనిచేసే మోటువనితలా వుంది.

"ఎంతకు తెగించింది ఆడదైనా? పోనీ నేను వెళ్ళి ఆమెను కలవనా? ప్యావో నీకోసం వలపన్ని ఉండచ్చు. అదే నేను వెడితే! అతడు నన్నెరుగడుగదా? ఎవరో ఊళ్ళోని వ్యక్తిగా ఉపేక్షిస్తాడేమో!"

"తొందరపడద్దు. మనం ఆమె వెనకే తప్పకుండా వస్తామని వాళ్ళు మనల్ని ట్రాప్ చెయ్యటానికి రెడీగా ఉంటారు! ఒకపని చెయ్! ఒకసారి స్కూలు ఆవరణ చుట్టూ తిరిగిరా!"

వాంగ్ ఛూ జేబుల్లో చేతులు దూర్చుకుని సన్నగా ఈలపాట పాడుకుంటూ ముందుకు వెళ్ళాడు. స్కూలు చుట్టూ తిరిగి పావుగంటలో తిరిగి వచ్చాడు.

"నీ ఊహ కరక్టే గురూ! రెండు మిలిటరీ వ్యాన్‌లు ఒక కొత్తకారు స్కూలువెనుక గేటుదగ్గర ఉన్నయ్. ఎవరో బోడిగుండువ్యక్తి లోపల నిలబడివున్నాడు. అతడి ముందు నమ్రతగా మరో నలుగురైదుగురు సైనికులున్నారు. వాళ్ళందరి చేతుల్లో ఆయుధాలున్నై!"

కిరణ్ కుమార్ ఒక్క నిముషం ఆలోచించాడు. "నేను వెళ్ళి మేరీని కలుస్తాను. ఇద్దరం లోపలకు వెళ్ళి ఆమె తమ్ముడ్ని తీసుకొస్తాం. ప్యావో మమ్మల్ని చుట్టుముడతాడు. మమ్మల్ని ఎస్కార్ట్‌తో కారులో ఎక్కిస్తాడు. డ్రైవర్ పోనీ! అంటాడు సంతోషంగా. కాని ఆ డ్రైవర్ స్థానంలో నీవుంటావ్! నీచేతిలో ఆటోమేటిక్ పిస్టల్ ఉంటుంది. దాన్ని ప్యావో గుండెల కానిస్తావ్

నీవు! అర్థమయిందా?" కిరణ్‌కుమార్ వేగంగానూ, స్పష్టంగానూ పలికాడు.

"కానీ మనం పులితో చెలగాట మాడుతున్నా మేమో!"

"అంతకన్న గత్యంతరం లేదు! మన చావు బ్రతుకులు నీ చేతుల్లో ఉన్నయ్. అదుర్దా పడవద్దు. ఉద్రేకాన్ని తెచ్చుకోవద్దు. నింపాదిగా, నిదానంగా, నికరంగా పని సాగించు! ఓకే!" అంటూ కిరణ్‌కుమార్ ముక్కుకు సూటిగా నడిచి మేకీ ప్రక్కకు వెళ్ళి నిలబడి సిగరెట్ వెలిగించాడు.

ఆమె అతడివంక నిర్లక్ష్యంగా చూసి మళ్ళీ ముఖం తిప్పేసుకుంది.

"నాతో చెపితే నేనూ వచ్చేవాడ్నిగదా! అలా దొంగ చాటుగా రాకపోతే!" ఎటో చూస్తూ అన్నాడు కిరణ్ కుమార్.

"నిన్ని ట్రాప్‌లోకి రాకుండా చేయాలనే నేను వచ్చే శాను."

"ట్రాప్ వేశారంటావా?"

"ఇంతకుముందే ప్యాంవో నా తమ్ముడ్ని ఆడిటోరియంలో తన ప్రక్కన కూర్చోబెట్టుకుని నవ్వుతూ మాట్లాడుతుం డగా చూశాను. వారికి భయపడే నేను వెనక్కు వచ్చేసి ఇక్కడపొంచి ఉన్నాను. కాని వాడు ఈ పాటికి నన్ను చూసే ఉంటాడు."

"మరయితే నిన్ను పట్టుకోకుండా వదిలేశాడేం?"

"బహుశా నీవుగూడ వస్తేగాని తనపని పూర్తిచేసుకో డేమో!"

"అలాగా! అయితే పద! లోపలకువెళ్ళి నీ తమ్ముడ్ని

కలుద్దాం!'' అన్నాడు ఆమె చంకక్రిందుగా తన చేతిని పోనిస్తూ.

"వద్దు. అతడు నిన్ను బంధిస్తాడు. చంపినా చంపచ్చు. పైగా నేను ఇండియన్ ఏజెంటుతో సహకరించానని నాపై నేరం విచారిస్తారు."

"నీ తమ్ముడు కావాలంటే నాతో రా! నన్ను ఇక్కడకు నా ఇష్టానికి వ్యతిరేకంగా రప్పించావు నీవు. నేను రాకుండా ఉండేవాడ్నే. నిన్ను ప్యావో దొరకబుచ్చుకుంటే మా ఓడలోని రహస్యాన్ని తేలిగ్గా రాబట్టి వుండేవాడు నీనుంచి."

"నేను చెప్పేదాన్ని కాదు మీ గురించి!"

"వాదనకు ఇది సమయంకాదు! మేరీ వెనుకంజవేసి ఫలితంలేదు. పద! ముందుకుసాగు!"

"నాకు భయం వేస్తున్నది!" మేరీ అన్నది గువ్వలాగ ముడుచుకుపోయి.

"భయపడటానికి కూడా టైమ్‌లేదు, నడు ముందు!" కిరణ్ కుమార్ అడుగులు వేశాడు ముందుకు. ఆమెగూడ అతన్ని అనుసరించక తప్పలేదు.

ఇద్దరూ ఆడిటోరియంలోని కుర్చీల దగ్గరకు వెళ్ళి చూశారు. మామూలుగా స్కూలుపిల్లలు కొందరు కూర్చుని ఉన్నారు అక్కడ. ప్యావోగాని మేరీతమ్ముడుగాని లేరు అక్కడ.

"ఏరి వాళ్ళు?" కిరణ్ కుమార్ అడిగాడు.

"ఇందాక వాళ్ళు ఇక్కడ కూర్చుని ఉండడంగానే చూశాను. ఏరీ?" మేరీ ఆశ్చర్యంగా చూసింది.

కిరణ్ కుమార్ ఆ ప్రక్కనవున్న బాలుడ్ని అడిగాడు మేరీ తమ్ముడి గురించి. అతగాడు యింతకుముందే హాస్టల్లో తన గదికి వెళ్ళినట్టుగా చెప్పాడు.

ఇద్దరూ హాస్టల్ వేపు పరుగుతీశారు.

"అతడితోబాటు ప్యావో గూడ ఉంటాడేమో!" మేరీ భయంగా అంది.

"ఉంటే ఉండని. అతడి కోసమేగదా నేనూ వచ్చింది!"

ఆ వింగ్ లో చివరగావుంది అతడి రూమ్. గదిదగ్గరకు వెళ్ళి "షాంగ్" అని నెమ్మదిగా పిలిచింది మేరీ.

తలుపు తెరుచుకుంది. "అక్కా! నిజంగా నీవే వచ్చింది!" అన్నాడు షాంగ్.

కిరణ్ కుమార్ అతడ్ని తోసుకుని లోపలకు వెళ్ళాడు. అతడి వెనకే మేరీగూడ లోపలకు వచ్చింది.

"త్వరగా నీకోటు తొడుక్కో! మనం ఇక్కడనుంచి వెళ్ళిపోతున్నాం!" అన్నాడు కిరణ్ కుమార్, షాంగ్ ని ఉద్దేశించి.

అంతలోనే ప్యావో అనుచరులువచ్చి ముగ్గురినీ చుట్టు ముట్టారు.

స్కూలు వెనుక వేపు గ్రౌండ్లోంచి బయటకు వచ్చారు అందరూ. గేటు ప్రక్కగా రెండు మిలిటరీ ట్రక్కులు ఒక కొత్తకారు ఉన్నాయ్. ఆకారు అద్దాలు బుల్లెట్ ప్రూఫ్ అని గ్రహించాడు కిరణ్ కుమార్.

ప్యావో చకచక ఆర్డర్లు జారీచేశాడు.

"కిరణ్ కుమార్, మేరీ, ఆమె తమ్ముడ్ని వెనుక సీట్లో కూర్చోబెట్టండి. 'లూ!' నీవుగూడ పిస్టల్ గురిపెట్టుకుని వాళ్ళప్రక్కనే కూర్చో. డ్రైవర్! రెడీ!" అన్నాడు అతడు ముందుసీట్లో చేరగిలబడుతూ.

స్టీరింగ్ వీల్ ముందు కూర్చున్న వ్యక్తికి పిస్టల్ తీసి ప్యావో గుండెలకు గురిపెట్టాల్సి ఉంది కిరణ్ కుమార్

లెక్క ప్రకారం.

"అలాగే సార్!" అంటూ డ్రైవర్ కారు స్టార్టు చేశాడు. వ్యూ ఫైండర్‌లో అతడి ముఖాన్ని పరీక్షగా చూశాడు కిరణ్ కుమార్. అతడు వాంగ్ ఛూ కాదు. తన ఆట ఇంతటితో కట్టు అనుకున్నాడు. అతడి కళ్ళలో అరుణ, వినయాసక్సేనా మెదిలారు.

# 9

కారు ఏదో కాలవమీద బ్రిడ్జి యెక్కింది. ఆ వంతెన కొయ్యది. కారు వంతెన సగంలో ఉండగా పెద్దగా ప్రేలుడు వినిపించింది. వంతెన కూలిపోయింది. అయితే కారు వంతెన చివరకు వచ్చేసింది.

డ్రైవర్ చేతిలో స్టీరింగ్ వీల్ అటూ ఇటూ తిరిగిపోయి కారు కుదుపులతో అటూ ఇటూ ఊగిపోయింది. రోడ్డు మీదనుంచి పల్లంలోకి దిగిపోయి గుట్టకు కొట్టుకుని ఆగిపోయింది.

ఈ అవకాశాన్ని కిరణ్ కుమార్ బాగా ఉపయోగించుకున్నాడు. 'లూ' కుదుపులతో కారులో తల్లడిల్లుతుంటే అతడి చేతిలోని పిస్టల్‌ని లాగేసుకున్నాడు. ఒక్క షాట్‌తో అతడు కారుడోర్ తెరుచుకొని నేలమీద వెల్లకిల పడిపోయాడు.

మరో బుల్లెట్ డ్రైవర్ తలలో దూరింది. ప్యావో సీటుకు కొట్టుకుని సగం కారులో సగం బయటకూ ఊగులాడుతున్నాడు.

ఈ తికమకలో షాంగ్ కారులోంచి బయటకు దూకి పారిపోబోయాడు. కిరణ్ కుమార్ తన కాలుజాపి అతడి కాళ్ళకు బ్రేక్ వేశాడు. అతడు బోర్లా పడిపోయాడు.

కిరణ్ కుమార్ భుజంమీద చేయి పడింది. విసురుగా అటు చూశాడు. అతడు యెవరో కాదు; వాంగ్-ఛూ!

"డ్రైవర్ సీట్లో నేను లేకపోవటంతో కొంత గాభరా పడి ఉంటావు కదూ?" అనడిగాడు నవ్వుతూ. అతడి ప్రక్కన ఇద్దరు ముగ్గురు కొత్తముఖాలు కనుపించినయ్.

"ఎవరూ వీళ్ళంతా!" అని అడిగాడు కిరణ్ కుమార్.

"వీళ్ళు నా స్నేహితులే! లోగడ ఒకసారి నేను వీళ్ళకు చాల సాయం చేశాను. మార్కెట్ లో నన్ను వదలి నీవు వెళ్ళంగానే వీళ్ళు కనుపించారు. నా ప్లాన్ గురించి చెబితే, 'ఆ డ్రైవర్ని లోబరుచుకునే ప్రయత్నం కొరివితో తల గోక్కోవటమే. దానికన్న వంతెన ప్రేల్చేయడం తేలిక' అని వాళ్ళే సలహా చెప్పారు. పైగా ప్యావో ఆ దారివెంట తప్పకుండా వెళ్తాడని నమ్మించారు. అందుకే హడావిడిగా వంతెనను చేరుకుని మనతో తెచ్చిన డైనమైట్లను ఉపయోగించాను" వాంగ్ ఛూ సంతోషంగా జరిగినదంతా వివరించాడు.

వాంగ్ ఛూ స్నేహితులు వెళ్ళిపోయారు. కిరణ్ కుమార్ ప్యావోని లాక్కురమ్మన్నట్టు సైగ చేశాడు.

"ఆ ఫుండాకోర్ చచ్చాడా?" వాంగ్ ఛూ అడిగాడు.

"వాడు చావకూడదు! వాడివల్ల మనకి ఇంకా పని జరగాలి. వాడ్ని వెంటబెట్టుకుని మిలిటరీ క్యాంప్ జైల్లో ఉంచబడిన అరుణను విడిపించాలి."

"ఈ ప్రమాదంనుంచి తప్పించుకుని మరోదాంట్లో తల దూరుస్తున్నామేమో!"

"దీనికన్నా గూడ ఆపని అతిముఖ్యమయింది. తప్పదు మరి?" అన్నాడు కిరణ్ కుమార్.

పది నిముషాలు గడిచినయ్. ప్యావోని లాక్కెళ్ళి పొదలచాటుకు తీసుకెళ్ళారు. అతడికి తెలివివచ్చి, వాంతి చేసుకున్నాడు.

ప్రేల్చి వేయబడిన వంతెనకు అరమైలు దూరంలో

ఉన్నారు. త్వరలోనే ప్రేలుడు విషయం అందరికీ తెలిసి పోతుంది. అటుజనం ఇటు సైనికులూ వచ్చి తమని చుట్టు ముట్టకముందే వెళ్ళిపోవాలి.

హాంగ్ కాళ్లూ చేతులూ బంధించి చెట్టుక్రింద కూర్చో బెట్టారు. మేరీ అతడి ప్రక్కనే ఉంది.

ప్యావోని ఎంతో అడిగినా బదులు చెప్పటంలేదు.

"వాడిచేత నేను మాట్లాడిస్తాను.అపని నాకొదిలెయ్!" అంటూ వాంగ్ ఛూ ముందుకు వచ్చాడు.

ప్యావో దవడలు మారుమ్రోగిపోయేలా కొట్టాడు వాంగ్ ఛూ. ప్యావో నోటంట రక్తం వచ్చింది.

"వీడ్ని చంపేసి మన దోవన మనం పోదాం పద!" అన్నాడు వాంగ్ ఛూ.

ఆమాట వింటూనే ప్యావో చేతులెత్తి దణ్ణంపెట్టాడు. "నాకు అసలే గుండెపోటు. నన్ను అతిగా బాధించకండి. అరుణను మిలిటరీ క్యాంప్ జైల్లో ఉంచాను."

"అయితే పద పోదాం! ఆమెను నేను విడిపించుకు వెళ్ళాలి" కిరణ్ కుమార్ అన్నాడు.

"పులిబోనులో ప్రవేసించిన తర్వాత ఆమెతోగూడ నీవు అక్కడినుంచి తప్పించుకు పోదామనే నీ ఊహ?" ప్యావో కసిగా అన్నాడు.

"నేను అక్కడ్నుంచి బయట పడలేకపోతే నీవు ప్రాణాలతో ఉండవు."

ప్యావో ఒక్క నిముషం ఆలోచించాడు. "సరే పద! పోదాం!"

మేరీ, ఆమె తమ్ముడూ అక్కడే కూర్చున్నారు. వాంగ్ ఛూ వాళ్ళకు కాపలాగా ఉండిపోయాడు.

ప్యావో నీలంరంగు కారులో ప్యావో, కిరణ్ కుమార్లు బయలుదేరారు. ప్యావో కారు నడుపుతున్నాడు. అతడి

ప్రక్కనే అతడి వెన్నులో పిస్తోల్ని గుచ్చిపెట్టి కూర్చు న్నాడు కిరణ్ కుమార్.

"లోపలకు పోయాక పిచ్చివేషాలు వెయ్యకు. ఏదైనా పొరబాటు జరిగిందో నీవు ప్రాణాలతో ఉండవు. ఆతరు వాత నేనేమైనా నాకు చింతలేదు. మనం నేరుగా అరుణ ఉన్న చోటుకి వెళ్ళాలి. యెవరన్నా నిన్ను ప్రశ్నించినా సరే నీవు ఎక్కువగా మాట్లాడకూడదు. నీ అధికారాన్ని ఉపయోగించి అరుణను, నన్నూ ఇదే కారులో మళ్ళీ బయ టకు తీసుకురావాలి. తెలిసిందా?" కిరణ్ కుమార్ ప్యావో నుద్దేశించి అన్నాడు.

"నీకు చైనీస్ భాష బాగా వచ్చునే! నీవు చెప్పిన పథకం బాగానే ఉంది. నేను మొండి ఘటాన్ని. నా ప్రాణాలు అంత తేలికగా పోనిస్తానా? నిన్నూ అరుణను ఎక్కడ వదలమంటే అక్కడే వదిలేస్తాను. కాని ఆ తరు వాత నీవు తప్పించుకోగలవా? పైగా విజయ్ సక్సేనాని నాకంటె ముందు నీవు కనుక్కోలేవు!" ప్యావో గర్వంగా అన్నాడు.

"చూద్దాంగా!"

"ఏమిటి చూసేది! నీవు సక్సేనాని వెదికి రక్షించటా నికి పంపబడ్డావు. కాని ఇలా మేరీ తమ్ముడ్ని, అరుణనీ రక్షించే ప్రయత్నంలో సక్సేనాని బయట పడేయలేక పోతే, లేదా ఈ విషయం మీ అధికారులకి తెలిస్తే నీపని ఏమవుతుందో తెలుసా?"

"వాళ్ళకే విషయం ఎలా తెలుస్తుంది? అదిగో మిలిటరీ క్యాంప్ గేటు దగ్గరకు వస్తున్నాం; జాగ్రత్త!" అని కిరణ్ కుమార్ హెచ్చరిక చేశాడు.

# 10

నిజానికది మిలిటరీ క్యాంప్ కాదు. రాజకీయ ఖైదీలను మావో వ్యతిరేకుల్ని ఉంచటానికి ఉద్దేశింపబడిన లేబర్ క్యాంప్ అది. చుట్టూ పదడుగుల ఎత్తున ముళ్ళ తీగలతో (బార్బర్డ్ వైర్) ఫెన్సింగ్ ఉంది.

ప్యావో కారుని గేట్లో వాళ్ళు గుర్తించినట్టున్నారు, గేటుని తెరిచారు. కారు గేటుని దాటేటప్పుడు సెంట్రీ సెల్యూట్ చేశాడు. కారు లోపలకు వెళ్ళంగానే గేటు మూసివేయబడింది.

కారు చిన్న బిల్డింగ్ ముందు ఆగింది. "దిగు! జాగ్రత్త!" అని మరోసారి హెచ్చరించాడు కిరణ్ కుమార్.

ప్యావోని తనకు దగ్గరగా ఉంచుకునే నడిచాడు అతడు. అతడు తన ఓటమికి విచారిస్తున్నట్టున్నాడు, మనిషి డీలాపడిపోయాడు.

ప్యావోని చూస్తూనే కుర్చీలో టేబుల్ ముందు కూర్చున్న యూనిఫారమ్‌లోని వ్యక్తి లేచి నిలబడి సెల్యూట్ చేశాడు.

"ఆ ఇండియా స్త్రీని నాతో తీసుకు వెడుతున్నాను" అన్నాడు ప్యావో.

"రేపు ఇన్స్పెక్టర్ జనరల్ ఆమెతో స్వయంగా మాట్లాడడానికి నిర్ణయించబడింది సార్!"

"ప్రోగ్రామ్ మారింది. ఆమెను రప్పించు!" కర్కశంగా అన్నాడు ప్యావో.

అతడి ప్రక్కనే ఆనుకొని నిలబడి ఉన్న కిరణ్ కుమార్‌ని యెవరూ పట్టించుకోలేదు.

మరో సిపాయి ఆమెను తీసుకురావటానికి లోనికి వెళ్లాడు. ఆ ప్రదేశమంతా నేరస్తుల ఏడ్పులతో నిండి ఉంది. రక్తం, హింస, చావులు అన్నీ ఇక్కడ విలయ

తాండవం చేస్తున్నవా అన్నట్టుగా ఉంది.

అరుణ రావటం ఆలస్యమయేకొద్దీ కిరణ్ కుమార్ ప్యావోని అనుమానించసాగాడు. లోపలి కెళ్ళిన సిపాయి తనను బంధించే ఏర్పాట్లు చేస్తున్నాడా?

సిపాయి తిరిగివచ్చాడు. అతడి వెనకనే అరుణ నడిచి వస్తోంది.

మరో కొత్త బెడద వచ్చిపడింది కిరణ్ కుమార్ కి. అరుణ వస్తూనే తనను గుర్తించి పెద్దగా అరిచిందంటే తన గుట్టు బయటపడిపోతుంది. ప్యావోను తను బలవంతం చేసి అరుణను విడిపిస్తున్నానని అందరకూ అర్థం అయిపోతుంది.

అయితే అరుణ తల ఎత్తకుండా అలాగే నిలబడిపోయింది జైలు వార్డెన్ ముందు.

"ఈమె అన్నం నీళ్ళు ముట్టలేదు నిన్నటినుంచి. అప్పటికే ఒకసారి ఆమెకు బలవంతంగా ఆహారం ఎక్కించాం" అన్నాడు వార్డెన్.

"చాలు! ఇక ఆపు! మిగతా విషయాలు నేను చూసుకుంటాను. మిస్ అరుణా! నేనూ నా అసిస్టెంటూ నిన్ను హాంకాంగ్ లో భద్రంగా దిగవిడుస్తాం. తెలిసిందా?" ప్యావో ప్రతిమాటనీ నొక్కి పెడుతూ పలికాడు.

అరుణ తల ఎత్తి చూసింది. ఎదురుగా కిరణ్ కుమార్ కనుపించాడు ప్యావో ప్రక్కనే. ఆమె ముఖం ఆశ్చర్యంతో తెల్లబడింది. ఆమె ఏవిధమైన ఉద్వేగాన్నీ కనబరచలేదు. అక్కడున్నవారంతా ఆమె ప్యావో వంక భయంగా చూస్తున్నదనే అనుకున్నారు. ఆమె పెదవులు వణికినయ్. కిరణ్ కుమార్ కళ్ళతోనే ఆమెకు సైగ చేశాడు. తనను గుర్తించినట్టు కనబర్చవద్దనీ, జీవితంపై తిరిగి ఆశనూ, స్వేచ్ఛకు బంగారుబాటనీ సూచించాయి అతడి కళ్ళు.

ఆమె నింపాదిగా ఉంది. "మీతో రావటానికి నేను రెడీగా ఉన్నాను."

"రైట్! గుడ్ గర్ల్" అంటూ ప్యావో చిరునవ్వుతో వెనుదిరిగాడు.

ముగ్గురూ వచ్చి కారులో కూర్చున్నారు. ప్యావో ముఖంలో మళ్ళీ కొత్త వెలుగు వస్తోంది. వీళ్ళను ఊరిబయట వదిలేస్తాడు తను. వాళ్ళు తనకు దూరంకాగానే, తన ప్రాణానికి ముప్పు తొలగగానే హెడ్ క్వార్టర్స్‌కి చేరుకుని మిలిటరీని సిద్ధంచేస్తాడు. సైనికులూ, నావికాదళం, ఎయిర్ ఫోర్సు అన్నీ యాక్షన్‌లోకి వెళతాయ్. ఇక కిరణ్ అతడి అనుచరులూ యెలా తప్పించుకోగలరో చూస్తాను అని తనలో తనే నవ్వుకుంటున్నాడు.

ఈ దఫాకూడా ప్యావో స్టీరింగ్ ముందు కూర్చున్నాడు. కారు గేటుదగ్గరకు వచ్చింది. సెంట్రీ గేటుని బార్లా తెరిచాడు. కారు ఆపాడు ప్యావో. కిరణ్ కుమార్ ఉద్వేగంతో, ప్యావో ఏదో కొత్త పన్నాగం పన్నుతున్నాడని భయపడ్డాడు. అయితే ప్యావో సిగరెట్ వెలిగించుకున్నాడు. మళ్ళీ కారుని స్టార్ట్ చేశాడు.

కారు మిలిటరీ క్యాంప్ నుంచి మైలుదూరం పోయిన తర్వాత క్యాంప్‌లో సైరన్ మ్రోగింది.

ప్యావో వెలిగించిన సిగరెట్ రహస్య సంకేతమా? ఆ సైరన్ కారులో పోతున్న కిరణ్ కుమార్ చెవులకి స్పష్టముగా వినబడుతోంది.

పిస్తోల్‌ని అతడి డొక్కలోకి గుచ్చి "త్వరగాపోనీయ్ లేదా నీకు చావు మూడింది" అన్నాడు కిరణ్ కుమార్.

"నాకూ ఆశ్చర్యంగా ఉంది. ఎలా జరిగిందబ్బా ఇలా!" అని విస్తుపోయాడు ప్యావో.

"నీ నక్క వినయాలు నా దగ్గరకాదు. ఏమైనా ఆపద

సంభవిస్తే మనముగ్గురం చనిపోతాం!"

"నిజంగానా? ఎంతకు తెగించావ్!" ప్యావో యాక్సిలేటర్‌ని తొక్కాడు. నిర్మానుష్యంగా ఉన్న రోడ్డుమీద కారు అతివేగంగా పరుగిడుతోంది.

అరగంట ప్రయాణం చేశాక 'యు' టర్నింగ్‌లో ప్యాసెంజర్ బస్సు యెదురయింది. ప్యావో కారుని స్లో చేయబోయాడు కాని కిరణ్‌కుమార్ అడ్డుచెప్పాడు. కారు అడ్డుగా ఉంది. ప్యావో భయంతో నోరు తెరిచాడు. బహుశా అతడు డ్రైవింగ్‌లో నేర్పరి కాడేమో అనుకున్నాడు కిరణ్‌కుమార్.

కారు ప్రక్కగా దూసుకుపోతూ బస్సుని తప్పుకోవడంలో సగం కారు రోడ్డు క్రిందకు దిగి రాళ్ళగుట్టలమీద ఎక్కింది. కిరణ్‌కుమార్ తన రెండోచేత్తో స్టీరింగ్ వీల్‌ని పట్టుకుని కంట్రోల్ చేయకపోతే కారు తలక్రిందులయేదే!

ప్యావో స్పృహ తప్పిపోతున్నవాడిలా డోర్ మీదకు ఒరిగిపోయాడు.

"అతడు పడిపోయాడు. హార్ట్‌ఎటాక్ వచ్చిందేమో!" అరుణ అంది.

అతడ్ని ప్రక్కకు నెట్టి స్టీరింగ్ పుచ్చుకుని యాక్సిలేటర్ మీద కాలు వేశాడు కిరణ్‌కుమార్.

బస్సులోనుంచి కోపంగా అరుస్తున్న కేకలు లీలగా వినబడుతున్నయ్. బహుశా తన రాష్ డ్రయివింగ్ గురించే అయివుంటుందనుకున్నాడు కిరణ్‌కుమార్.

కారు నాలుగైదు మైళ్ళు ప్రయాణించింది.

"అరుణా! నీకు డ్రయివింగ్ వచ్చుకదూ?" కిరణ్‌కుమార్ అరుణని అడిగాడు.

"వచ్చు! ఏం?"

కారు ఆపాడు. డోర్ తెరచి 'కోమా'లో వున్న ప్యావోని క్రిందికి లాగి చెట్లనీడలో పరుండబెట్టాడు.

కారు రివర్స్ చేశాడు. "ఇక పోనీయ్!" అన్నాడు కిరణ్ కుమార్ వెనుక సీట్ లో పడుకుంటూ.

"బాబోయ్! మళ్ళీ వెనక్కా?" అంది అరుణ.

"నీకేం భయంలేదు. నేనున్నాను. పోనీయ్!" అన్నాడు.

అరుణ కారు వేగాన్ని హెచ్చించింది.

ఇంతకుముందు తాము డాష్ ఇవ్వబోయిన బస్ అక్కడే ఉంది. దాని ప్రక్కన మిలిటరీ ట్రక్కు వుంది. చిన్న గుంపు వాళ్ళచుట్టూ చేరారు.

అరుణ తలకు నాప్ కిన్ కట్టుకుని వున్నది. కళ్ళకు గాగుల్స్ పెట్టుకుంది. ఆమెని చూస్తే ఇంతకుముందే జైలునించి విడుదలయిన స్త్రీ అని ఎవరూ ఊహించలేరు. ఏవిధమైన తొట్రుపాటు లేకుండా కారుని జనంప్రక్కగా పోనిచ్చింది.

జనంలో ఎవరూ ఆ కారుగురించి పట్టించుకోలేదు! ఎందుకంటే ఆకారు ఆగంతకులు పారిపోయిన దిక్కు నుంచే వస్తున్నందున.

"నీ ప్లాన్ అమోఘంగా పనిచేసింది. ఇక ఎటు వెళ్ళాలి. ఎడమవైపు రోడ్డు మిలిటరీ క్యాంప్ కి దారితీస్తుంది."

"అయితే కుడివైపుగా పోనీయ్."

కారు ఏ ఆటంకమూ లేకుండా వూరు దాటింది. అరుణ అన్నది మళ్లీ, "కిరణ్! కారు నీవు నడుపుదూ! తిండిలేక నాకు నీరసంగావుంది. నిద్రలేమిచే కళ్ళముందు మచ్చలు ఏర్పడుతున్నయ్."

"అలాగే!" అంటూ డ్రైవింగ్ సీట్లోకి మారాడు కిరణ్ కుమార్.

అతడి భుజంపై తన తలవాల్చి కూర్చుంది అరుణ.

"మరీ నీరసంగావుందా అరూ?"

"లేదులే! కాని నేను కలగంటున్నానేమో అని భ్రమ కలుగుతోంది. నా జీవితం ఆ కిరాతకుల చేతిలో అంతమయిందనే అనుకున్నాను. నాకోసం నీ ప్రాణాలకు తెగించి వస్తావని అనుకోలేదు కరణ్!"

"నీవు నా ప్రాణానికన్న అధికమైన విలువ కలదానివి. అందుకే నీకోసం రాక తప్పలేదు."

"ఇక భయంలేదు!" అంది అరుణ.

"అప్పుడే సుఖాంతం చెయ్యకు. మనముందు అతి ప్రమాదభరితమయిన క్షణాలు కాచుకుని ఉన్నాయ్!"

"నీ ప్రక్కన ఉంటే ఎన్ని ప్రమాదాలయినా ఇట్టే దాటేయగలను. నీవు యింతటి సాహసవంతుడివని అనుకోలేదు!" అరుణ ప్రేమగా అంది.

# 11

కర్నల్ ప్యావో కళ్లు తెరిచాడు. ఎదురుగా డాక్టర్లూ నర్సులూ, ఆక్సిజన్ సిలెండర్ కనబడ్డాయ్యి.

"సార్జెంట్ ఎక్కడ?" అని అరిచాడు ప్యావో.

"కర్నల్ సార్! మీరు గుండెపోటునుంచి కోలుకున్నారు. మీరు పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి!" అని వారించాడు డాక్టర్.

"విశ్రాంతి! వాళ్ళను ప్రాణాలతో పట్టుకునేదాకా నాకు విశ్రాంతిలేదు."

సార్జంట్ వచ్చి అతడిముందు నిలిచాడు.

"బ్రిడ్జిని ప్రేల్చింది ఎవరో కనుక్కుని పట్టుకురా! వాళ్ళను నా కళ్ళెదుటే చిత్రాతిచిత్రంగా హింసించాలి!" అన్నాడు ప్యావో.

"వాళ్ళు ఎక్కడో దాక్కుని ఉంటారు సార్! క్షణాల మీద ఎలా దొరుకుతారు?" సార్జెంట్ వినయంగా అన్నాడు.

"వెళ్ళి వెతుకు! ఎలాగైనా వాళ్ళను దొరకపుచ్చుకుని రా!" గర్జించాడు ప్యావో.

ఒక గంట గడిచాక పదహారేళ్ళ యువకుడ్ని తెచ్చారు సైనికులు. అతడి నోటంట రక్తం వస్తోంది. ముందు పళ్ళు రెండు ఊడిపోయాయి. ఒక కన్ను వాచి మూసుకు పోయింది.

"ఒరేయ్! నీనుంచి రెండే రెండు ముక్కలు వినాలి మేం! ఆ వంతెనను కూల్చివేయమన్న దెవరు?"

ఆ కుర్రవాడు ప్యావోవంక చూసి నేలమీద తుపుక్కున ఉమ్మేశాడు.

"సార్జెంట్! వీడ్ని ఆ ఆపరేషన్ టేబుల్ మీద పడేసి కత్తికోకండా పీకండి!"

నలుగురు బలిష్ఠమైన సైనికులు అతడ్ని కాళ్ళూ చేతులూ పట్టుకుని టేబుల్ మీద పడుకోబెట్టి బలంగా అదిమి పట్టుకున్నారు.

మరో సైనికుడు సర్జికల్ బ్లేడ్ను తెచ్చి టేబుల్ దగ్గరగా ఉంచాడు.

ఒక కత్తితీసి సార్జెంట్ అతడి పొట్టమీద ఆనించాడు, చొక్కా తొలగించి.

"బాబోయ్! చెబుతాను!" అని అరిచాడు యువకుడు.

"చెప్పు మరి!"

"అతడి దే ఊరో నాకూ తెలీదు. 'సీ డ్రాగన్' అనే స్టీమర్లో అతడు పైలట్!"

"వాడి పేరు?"

"వాంగ్-ఛూ!"

"సరే! వీడ్ని లాకప్‌లో ఉంచండి. సాక్ష్యానికి పనికి వస్తాడు" అన్నాడు ప్యావో.

## 12

"నీ కుటుంబ పూర్వచరిత్ర చదివాను. నీ అన్న దేశానికి ద్రోహం తలపెట్టి కాల్చివేయబడ్డాడు. మీరూ అతడి అడుగుజాడల్లోనే నడవాలని చూస్తున్నారు. మిమ్మల్ని బ్రతికి ఉండనిచ్చినందుకు యిదేనా మీరు దేశానికి చేసే గౌరవం!" ప్యావో అరుస్తున్నాడు.

ప్యావో యింత త్వరగా తన ఆటకట్టిస్తాడనుకోలేదు. ఆ ఎగుచేతల వాంగ్ ఛూ ఎక్కడ తారాడుతున్నాడో. అంతా మించిపోయాక వచ్చి వీళ్ళ చక్రబంధంలో పట్టుబడిపోయి, అన్నలాగే కాల్చి చంపబడటానికి వస్తాడు కాబోలు అనుకుంది లీన్‌ష్యూ.

"మాట్లాడవేం?" ప్యావో గద్దించాడు.

"నేను చెప్ప గలిగింది ఏమీ లేదు" తలవంచుకుని చెప్పింది లీన్‌ష్యూ.

"ఇన్‌స్పెక్టర్! జరిగినదంతా ఈమె నోటివెంట నేను వినాలి. ఈమెచేత పలికించు!" ప్యావో ఛూంగ్‌లీ వైపు తిరిగి అన్నాడు.

"సార్! ఈమె నాకు మొదటినుంచీ బాగా తెలుసు" అతడిమాట పూర్తికాకుండానే ప్యావో అరిచాడు.

"అందుకే నీవు ఆమెమీద చెయ్యి వేయటానికి వెనుకాడుతున్నావనీ తెలుసు! ఆ పని నీవు చేస్తావా, మరొకర్ని పిలవనా?"

ఇన్‌స్పెక్టర్ ఛూంగ్‌లీ తమాయించుకోలేకపోయాడు. లీన్‌ష్యూ చేసిన తప్పిదానికి తాను సంజాయిషీ చెప్పుకుని దోషిలా నిలబడవలసి వచ్చింది. అతడిలో రాక్షసత్వం పెల్లుబికింది.

"లీన్ మాట్లాడు!" అని అరిచాడు.

ప్యావో ముఖాన చిరునవ్వు వెలిసింది.

ఛుంగ్ లీ తన నడుముకున్న బెల్టు విప్పాడు. బెల్టు ఆమె శరీరంపై ఛడేల్ ఛడేల్ మని విలయతాండవం చేసింది.

"ఊ! ఇంకా! ఇంకా!" ప్యావో అరుస్తున్నాడు.

లీన్ షూ కుర్చీలోంచి క్రిందపడిపోయింది. ఆమె శరీరం నుంచి రక్తం కారుతోంది. ఒంటిమీద వాతలు తేలినయ్.

ఇన్ స్పెక్టర్ ఛుంగ్ లీ అలిసిపోయాడు ఆమెను కొట్టీ, హింసించీ. కాని ఆమెనుంచి ఒక్క మాట గూడ రాలేదు.

ప్యావో అక్కడే కుర్చీ వేసుకుని కూర్చున్నాడు.

"సార్! ఏదైనా డ్రింక్ తెస్తాను!" అన్నాడు ఛుంగ్ లీ, కాస్సేపన్నా విశ్రాంతి చిక్కుతుందని.

"త్వరగా రా! ఈ లోపల నీ ప్రియురాలుగూడ కొంచెం తేరుకుంటుంది" అన్నాడు ప్యావో ఓ విషపు నవ్వు నవ్వుతూ.

వెనుక గుమ్మంనుంచి వెలుపలికి వచ్చాడు ఇన్ స్పెక్టర్. ఆలోచిస్తూ బయటకు అడుగువేసిన అతడి కంఠంచుట్టూ ఎవరిదో చేయి బిగుసుకుంది. రెండో చేతిలోకి తళతళలాడే కత్తి అతడి కళ్ళముందే కంఠానికి అనుకుంది. గొంతుకి గుచ్చుకుని కొద్దిగా చర్మం పైకిలేచింది.

"కత్తి ఇంకా లోతుగా దిగకుండా ఉండాలంటే మేం అడిగింది వెంటనే చెప్పు! లీన్ షూ ఎక్కడ?" వాంగ్-ఛూ అడిగాడు నెమ్మదిగా.

"ప్యావో ఎక్కడ?" మరో కంఠంగూడ వినిపించింది.

పోలీస్ స్టేషన్ ప్రక్కగా బ్రిడ్జి ఉంది. ఇన్ స్పెక్టర్ని దాని క్రిందకు లాక్కెళ్ళారు.

"వాళ్ళిద్దరూ స్టేషన్లోనే ఉన్నారు" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"ఆమెను చిత్రహింసలు పెడుతున్నావ్ కదూ?"

అప్పటికిగాని అతడి ముఖం చూడలేదు ఇన్ స్పెక్టర్.

"వాంగ్-ఛూ! ఎలా వచ్చావ్!"

"అడిగిందానికి సమాధానం చెప్పి ఏడువ్!"

"నేనేం చేయను. నా కివ్వబడ్డ ఆదేశం అలా ఉంది."

"పాపం! నువ్వు అమాయకుడివి. 'నాజీ'ల కన్న ఘోరంగా మీరు హింసిస్తారు, దారుణంగా చంపుతారు, దుర్మార్గులు!"

"లేదు! ఆమెకు సాయం చేయాలనే ఉంది. కానీ?"

"లోపల ఎంతమంది ఉన్నారు?"

"ఆరుగురు! పదండి! నేను మీతో సహకరిస్తాను!" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"ఏం? చావంటే భయపడి ఈ పని చేస్తున్నావా?"

ఇన్ స్పెక్టర్ను అక్కడే ఉంచాడు కిరణ్ కుమార్. అతడి వెన్నులో పిస్టల్ ఆనుకుని ఉంది.

వాంగ్-ఛూ లోపలకు వెళ్ళాడు పిల్లిలా. అతడి చేతిలో సైలెన్సర్ ఉంది.

ప్యావో కుర్చీలో కూర్చుని విలాసంగా సిగరెట్ త్రాగుతున్నాడు.

సైలెన్సర్ టిక్ మంది. ప్యావో నేలవాలాడు చడీ చప్పుడు లేకుండా.

మిగతా ఆరుగురు పోలీసుల్నీ సఫా చేశాడు వాంగ్-ఛూ. తన అన్నను కాల్చి చంపిన పోలీసులంటే అతడికి చెప్పలేనంత కోపం. ఆ పగ ఇప్పటికి తీర్చుకున్నాను అనుకున్నాడు.

వాంగ్-ఛూ తన చెల్లెల్ని సమీపించాడు.

"వచ్చావా? నిజంగా నువ్వేనా?"

"పరిస్థితి చేయి దాటిపోయాక వచ్చానా?"

"లేదు. ఇంకా అదుపు తప్పలేదు. కాని మన ఇంటి చుట్టూ పోలీసు కాపలా ఉంది."

"ఫరవాలేదు పద!" అంటూ ఆమెకు చేయూత నిచ్చాడు వాంగ్-ఛూ. ఆమె అతడి భుజంపై తలవాల్చి, కన్నీరు కార్చింది.

"ఈ ఇన్‌స్పెక్టర్ని గూడ పీడా వదిలించుకుంటే పోలా!" కిరణ్‌కుమార్ అన్నాడు.

"వద్దు! మా ఇంటిచుట్టూ కాపలా ఉంది. ఇతడు మనతో ఉండటం ఎంతైనా అవసరం!"

"అయితే కదలండి త్వరగా!"

కారులో కూర్చున్నారు అందరూ. కారు కదిలింది.

"లైట్లు ఆర్పెయ్!" అన్నాడు వాంగ్-ఛూ.

"దోవ కనిపించదే! ఎలా?" అన్నాడు కిరణ్‌కుమార్.

"నేను కాషన్ ఇస్తాను!"

లైట్లు ఆర్పేశాడు. వాంగ్-ఛూ చీకట్లోకి చూస్తూ దోవ చెబుతున్నాడు.

ఎత్తుగా గుట్టచాటునుంచి ఎవరో గార్డు అరిచాడు "ఎవరా వచ్చేది?" అని.

వాంగ్ ఛూ ఇన్‌స్పెక్టర్ ఛుంగ్‌లీని డొక్కలో పొడిచాడు.

"నేనేలే! ఇన్‌స్పెక్టర్‌ని. చెక్ చేయటానికి పోతు న్నాను. నీ 'పోస్ట్'లోనే జాగ్రత్తగా ఉండు" ఇన్‌స్పెక్టర్ తిరిగి అరిచాడు.

గార్డు వెనక్కి వెళ్ళిపోయాడు.

వాంగ్ ఛూ కారు దిగి అందరికీ మెషీన్ గన్నని పంచి పెట్టాడు, మేరీ, అరుణ, లీన్‌ఫూలకు.

వాంగ్ ఛూ ఇంట్లోకి పరుగెత్తాడు.

వాకిట్లోనే వినయ్ సక్సేనా ఎదురయ్యాడు. అతడిచేతిలో

మూట ఉంది. అతడ్ని కారులో సర్దాడు కిరణ్ కుమార్.

"మీరు ఎలా తప్పించుకోగలరు?" ఛుంగ్ లీ అడిగాడు.

"ఎలాగోలాగు సముద్రం దాకా చేరితే అక్కడ్నుంచి ఏదో ఒక స్టీమర్లో ఎక్కి తప్పించుకుంటాం" వాంగ్ ఛూ సమాధానం చెప్పాడు.

"అక్కర్లేదు. ఈ దగ్గర్లోనే ఎయిర్డ్రోమ్లో ప్యావో ఎక్కి వచ్చిన మిలిటరీ ప్లేన్ ఉంది. మిమ్మల్ని అందులో ఎక్కించగలను! నన్ను నమ్మండి!"

"నీవు మాకు శత్రువువి గదా! మాకు సహాయం చేస్తున్నావేమిటి?" వాంగ్ ఛూ ఆశ్చర్యంగా అడిగాడు.

"కాని లీన్ షూకు నేను చేసిన అమానుషకృత్యానికి ఇది ప్రాయశ్చిత్తం! అంతే!" అంటూ తన అనుచరులకు విజిల్ వేశాడు ఇన్స్పెక్టర్. వాళ్ళంతా ఇంటిలోకి రాగానే పోలీసుల్ని అందర్నీ మెషీన్ గన్తో కాల్చేశాడు వాంగ్ ఛూ.

లీన్ షూ తల్లి కూడ ఉన్నారు తనతో. తండ్రి క్రితం రోజే లీన్ షూని అరెస్ట్ చేశారని తెలియగానే గుండె పోటుతో మరణించాడు.

"నా భర్త, నా కొడుకు ఇక్కడే చనిపోయారు! నా ప్రాణంకూడ ఇక్కడే పోవాలి. నేను రాను!" అంది ఆమె.

"వాళ్ళు నిన్ను బ్రతకనిస్తారా? నానాహింసలు పెడతారు!"

"నన్ను నేను రక్షించుకోగలను! నా కేదన్నా ఆయుధం ఇవ్వండి ఆత్మరక్షణకు!"

ఆమె చేతికి రివాల్వర్ని ఇచ్చారు.

కారు బయలుదేరి పదిగజాలు పోయిందో లేదో, ఆ

ఇంట్లో రివాల్వర్ ప్రేలిన చప్పుడు వినిపించింది.

"ఏమిటదిః" లీన్ షూ అదిరిపడింది.

"మీ అమ్మ ఆత్మహత్య చేసుకుంది!" అన్నాడు కిరణ్ కుమార్.

*　　　*　　　*

కారు ఎయిర్ డ్రోమ్ చేరింది.

అదో మిలిటరీ విమానాశ్రయం కావటం మూలాన ఇద్దరు ముగ్గురు సెంట్రీలకన్న లేరు. లాంజ్ లో కూర్చుని పైలట్ సీసాలు ఖాళీ చేస్తున్నాడు.

కారులోంచి ముందుగా ఇన్ స్పెక్టర్ ఛుంగ్ లీ దిగాడు. అతడి చేతిలో మిషన్ గన్ ఉంది.

బంధితుడ్ని తీసుకువెళ్ళేవాడిలా గన్ చూపిస్తూ వాళ్ళని లోపలకు తీసుకువెళ్ళాడు.

"వీళ్ళని మిలిటరీ హెడ్ క్వార్టర్స్ కి తీసుకువెడుతున్నాం. ప్యావో వెనుక కారులో వస్తున్నాడు" అన్నాడు అక్కడున్న వాళ్ళను చూసి.

ప్యావో పేరు వింటూనే అందరూ ఎటెన్షన్ లో నిలబడ్డారు. "ఈ లోపల వీళ్ళను విమానంలో కూర్చోబెడతాను" అన్నాడు ఛుంగ్ లీ.

పైలట్ సరేనన్నట్టు తల ఊపాడు.

వినయ్ సక్సేనా తన మూటను బుజానికెత్తుకున్నాడు. ఆయుధాలున్న మరో మూటను కిరణ్ కుమార్ మోస్తున్నాడు.

అందరూ విమానంలో ఎక్కారు.

"నీవుకూడా రా ఛుంగ్ లీ!" అన్నాడు కిరణ్ కుమార్.

"నేను రాను!"

"ఇక్కడ ఉంటే నీ పరిస్థితి ఎంత విషమిస్తుందో తెలుసాః"

"తెలుసు! అయినా రాను. మీరు బయలుదేరండి. ఆలసించినకొద్దీ ప్రమాదం!" అని హెచ్చరించాడు.

కిరణ్ కుమార్ డోర్ వేసేశాడు. పైలట్ సీట్లో కూర్చుని ఇంజన్ స్టార్ట్ చేశాడు.

నేలమీద ఉన్న ఇన్‌స్పెక్టర్ చేతిలో గన్ వరుసగా పేలింది. వాంగ్ ఫూ కిటికీలోంచి క్రిందకు చూశాడు.

అక్కడున్న సెంట్రీలు, పైలట్, ఇన్‌స్పెక్టర్ ఛుంగ్ లీ నేలమీద రక్తపు మడుగులోపడి ఉన్నారు.

విమానం వేగాన్ని పుంజుకుంది. చైనా భూభాగం దాటి బర్మాలో ప్రవేశించింది.

వైర్ లెస్‌లో హాంగ్ కాంగ్‌లో తమ శాఖని కాంటాక్ట్ చేసి తాము నేరుగా కలకత్తా వెళ్తున్నట్టు చెప్పాడు కిరణ్ కుమార్.

బర్మాదాటి బంగళాదేశ్ మీదుగా ఎగురుతోంది ప్లేన్.

కాక్‌పిట్‌లోకి వినయ్ సక్సేనా వచ్చాడు.

'ఏం?' అన్నట్టుగా చూశాడు కిరణ్.

"నాకో సాయం చేయాలి!"

"ఏమిటి?"

"మేరీని వాంగ్ ఫూ వివాహం చేసుకోబోతున్నాడు. నా కోసం త్యాగంచేసిన లీన్ షూని నేను వివాహమాడాలని నిర్ణయించుకున్నాను" వినయ్ సక్సేనా గొణిగాడు.

"విదేశీ వనితను పెళ్ళాడేందుకు ప్రభుత్వం అనుమతిస్తుందో లేదో అని అనుమానమా?"

"ఆ విషయం నేను చూసుకోగలను! కాని అరుణకు ఈ విషయం ఎలా చెప్పాలా అని!"

"అదా! ఆ విషయం నాకొదిలెయ్! నువ్వు నిశ్చయంగా ఉండు!"

"థాంక్యూ!" అంటూ వెనక్కు వెళ్ళి తన సీటులో

కూర్చున్నాడు వినయ్ సక్సేనా. ప్రక్క సీటులో కూర్చున్న లీనా షా చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

అరుణ సిగ్గుతో లేచింది. కాక్ పిట్ లోకి నడిచింది.

“రా అరుణా! డమ్ డమ్ విమానాశ్రయంలోకి దిగబోతున్నాం!” అన్నాడు కిరణ్ కుమార్.

దూరంనుంచి విమానాశ్రయం అంతా జనంతో కిక్కిరిసి పోతున్నది. ప్రెసిడెంటు, ప్రధాన మంత్రి ఇంకా అనేక మంది ప్రముఖులు వాళ్ళకు స్వాగతం చెప్పటానికి రెడీగా ఉన్నారు.

“నీకు ఘనంగా సన్మానం జరగబోతోంది కిరణ్!” అన్నది అరుణ.

“ఈ ట్రిప్ లో నా బహుమతిని ఎప్పుడో గెల్చుకున్నాను.”

అరుణ ఆశ్చర్యంగా చూసింది. “ఏమిటో నాకు చెప్పనే లేదు కదూ?”

“నా అరుణను నేను గెల్చుకున్నాను” అన్నాడు కిరణ్ కుమార్.

అరుణ కిలకిలా నవ్వింది.

స్వాగతం చెబుతూ విమానాశ్రయంలో ఫిరంగులు మ్రోగినయ్.

—: ఐపోయింది :—

# హంతకులకు ఆతిథ్యం!

## ఏ. వీ. మోహన్రావ్

రాత్రి పన్నెండు గంటలయింది.

కాంటినెంటల్ హోటల్ లోని ఇరవై నాలుగో అంతస్తు లోని ఆరువందలా ఆరవై ఆరో నెంబరులో మాత్రం లైట్లు వెలుగుతున్నాయి. గది మధ్యగానున్న కుర్చీల్లో మొత్తం నలుగురు కూర్చుని వున్నారు.

ఎర్రగా పొడుగ్గా లావుగావున్న వ్యక్తి వేంట్రుకలు పైకి తోసుకుంటూ "ఇంకెందుకు ఆలస్యం! మీ ప్లాన్ చెప్పండి!" అన్నాడు తన కెదురుగా నల్లటి పొట్టి వ్యక్తి కేసి చూస్తూ.

గోల్డ్ సిగరెట్ కేస్ టీపాయిపైన పడేసి ముందుకు వంగాడు పొట్టివ్యక్తి. గొంతు సర్దుకుని "ఇది చాలా కష్ట

సాధ్యమైనపని. అందుకే మూడుమాసాలనుండి వెతికి వెతికి మిమ్మల్నిద్దరినీ సెలెక్టుచేశాను" అన్నాడు ఎదురుగా వున్న ఇద్దర్నీ చూసి.

అతనిప్రక్క కూర్చున్న దంతపు బొమ్మలాంటి స్త్రీ మెళ్ళోవున్న ఒంటిపేట బంగారుగొలుసుకు వ్రేలాడుతున్న లాకెట్ ను పళ్ళసందున పెట్టుకొని కొరుకుతూ కూర్చుంది.

"ఈమె పేరు ఎలీజా! నా వ్యాపారాల్లో, వ్యవహారాల్లో ఆమెకు చిన్న భాగం వుంది. ఈమె మీ వెంట వుంటుంది" అంటూ ఎలీజావంక తిరిగి "అతని పేరు మస్తాన్. హత్యలు చెయ్యడంలో అసాధ్యుడు. అవసరమైనప్పుడు రాక్షసులకన్నా కఠినంగా ప్రవర్తించగలడు" అంటూ ముందుగా మాట్లాడిన ఎర్రటి, పొడుగువ్యక్తిని పరిచయం చేశాడు. రెండో అతనికేసి చెయ్యిచూపుతూ "అతని పేరు విక్రమ్. మస్తాన్ కు మించిన దుర్మార్గుడు. కార్లు నడపడంలోనూ, హెలికాప్టర్లు నడపడంలోనూ దిట్ట. అంతే గాకుండా తుపాకులు, రివాల్వర్లు లాంటి వాటితో ఎన్ని రకాలైన ఆటలైనా ఆడగల సమర్థుడు" అన్నాడు.

"గ్లాడ్ టు మీట్ యూ టూ!" అంది ఎలీజా లాకెట్ నోట్లోంచి తీసి.

వాళ్ళిద్దరూ ఏం మాట్లాడలేదు.

"అసలు విషయానికొద్దాం!" అంటూ వంగి గోల్డ్ కేస్ లోంచి సిగరెట్ తీసుకొని అంటించుకున్నాడు ఫ్రేజర్. దమ్ములాగి "మీరు బహుశా మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని బస్తర్ జిల్లా గురించి వినివుంటారనుకుంటాను. భంజ్ దేవ్ లు పరిపాలించేవాళ్ళు. ఈ మధ్యనే వాళ్ళవంశం పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది. వాళ్ళ ఎస్టేట్ మొత్తం ప్రస్తుతం జిలాన్ అనే కోటీశ్వరుడు కొన్నాడు. చాలా డబ్బు

ఖర్చుపెట్టి రాజమందిరం మొత్తం అధునాతనం చేయించాడు.

అతని ఎస్టేటులో చాలామంది అడవిమనుషులున్నారు. వాళ్ళందరికీ తిండీ గుడ్డా లోటులేకుండా వుండే ఏర్పాటు కూడా చేశాడు. అతని మాటకు ఆ ఎస్టేటులో తిరుగులేదు. అతని అనుమతి లేనిదే ఎవ్వరూ లోపల కాలుపెట్టలేరు. ఆ ఎస్టేటు అన్నివైపులనుండి రాత్రింబవళ్లు కాపలా కాయబడుతూ వుంది.

ఈ జిలాన్ తండ్రి రంగూన్‌లో పెద్దఎత్తున వ్యాపారం చేసి డబ్బు సంపాదించాడు. ఆ డబ్బుతోనే ఈ ఎస్టేటు కొన్నాడు. కొన్న రెండేళ్ళకు చచ్చిపోయాడు. అతని కున్నది ఒక్కడే కొడుకు. మొత్తం ఆస్తి అతనికే సంక్రమించింది.''

''ఈ చరిత్ర మాకు అవసరంలేదు! మేమేం చెయ్యాలో చెప్పు!'' అన్నాడు మస్తాన్.

''చెప్పింది చెస్తే ఏమిస్తారో కూడా చెప్పు!'' అందుకున్నాడు విక్రమ్.

''అదే చెప్తున్నాను. ఇతను విలువైన వస్తువుల్ని తన మనుషులద్వారా దొంగతనం చేయిస్తాడు. తెచ్చుకొని తన ఎస్టేటులో పెట్టుకొంటాడు. ఎవ్వరూ అక్కడికి వెళ్ళలేరు కాబట్టి చట్టానికి చిక్కకుండా తన అఘాయిత్యాలు కొనసాగిస్తున్నాడు.

నా క్లయింటు ఒకతను ఇండియానుండి రెండువేల సంవత్సరాలనాడు తయారుచెయ్యబడ్డ మూడడుగుల శ్రీకృష్ణుని విగ్రహం ఒకదాన్ని, స్మగ్లర్ దగ్గర కొన్నాడు. అతనిది ఈ దేశంకాదు. జిలాన్ మనుష్యులు దాన్ని తెలివిగా దొంగిలించుకొని తెచ్చారు. ఆ విగ్రహం బంగారుతో చేసింది. సుమారు పదికిలోల బరువుంటుంది.

దానితోబాటు మరోవిగ్రహం మరో వ్యక్తికి దొరికింది. కొన్ని కోట్లరూపాయల విలువచేసే నిధికి దారితెలిపే రహస్య సంకేతాలు కొన్ని ఆ విగ్రహం కాళ్ళపాదాలపైన వున్నాయి. అవి అసంపూర్తిగా వున్నాయి. వాటి మిగిలిన వివరాలు జిలాన్ దగ్గర వున్న విగ్రహంపైన వున్నాయి. మీరెలాగైనా ఆ విగ్రహం తేవాలి. దాన్ని నాకు చేరవేసిన వెంటనే మీ ఇద్దరికీ చెరి రెండులక్షలిస్తాను. మీ ఖర్చులన్నీ నేనే భరిస్తాను. తేగలరా?" అడిగాడు ఫ్రేజర్.

"జిలాన్ ఎస్టేటు ప్లాను మీ దగ్గర వుందా?" మస్తాన్ అడిగాడు.

"ఉంది. అతని మందిరం ప్లానుకూడా వుంది. ఆ విగ్రహం ఎక్కడ దాచిందికూడా తెలిపే వివరాలున్న కాగితాలుకూడా వున్నాయి. అతను రక్షణకోసం చేసుకొన్న ఏర్పాట్లుకూడా వివరంగా మీకు అందించగలను" అన్నాడు.

"కోట్లవిలువచేసే నిధి దొరికేప్పుడు మాకు నువ్విస్తానన్నది చాలా చిన్న మొత్తం" అన్నాడు విక్రం.

"దొరికేది నాకుగాదు. నా క్లయింటుకు. అతను నాకు ఇస్తానన్నది ఐదులక్షలే. మీకు నాలుగు లక్షలిస్తున్నాను. ఖర్చులు పెట్టుకుంటున్నాను. ఇంతవరకు మీకు చెప్పిన విషయాలు సేకరించేందుకు నాకు పాతికవేలు ఖర్చయింది" అన్నాడు ఫ్రేజర్.

"అయితే నీకు లాభంలేదన్నమాట!"

"అలాగనికాదు. మీరు నిజంగా విగ్రహం తేవడం జరిగితే నా క్లయింటు సంతోషించి లక్షరూపాయలన్నా ఇవ్వకుండాపోడు. అది చాలు!"

"ఎలా అక్కడికి చేరుకోవాలో ఏదైనా పథకం ఆలో

వించారా?"

"ఆఁ! మీరు దిగగలమంటే నా ఆలోచనలు చెప్తాను."

"ఇంతకన్న తక్కువ మొత్తాలకు ప్రాణాలు తీసిన సందర్భాలున్నాయి. ఆ విగ్రహం తెస్తాం! చెప్పండి!!" అన్నాడు మస్తాన్.

"మీరిద్దరూ సినిమావాళ్ళుగా వెళ్ళాలి. ఒకరు ప్రొడ్యూసరుగానూ మరొకరు డైరక్టరుగా. ఎలీజాను మీ హీరోయిన్ గా తీసుకువెళ్ళండి. ఔట్ డోర్ లోనే సినిమా అంతా తీసేందుకు పథకం వేసినట్టుగా చెప్పండి. లొకేషన్స్ చూసేందుకు దేశమంతా తిరుగుతున్నామని చెప్పండి జిలాన్ ఎస్టేటుకూడా చూచేందుకు పర్మిషను అడగండి. అప్పుడే మా హీరోయిన్ కూడా వస్తుందని చెప్పండి. జిలాన్ కు అందమైన ఆడవాళ్ళంటే తగని మోజుంది. ఎలీజా అందం అతన్ని పిచ్చివాణ్ణిచేస్తుందని నా నమ్మకం. లోపలకు వెళ్ళాక మిగిలిన గొడవలు మీరు చూచుకోండి. అంతకన్నా నేను చెప్పగలిగిందిలేదు!" అన్నాడు ఫ్రేజర్.

"వెరీ బ్రైట్ ఐడియా!" మస్తాన్ ఎగిరి గంతేశాడు.

"మీ ప్రాణరక్షణకు అవసరమైన ఆయుధాలు, మందులు తీసుకోవడంతోపాటు, అవసరమైన పక్షంలో అవతలవాళ్ళ ప్రాణాలు తీసేందుకు పనికొచ్చే సరంజామా కూడా పట్టుకెళ్ళండి. అక్కడ మీరు చాలా జాగ్రత్తగా వుండాలి. జిలాన్ మనుష్యులు ఆవులిస్తే పేగులు లెక్కపెట్టగల దిట్టలని వినికిడి. మీరిద్దరూ రెండురోజులు తర్జన భర్జన చేసుకొనివచ్చి ఎప్పుడు బయలుదేరేదీ చెప్పివెళ్ళండి" అన్నాడు ఫ్రేజర్.

ఫోన్ బజర్ మ్రోగింది.

ఫ్రేజర్ వెళ్ళి రిసీవరు పైకెత్తి "హల్లో!" అన్నాడు.

"సారీ టు డిస్టర్బ్ యు సార్! గంట రెండవుతూంది,

నన్ను వెళ్ళిపొమ్మంటారా?" అడిగింది సెక్రటరీ మంజుల.

"నువ్వింకా వున్నావా? వెళ్ళమని చెప్పలేదూ నేను!" అడిగాడు.

"లేదండి!"

"సారీ! నువ్వెళ్ళిపో. నా ఫ్రెండ్స్ కూడా వెళ్తున్నారు. నిన్ను డ్రాప్ చెయ్యమని చెప్తాను" అన్నాడు ఫ్రేజర్.

"థాంక్స్!" అంది మంజుల.

ఫోన్ పెట్టేసి మస్తాన్‌తో చెప్పాడు తన సెక్రటరీని రాయపేట హైరోడ్డు దగ్గర వదలివెళ్ళమని.

మస్తాన్, విక్రమ్, సెలవు తీసుకున్నారు. విక్రమ్ అసలు ఫ్రేజర్ మాటలు సగంకూడా వినలేదు. అతనికి ఎలీజాను చూడటమే సరిపోయింది. అది ఫ్రేజర్ కూడా గమనించాడు. ఎలీజాను వెంటబెట్టుకొని పొమ్మనప్పుడు, విక్రమ్ కళ్ళల్లో తళుక్కుమని మెరవడంకూడా గమనించాడు.

"ఎలీజా! వాళ్ళగురించి నీ అభిప్రాయం ఏమిటి?" అడిగాడు.

"నెత్తురుత్రాగే పిశాచాల్లా వున్నారు. ఆ విక్రమ్ నన్ను కళ్ళతోనే నమిలి తింటున్నట్లు చూడటం అసహ్యంగా వుంది" అంది ఎలీజా.

"అదే ఆలోచిస్తున్నాను. నీకు వీళ్ళవల్ల ఏదైనా హాని జరుగుతుందేమోనని భయంగావుంది. ఈకేసు డ్రాప్ చేసేస్తాను."

"నో! నన్ను నేను రక్షించుకోగలను. ఆ విగ్రహం గురించి అన్ని వివరాలు చెప్పకుండా వుండవలసింది. తీరా చేతికి చిక్కాక దాన్ని మనకి ఇవ్వకపంటే..." తన అనుమానం వ్యక్తంచేసింది.

"అన్ని వివరాలు చెప్పడం మంచిది. మనమిచ్చేడబ్బు కన్నా, దానివిలువ కోసమైనా సిన్సియర్‌గా చేస్తారు

పని. వాళ్ళ చేతికి చిక్కాంతర్వాత, మనం దక్కించుకోవడం పెద్ద పనిగాదు. ఆ విషయాలు నేను చూసుకుంటాను. నువ్వుమాత్రం జాగ్రత్తగా వుండాలి. వాళ్ళకు ఏవిధమైన ఎంకరేజ్ మెంట్ ఇవ్వవద్దు. ఆ జిలాన్ అందగత్తెలంటే పడి చస్తాడు. అతనితో రాసక్రీడ బహుశా తప్పదనుకుంటాను" అన్నాడు ఫ్రేజర్.

"ఇది వ్యాపారం. లాభాన్నిబట్టి ఎంతకైనా తెగించగలం. నేను రూమ్ కెళ్తాను" అంది ఎలీజా లేస్తూ.

"గుడ్ నైట్!" అన్నాడు ఫ్రేజర్.

ఎలీజా వెళ్ళిపోయింది. టేబుల్ పైనున్న స్విచ్ నొక్కగానే గదితలుపులు మూసుకున్నాయి. లైట్లు ఆర్పి పడుకున్నాడు ఫ్రేజర్. నైట్ లైట్ మాత్రం వెలుగుతోంది.

క్రిజ్లర్ కారు బయలుదేరింది. మంజుల డ్రైవరు ప్రక్క సీటులో కూర్చుంది. మస్తాన్, విక్రమ్, వెనకసీటులో కూర్చున్నారు. నల్లగావున్నా మంజుల అందంగానే వుంటుంది.

"ఈ ఫ్రేజర్ అసాధ్యుడిలాగున్నాడు. అందమైన అమ్మాయిల్ని చుట్టూ పెట్టుకొన్నాడు" అన్నాడు విక్రమ్.

మస్తాన్ మాట్లాడకుండా కిటికీగుండా రోడ్ కేసి చూడసాగాడు.

"నీకు పెళ్ళైందా?" ముందుకువంగి అడిగాడు మంజులను విక్రమ్.

"అయింది" అంది రూక్షంగా.

"ఇంత రాత్రిదాకా ఇంటికిపోకుంటే మీ ఆయన అనుమానపడడూ!"

"నాగొడవ నీకెందుకు? గుట్టుగా కూర్చో!" అంది మంజుల కోపంగా.

"నీ అందం నన్ను కూర్చోనివ్వడంలేదు."

"అయితే దిగి రోడ్ పైకి వెళ్లి తైతక్కలాడు!" అంది మంజుల.

రాయపేట హైరోడ్ వచ్చింది. డ్రయివరు కారాపాడు. మంజుల హాండ్ బ్యాగ్ తీసుకుని దిగింది. మళ్ళీ కారు బయలుదేరింది.

"ఆ బ్యాగ్ అంతే బరువుగావుంది. పాపం మొయ్యలేక మోస్తూంది. అందులో ఏముందో?" అన్నాడు విక్రమ్.

"నీ తలకాయ! కాసేపు నోరు మూసుకుని కూర్చోలేవు!" విసుక్కున్నాడు మస్తాన్.

'నువ్వో కొయ్యమనిషివి. అందం చూచి ఆనందించటం చేతకానిరకం' లోలోపలే అనుకున్నాడు విక్రమ్.

కారు అడయారులో చిన్న యింటిముందాగింది. ఇద్దరూ దిగి లోనికెళ్లారు. కారు వెళ్లిపోయింది.

గ్లాసులనిండా విస్కీ బిగించారు.

"ఆ ఫ్రేజర్ ప్లాను ఎలాగుంది?" అడిగాడు మస్తాన్.

"అవన్నీ నువ్వు చూచుకో. ఎప్పుడు, ఎక్కడ, ఎవర్ని చంపాలో, ఏం చెయ్యాలో చెప్పడం నీవంతు. చెయ్యడం నావంతు. ఈ పని పూర్తయ్యేలోగా ఆవిడ్ని అంతుచూడాలి!" అన్నాడు విక్రమ్ గ్లాసులో మళ్ళీవిస్కీ పోసుకుంటూ.

"ఆమెను మర్చిపో. మనవల్ల ఆమెకు ఏదైనా అన్యాయం జరిగితే ఫ్రేజర్ ఊరుకోడు" మస్తాన్ గ్లాసు ముందుకు నెడుతూ అన్నాడు.

"ఆ గొడవ నాది! దాన్నిగురించి నువ్వు ఆలోచించనవసరంలేదు. మనకేం సామానుకావాలో, ఎలా మన

పథకం అమలుపరచాలో తాపీగా ఆలోచించు" అన్నాడు విక్రమ్.

ఇద్దరూ శుభ్రంగా త్రాగి పడుకున్నారు.

## 2

తెల్లవారింది.

ఫోన్ మ్రోగింది. ఫ్రేజర్ అందుకున్నాడు. మంజుల ఇంటినుండి పోలీస్ ఇన్‌స్పెక్టర్ మాట్లాడాడు. ఆమె చచ్చిపడివుందనీ, వెంట నేరమ్మనీ చెప్పాడు. త్వరత్వరగా డ్రెస్ చేసుకుని కారులో వెళ్ళాడు.

అడ్రసు వెతుక్కుంటూ వెళ్ళాడు డ్రయివర్. చిన్న పెంకుటింటిముందు ఆగింది కారు. అంతకుముందే వచ్చివున్న పోలీసు వాహనాలు కొంచెం దూరంలో వున్నాయి. ఫ్రేజర్ దిగి లోనికెళ్ళాడు.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఫ్రేజర్‌ను చూడగానే విష్ చేసి "సారీ! మీ సెక్రటరీ మంజుల ఆత్మహత్య చేసుకుంది" అన్నాడు.

"ఆత్మహత్యా!" ఆశ్చర్యపోతూ అయోమయంగా చూశాడు గదిలో. పైకప్పుకు వెర్లిన్ చీర వ్రేలాడుతోంది. చిన్న స్టూలు వెల్లకింతలా పడివుంది.

"నేను చుట్టుప్రక్కల విచారించాను. ఆమె ఎప్పుడు ఇంటికి వచ్చిందీ ఎవ్వరూ చెప్పలేకపోయారు. ఏవిధమైన అరుపులుగానీ, శబ్దాలుగానీ, ఎవ్వరూ వినలేదంటున్నారు. నేషనల్ బ్యాంక్‌వాళ్ళ కారుమాత్రం రెండుసార్లు పది గంటల ప్రాంతంలోవచ్చి వెళ్ళిందని తెలిసింది."

"ఐ.సీ. ఆమె ఆత్మహత్య చేసుకోనే ముందేదైనా ఉత్తరంలాంటిది రాసి పెట్టిందేమో చూశారా?" అడిగాడు ఫ్రేజర్.

"చూశాను. అలాంటిదేదీ లేదు. రాత్రి మీరు ఆఖరిసారి

ఎన్ని గంటల ప్రాంతంలో చూశారు" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"తొమ్మిదింటి ప్రాంతంలో ననుకుంటాను" అన్నాడు ఫ్రేజర్.

"ఆమె దేనికైనా భయపడుతున్నట్లుగా తోచిందా?"

"లేదు. నార్మల్‌గానే ప్రవర్తిస్తూండింది. నేషనల్ బ్యాంక్ వాళ్ళ కారు వచ్చిందన్నారు. ఎందుకొచ్చిందో, యెవరు వచ్చారో వాకబు చేశారా?"

"ప్రయత్నించాను. కానీ ఎవ్వరూ చెప్పలేకపోయారు. ఆ బ్యాంక్‌కు కూడా ఫోన్ చేశాను. వాళ్ళు ఏమీ తెలీదంటున్నారు. కానీ ఒక్క వస్తువు మాత్రం చిక్కింది."

"ఏమిటది?"

"టేప్ రికార్డర్లలో ఉపయోగించే స్పూల్స్‌పాక్ చేసిన అట్టపెట్టెలు రెండు దొరికాయి. కానీ టేప్స్ మాత్రం లేవు. టేప్ రికార్డర్ కూడా లేదు. మీకు తెలిసి ఆమెవద్ద టేప్ రికార్డర్ వుందా?"

"లేదండీ!" అన్నాడు ఫ్రేజర్.

"థాంక్స్! కేస్ రిజిస్టరు చేసి శవాన్ని దహనంచేసే ఏర్పాట్లు చేస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అలాగే! నాతో అవసరముంటే ఫోన్ చెయ్యండి. హోటల్లోనే వుంటాను" అని చెప్పి ఫ్రేజర్ వెలుపలకొచ్చి కారెక్కాడు.

కారు కదలింది.

ముందురోజు రాత్రి జరిగిన సంఘటనలు గుర్తొచ్చాయి. తను మంజులను, మస్తాన్, విక్రంలు గదిలోకి రాగానే ఫోన్ చేసి వెళ్ళిపొమ్మని చెప్పాడు. కానీ ఆమె వుండిపోయింది. తమ సంభాషణ ముగిసేదాకా వుండిపోయింది. ఆతర్వాత తన్ను మంజుల రింగ్ చేసి అడిగింది వెళ్ళవచ్చాని.

అప్పుడే తను జాగ్రత్త పడవలసింది. ఆమె తమ సంభాషణను రికార్డ్ చేసి వుండాలి. ఎవరో డబ్బాశ చూపించి వుంటారు. టేప్‌లు చిక్కాక ఆమెను మోసంచేసి వుంటారు. తను చేసినపనికి భయపడి ఆత్మహత్య చేసుకొని వుండివుంటుం దనుకున్నాడు ఫ్రేజర్.

గదికి రాగానే అన్నివస్తువులు గాలించాడు. టీపాయ్ పైనున్న ఫ్లవర్ వేజులో చిన్నపవర్ ఫుల్ మైక్ కనిపించింది. దానివైరు సరిగ్గా మంజుల గదిలోని టేబుల్ దాకా కార్పెట్ క్రిందే సాగిపోయివుంది. మొత్తంచుట్టి మైక్‌తో సహా ఎలెక్ట్రిక్‌లో వేసి, ప్లగ్ లాగాడు. జయ్యిమని నీళ్ళొచ్చాయి. నిముషంలో కొట్టుకుపోయింది.

రెండు నెలలనుండి తంటాలుపడి తయారుచేసిన పథకము మొత్తం తన ప్రత్యర్థి చేతిలోకి వెళ్ళిపోయింది. ఈ ప్రయత్నం ఆపివేయకుంటే మస్తాన్, విక్రమ్, ఎలీజా ముగ్గురూ చావడం తధ్యమన్న విషయం అర్థమైంది. అటువంటి మనుషులు మళ్ళా దొరికేదెప్పుడు? తను మరో పథకము తయారు చేసేదెప్పుడు? అంతదాకా తన క్లయింట్ ఓర్పుగా వుంటాడన్న నమ్మకంలేదు.

మస్తాన్, విక్రం చచ్చినా, బ్రతికినా తనకు బాధ లేదు. కానీ ఎలీజాను బలిపెట్టడం అవివేకమనిపించింది. అయినా అంతకన్నా మరో మార్గంకూడా తోచలేదు. అందుకే ఈ విషయం గురించి యెవ్వరితోనూ చర్చించడం ఇష్టంలేకపోయింది.

రెండురోజులు గడచిపోయాయి. మూడోరోజు మళ్ళీ అంతా కలిశారు గదిలో.

"మంజుల చావుకూ, మన పథకానికీ ఏమైనా సంబంధముందా?" అడిగాడు విక్రం.

"ఏం? ఎందుకు?"

"ఆమె ఆత్మహత్య అంత సహజంగా అనిపించలేదు నాకు. ఆ రోజు రాత్రి కార్లో ఆమె భయభయంగా కూర్చుంది. హాండ్ బ్యాగ్ ముయ్యలేక మోస్తున్నట్టు తోచింది. పలకరిస్తే ఖస్సుమని లేచింది" అన్నాడు విక్రం.

"నాకలా అనిపించలేదు. ఆమె వ్యక్తిగత కారణాల వల్ల ఆత్మహత్య చేసుకున్నట్లు పోలీసులు చెప్పారు" అన్నాడు ఫ్రేజర్ సిగరెట్ కాలుస్తూ.

"దట్స్ గుడ్! మేము పూర్తిగా మీరు చెప్పిన పథకం గురించి ఆలోచించాము. మాకు కావలసిన వస్తువుల లిస్టు తయారుచేశాం" అంటూ మస్తాన్ ఒక కాగితం అందించాడు ఫ్రేజర్‌కు. అతను లిస్టంతా చదివి "రెండురోజుల్లో అన్నీ సిద్ధంచేయిస్తాను. మీరెప్పుడు బయలుదేరుతారు?" అడిగాడు.

"ఇవాళ ఇరవై రెండో తేదీ. ఇక్కడ ఇరవై అయిదో తారీఖున బయలుదేరుతాం; బొంబాయి వెళ్తాం. ఇరవై ఏడో తారీఖున చేరుతాం. అక్కడ్నుంచి భోపాల్ చేరుకుంటాము. కాను, మిగిలిన సామగ్రీ అప్పటికి భోపాల్ చేరాలి. అక్కడ్నుంచి కార్లో వెళ్తాం" అన్నాడు మస్తాన్.

"వెరీగుడ్!" అన్నాడు ఫ్రేజర్.

"మీరు ఇస్తానన్న డబ్బులో సగంముందుగా - అంటే ఇక్కడ్నుంచి మేము బయలుదేరబోయేముందు ఇవ్వాలి" అన్నాడు విక్రం.

"వచ్చాక తీసుకోండి!"

"రాలేకపోతే?"

"మీరు సురక్షితంగా విగ్రహం తీసుకొని రాలేకపోతే నాకుమాత్రం డబ్బెవరిస్తారు" అడిగాడు ఫ్రేజర్.

"మేము అడుగుతున్నది మా ప్రాణాల విలువ. మేము

అరంతరంగా అక్కడ ఘ స్తే కనీసం మమ్మల్ని నమ్ము కున్న వాళ్ళకు కొంతడబ్బయినా ముట్టినట్లవుతుంది. మీరు అలా ఇవ్వను వీలులేకుంటే మనం విడిపోదాం. ఆ లిస్ట్ కూడా చించిపారెయ్యండి'' అన్నాడు విక్రం.

ఫ్రేజర్ రెండుక్షణాలు ఆలోచించాడు. ఇలా డబ్బు ముందే అడుగుతారని అతను ఊహించలేదు.

"ఆల్ రైట్! మీ కోరిక న్యాయంగానే వుంది. ఊరు బయలుదేరేందుకు ఇంకా టైముంది. ఈలోపల నా క్లయింటుతో మాట్లాడుతాను. అతను డబ్బిచ్చేందుకు సిద్ధమయితేనే మీ లిస్టు ప్రకారం కావలసిన వస్తువులు సేకరించే ప్రయత్నాలు చేస్తాను; లేకుంటే మానేస్తాను; ఏమంటారు?''

"అలాగే చెయ్యండి!'' అన్నాడు మస్తాన్.

"మరో విషయం. ఎలీజా నా స్వంతమనిషి. మీ ఇద్దరిలో యెవ్వరివల్లనన్నా ఆమె గౌరవానికి భంగం కలిగితే నేను సహించను. నన్ను గురించి మీకు బాగా తెలుసనుకుంటాను.''

"అలాంటి దేమీ వుండదు. ఆమెను మగాడిలాగే భావించి తీసుకెళ్తాం. మీరు ఆందోళన పడకండి!'' అన్నాడు మస్తాన్.

## 3

జిలాన్ సోఫాలో కూర్చున్నాడు. టీపాయ్ పైనున్న టేప్ రికార్డర్ లోంచి మాటలు వినబడుతున్నాయి. కొద్దిదూరంలో జిలాన్ వ్యవహారాలు చూచే మనిషి రాజన్ నిలుచున్నాడు. అతనుకూడా వింటున్నాడు మాటలు.

శబ్దం ఆగిపోయింది.

పియానోలో స్విచ్ నొక్కాడు జిలాన్. రికార్డర్ ఆఫ్ అయింది.

"మనకింత విలువైన సమాచారం అందజేసిన నీ స్నేహితుడికి ఘనంగా డబ్బు పంపు. మన ఎస్టేటుకు రాబోయే ఈ అతిధుల్ని ఎలా మర్యాద చెయ్యాలో, స్వాగతవచనాల్ని దగ్గరనుండి, మంగళహారతివరకూ ఏ లోటూ జరగకుండా వుండేట్లు ఏర్పాట్లు చెయ్యి" అన్నాడు రాజన్ కేసి చూస్తూ.

"అలాగే బాస్!"

"వాళ్ళొచ్చే దారిపొడుగునా వున్న మన ఆటవిక జనాన్ని ముందుగానే హెచ్చరించు! లోపలకు వచ్చేప్పుడు ఏవిధమైన అడ్డు వుండగూడదని చెప్పు" అన్నాడు జిలాన్.

"అలాగే!"

"ఇక్కడవాళ్లు ఏగదిలో వుండవలసిందీ, ఎవరువాళ్లను అటెండవవలసిందీ మొదలైన అన్ని విషయాలు నువ్వు ముందుగానే నిర్ణయించు."

"యస్ సర్! అలాగే చేస్తాను."

"యూ కెన్ గో!" అన్నాడు జిలాన్.

రాజన్ వెళ్ళిపోయాడు.

జిలాన్ సిగరెట్ వెలిగించుకొన్నాడు. విగ్రహం గుర్తొచ్చింది. సోఫాకు అమర్చివున్న కాలింగ్ బెల్ నొక్కాడు. సర్వెంట్ వచ్చి నిలబడ్డాడు.

"మిస్ నీలారాణి!" అన్నాడు.

సర్వెంట్ వెళ్ళిపోయాడు.

రెండు నిముషాల్లో సన్నగా, పొడుగ్గావున్న అందమైన పాతికేళ్ళ పడుచుపిల్ల గదిలోకొచ్చి నిలబడింది. ఆమె చేతిలో షార్టుహాండ్ బుక్ వుంది.

"మన స్టోరు రూం ఇన్‌ఛార్జికి సెక్యూరిటీ ఏర్పాట్లు కట్టుదిట్టంగా చెయ్యమని మెసేజ్ పంపండి. మరోవారం రోజుల్లో మన బంగళాకు దొంగతనాల్లో, హత్యల్లో, ఆరితేరిన ముగ్గురువ్యక్తులు వస్తున్నారు. వాళ్ళకు ఆ స్టోర్ రూము తలుపులు మన కన్నుగప్పి తీసే అవకాశం వుండ కూడదని కూడా అందులో తెలియపరచు" అంటూ చేయి ఊపాడు ఆమెను వెళ్ళిపోవచ్చనన్నట్టు.

నీలారాణి వెళ్ళిపోయింది.

ఆ విగ్రహంలో ఇంత పెద్ద రహస్యం దాగివుందని తెలి శాక జిలాన్‌కు పిచ్చి పట్టినట్టుంది. ఆ రెండో విగ్రహం సంపాదించాలన్న ఆరాటం బయలుదేరింది. ముందీ విగ్ర హముకోసం వచ్చినవాళ్ళకు తగిన బుద్ధిచెప్పి, రెండో విగ్రహం తస్కరించే ఏర్పాట్లు చెయ్యాలని నిర్ణయించు కున్నాడు.

టేప్ రికార్డర్‌లో తన్ను గురించి ఫ్రేజర్ చెప్పిన మాటలు గుర్తొచ్చి నవ్వొచ్చింది. అతను తనకు అందగత్తె లయిన ఆడవాళ్ళంటే అమిత ఆసక్తి అని, వాళ్ళను అనుభ వించకుండా వదలననీ చెప్పాడు. తన తండ్రి బ్రతికి వుండగా ఒక ఆటవిక స్త్రీ అందానికి తను ముగ్ధుడై వెంట బడి వెళ్ళి, ఆమె వద్దంటున్నా వినకుండా బలవంతంచేసి అనుభవించాడు. అది చూచిన ఆ స్త్రీభర్త విషం పూసిన బాణంతో సరిగ్గా తన్ను మర్మస్థానంలో పొడిచాడు. ప్రాణాలు పోయినంత పనయింది.

ఆపరేషన్ చేయించుకున్నాక అతడికి ఆడవాళ్ళతో అవసరం లేకుండానే పోయింది. ఆ విషయం ప్రపంచానికి తెలియనీకుండా జాగ్రత్తపడసాగాడు.

స్టోర్ రూం ఇన్‌ఛార్జి గదిలోకి వచ్చాడు. అతను మిలి టరీ డ్రస్‌లో వున్నాడు. చేతిలో గన్ వుంది.

"నీలారాణి మెసేజ్ అందిందా?"

"అందింది."

"ఏదైనా చెప్పేందుకు వచ్చావా?"

"సెక్యూరిటీ గురించి మీరు ఏవిధమైన ఆందోళన పడ నవసరం లేదనీ, స్వయంగా వచ్చి చెప్పి పోదామను కున్నాను."

"గుడ్! వాళ్లు అఖండులు. మన పాలస్ గార్డ్సందర్నీ జాగ్రత్తగా అప్రమత్తంగా వుండమని చెప్పు. నా అనుమతి లేకుండా వాళ్ళ కేవిధమైన అవమానం, హాని జరిగేందుకు వీల్లేదు" అన్నాడు జిలాన్.

"యస్ బాస్!" అని సెల్యూట్ కొట్టి వెళ్ళిపోయాడు.

జిలాన్ ఎస్టేటు గుర్తు చేసుకున్నాడు.

పాలస్‌కు నాలుగు దిక్కులా ఇరవై అయిదు కిలో మీటర్లదాకా వున్న స్థలమంతా అతనిదే. తూర్పువేపు కొండలున్నాయి. పడమర పెద్ద నది వుంది. ఆ నది ఎప్పుడు నిండుగానే వుంటుంది. ఎస్టేటులోకి వచ్చేందుకు ఒకేవొక కొయ్యబ్రిడ్జి వుంది. దాన్ని యెప్పుడూ యెత్తిపెట్టి వుంచు తారు. దక్షిణంవేపు దట్టమైన అడవి వుంది. అందులో భయంకరమైన క్రూర మృగాలతోపాటు విష సర్పాలు వున్నాయి. యికపోతే ఉత్తరం దిక్కున రోడ్ వుంది.

ఆరోడ్ పొడవునా ఆరుగ్రామా లున్నాయి. అందులో అంతా జిలాన్ అనుచరులైన ఆటవిక లున్నారు. విషం పూసిన బాణాల్తో అన్నివేళలా కాపలాకాస్తూ వుంటారు. తప్పించుకుని పోదలచుకున్న వాళ్లెవరైనా ఉత్తర దిక్కుగా పోవలసిందే. ఆ గ్రామాల్లో వున్న అనుచరుల్ని ముందుగానే హెచ్చరించ దలచుకున్నాడు జిలాన్.

అతనికంతలో రెండో విగ్రహం సంగతి గుర్తొచ్చింది. ఫ్రేజర్ పంపిన మనిషిని లోబరుచుకుని, అతను ఇస్తానన్న

డబ్బుకన్నా ఎక్కువిచ్చి, వాళ్లచేత రెండో విగ్రహం సంపాదించేందుకు ప్రయత్నం చేద్దామనిపించింది. వాళ్ళలో ఫ్రేజర్ స్వంతమనిషి ఎలీజా వుందన్న విషయం గుర్తుకొచ్చింది. ఆమె బహుశా తను ఇస్తాననే ఎక్కువ డబ్బుకు ఆశపడక పోవచ్చు. ఆ సాకుతో అందరూ ఎస్టేటునుండి తప్పించుకొనిపోయే ప్రమాదం వుంది. వచ్చినవాళ్ళను చిత్రహింసపెట్టి, చంపి, శవాల్ని ఫ్రేజర్‌కు పంపించి, మళ్ళీ మరోమారు తన ఎస్టేటువైపు కన్నెత్తి చూడకుండా చెయ్యాలని నిర్ణయించుకున్నాడు జిలాన్.

రాజన్‌ను పిలిపించాడు. అతను రాగానే కూర్చోమన్నాడు.

"ఆ గాంగు బహుశా ఇక్కడకు 30వ తేదీ వస్తారనుకుంటాను. రాగానే వాళ్ళకు మన పాలెస్ మొత్తం చూపించు. నేలమాళిగలో వున్న స్టోర్‌రూం కూడా తెరపించి, దానిలో వున్న విగ్రహాన్ని కూడా చూపించు. ఆ రాత్రి డిన్నర్ ఏర్పాటు చెయ్యి. డిన్నరుకు నేనుకూడా వస్తాను.

మరుసటిదినం ఉదయం అంటే ఒకటవ తేదీన వాళ్లకు ఇక్కడ్నుంచి ఉద్వాసన చెప్దాం. నేను చెప్పాకే మన వాళ్ళకు హెచ్చరికలు పంపాలి. అంతదాకా వాళ్ళకు అన్నిమర్యాదలు చెయ్యాలి" చెప్పాడు జిలాన్.

"అలాగే బాస్! కానీ వాళ్ళకు ఆ విగ్రహం చూపడం అంతమంచిది కాదేమో?" తన అనుమానం వ్యక్తం చేశాడు రాజన్.

"మన సెక్యూరిటీ ఏర్పాట్లమీద నీకు నమ్మకం లేదా?"

"ఉంది!"

"ఉన్నప్పుడు వాళ్ళు చూచినందువల్ల వచ్చిన నష్టమేమిటి?"

"ఈ గొడవలో అనవసరమైన రక్తపాతం పాలెస్‌లో జరగడం నాకు ఇష్టంలేదు" అన్నాడు రాజన్.

"ఆ రక్తం మనవాళ్ళది కానంతవరకు నాకు ఏవిధమైన అభ్యంతరంలేదు. అలా కాకుండా వుండేట్లు చూడవలసిన బాధ్యత నీది" అన్నాడు జిలాన్ కఠినంగా.

"అలాగే!"

"వీళ్ళ విషయంలో నేను మళ్లా చెప్పబోయే దేమీ వుండదు."

"మీరు చెప్పిన విషయాల్ని మరచిపోను" అన్నాడు రాజన్.

"వాళ్ల దగ్గరనుండి ఫోన్ వచ్చాక ఒకమారు నాకు కనబడిచెప్పు. వాళ్ళతో మాట్లాడేటప్పుడు చాలా జాగ్రత్తగా వుండు. వాళ్ళ రాకగురించి ముందే మనకు తెలుసునన్న విషయం వాళ్ళకు తెలియకూడదు."

"అలాగే!" అన్నాడు రాజన్.

"నువ్వెళ్లు"అని అతన్ని పంపేశాడు జిలాన్. టేప్ రికార్డర్ మళ్ళీ ఆన్ చేశాడు. ఫ్రేజర్ గొంతు వినరావడం మొదలెట్టింది.అతడు మాట్లాడిన ప్రతిమాటా వినసాగాడు. టేప్ పూర్తికాగానే ఆఫ్ చేశాడు.

పాతికవేలు ఖర్చుపెట్టి తన ఎస్టేటులో తను చేసుకొన్న ఏర్పాట్లన్నీ ఫ్రేజర్ సంపాదించగలిగాడని మస్తాన్‌తోనూ, విక్రమ్‌తోనూ చెప్పాడు. అంటే తనదగ్గరున్న మనుషుల్లో నమ్మకద్రోహులెవరో వున్నారు. వాళ్ళే డబ్బుకు కక్కుర్తిపడి, పాలెస్ ప్లాను, మిగిలిన వివరాలు అందించారు.

ఆ ద్రోహి ఎవరు?

అతనిదగ్గర పనిచేసే ప్రతి ఒక్కర్నీ గుర్తుకు తెచ్చుకొన్నాడు, కానీ అంత నీచానికి పాల్పడే మనిషి ఎవ్వరూ కనుపించలేదు.

ఆ గాంగు వచ్చాక ఎటూ ఆ మనిషితో వాళ్ళు చను వుగా ప్రవర్తించటమో, లేక రహస్యంగా కలుసు కోవడమో చేస్తారు. అప్పుడే పట్టాలి అతన్ని అని తీర్మా నించుకున్నాడు.

## 4

చివరగేట్ కాగింది.

డ్రైవింగ్ వీల్ దగ్గరున్న మస్తాన్ ఎదురుగావున్న బోర్డ్ కేసి చూసి "జిలాన్ ఎస్టేట్స్" అని లోలోపల చదువుకున్నాడు. దానిక్రిందే పెద్ద ఇనుపగేటు వుంది. గానికానుకుని చిన్న ఇల్లు కనిపించింది.

"వచ్చాం!" అన్నాడు వెనక్కి తిరిగి మస్తాన్, విక్రంతో.

ఎడంచేతో కుడిచంకలో వున్న రివాల్వర్ను తడుము కున్నాడు విక్రం. "హారన్ కొట్టు! గేటు తెరుస్తారు" చెప్పాడు విక్రం.

మస్తాన్ హారన్ కొట్టాడు.

గేటు వారగానున్న చిన్న ఇంట్లోంచి మిలిట్రీ దుస్తుల్లో వున్న వ్యక్తి ఒకతను వెలుపలికొచ్చి గేటు తెరచుకొని కారుదగ్గరకు వచ్చాడు.

"నేషనల్ ఫిలిమ్ కంపెనీ వాళ్ళం" అన్నాడు మస్తాన్.

"ఎంతమంది వున్నారు?" అడిగాడు కాపలా వ్యక్తి.

"ఇద్దరు మగాళ్ళం. ఆడమనిషి ఒక్కతే!" అన్నాడు మళ్ళీ మస్తాన్.

అతను వంగి కారు సీట్లమధ్య చూశాడు. వెనక్కి వెళ్ళి డిక్కీ తెరచి చూడబోయాడు. అది లాక్ చేసి వుండటంతో వెనకసీటు డోర్ దగరకు వచ్చి "ఓమారు డిక్కీ తెరవండి చూడాలి!" అన్నాడు.

విక్రమ్కు గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్లయింది.

మస్తాన్‌కు ముచ్చెమటలు పోశాయి. డిక్కీ తలుపుతీస్తే తమ రహస్యం బయటపడుతుంది. దాన్నిండా రకరకాల సామగ్రివుంది. దాన్ని చూడంగానే బందిపోటు దొంగలన్న అభిప్రాయం ఎంత అమాయకుడికైనా ఏర్పడుతుంది.

ఎలీజాకు వాళ్ళిద్దరి సందేహం అర్థమైంది.

పక్కన డోర్ తీసుకుని క్రిందకు దిగింది. ఆమె వేసుకున్న పసుపుపచ్చ ఫుల్ గౌన్ గొమ్ములదగ్గర మాత్రం 'వీ' ఆకారంలో వుంది. ఎత్తైన వక్షోజాలు సగం కనుపిస్తూనే వున్నాయి.

"డిక్కీ చూడాలా?" అడిగింది కాపలా వ్యక్తిని ఎలీజా.

"అన్నీ చెక్ చేసి పంపమని మాకు వుత్తరువులున్నాయి" అన్నాడతను.

"ఆ తాళం ఎక్కడో పోయింది. అందులో ఏమీ లేదు" అంది అతనివంక సోగకళ్ళతో చూస్తూ. ఆమెను, ఆమె అందాన్ని చూస్తూ ఆమె మాటల్ని నమ్మకుండా వుండటం అతనికి అసాధ్యమయింది.

"ఆల్ రైట్! మీరు చెప్పారు గాబట్టి నమ్ముతున్నాను. వెళ్ళండి!" అన్నాడు అతను ముందుకు నడచి గేటు వెడల్పుగా తెరుస్తూ.

మస్తాన్ క్లచ్ పైనున్న కాలుతీసి ఆక్సిలేటర్ పైన పెట్టాడు. కారు వేగం అందుకుంది.

"రోడ్ చాలా బాగుంది!" అంది ఎలీజా.

"కుడివేపునున్న పెద్ద అడవి చూశావా? అందులో అన్నిరకాల భయంకరమైన మృగాలున్నాయట" అన్నాడు మస్తాన్.

"ఆ డిక్కీ తెరవమంటాడేమోనని భయపడి చచ్చాను" అన్నాడు విక్రమ్ వెనుకనుండి.

ప్రతి నాలుగు కిలోమీటర్లకు చిన్న గ్రామంలాంటి ప్రదేశం కనుపించింది వాళ్ళకు. రోడ్డువారగా బాణాలు ఎక్కుపెట్టి నిలుచున్న అడవిజాతి మనుష్యులుకూడా కనుపించారు.

“రివాల్వర్లు, తుపాకుల ముందు ఈ బాణాలు ఏం చేస్తాయి? తెలివిలేని వెధవలు ఇంకా వీటిని నమ్ముకొని వున్నారు” అన్నాడు విక్రం.

“విక్రమ్! అవి మామూలు బాణాలు కాదు. వాటి కొనల్ని నాగుపాముల విషంలో ముంచి వుంచుతారు. అది మన శరీరంలో దిగిందంటే వెంటనే గిలగిలకొట్టుకొని చావవలసిందే!” అన్నాడు మస్తాన్.

“అంతేకాదు. మన గుండ్లకన్నా వేగంగా, సూటిగా వెళ్తాయి వాళ్ళ బాణాలు” అంది ఎలీజా.

అరగంట తర్వాత కారు పెద్దకోటముందాగింది. ద్వారం దాటాక లోపల ఒక మైలు ప్రయాణంచేశారు కారులో.

దాదాపు యాభైమందికిపైనే ఆటవికులు ఆయుధాలు ధరించి తిరగడం గమనించారు.

“చాలా పెద్దబలగం ఉన్నట్లుంది!” అంది ఎలీజా.

“ఆః! లోపలికైతే వచ్చాం. బయటపడటం అసాధ్యంలాగుంది” అన్నాడు మస్తాన్.

“మీ రిద్దరూ విగ్రహం పట్టుకురండి. జనాన్ని కాల్చుకుంటూ కారు పోయేందుకు మార్గం ఏర్పాటు చేస్తాను” అన్నాడు విక్రమ్.

కారు ఎత్తైన మెట్లముందాగింది. బ్లూకలర్ సూట్‌లో వున్నవ్యక్తి ఆఖరిమెట్టుపైన నిలబడి వున్నాడు. కారును చూడగానే ఆగమన్నట్లు చెయ్యి ఊపాడు అతను. మస్తాన్ కారు ఆపాడు.

"వెల్ కమ్!" అన్నాడు కారు డోర్ తెరచి ఎలీజాకేసి చూస్తూ.

"నేషనల్ ఫిలిం కంపెనీ వాళ్ళం!" అంది ఎలీజా.

"తెలుసు. మీ కారు మా ఎస్టేట్ లో కొచ్చిన వెంటనే మాకు వర్తమానం వచ్చింది. నా పేరు రాజన్. జిలాన్ గారి కుడిచెయ్యిలాంటి వాడిని. ఆయన తర్వాత, ఈ ఎస్టేట్ లో నామాటే వేదవాక్కు. రండి" అన్నాడు. మస్తాన్ విక్రమ్ కూడా క్రిందకు దిగారు. ఇద్దరు సర్వెంట్స్ వచ్చి లోనున్న సూట్ కేసులు నెత్తికెత్తుకున్నారు.

"మీ రుండేందుకు జిలాన్ గారు గులాబీ మహల్ ఇమ్మన్నారు" అన్నాడు రాజన్ మెట్లెక్కుతూ.

"ఆయన్ను చూడలేదు. మమ్మల్ని ఇంత గొప్పగా ఆదరిస్తారని ఊహించలేకపోయాం. ఆయన్ను కలిసేలోగా, మీరు మా తరఫున మా కృతజ్ఞతలు అందజెయ్యండి" అంది ఎలీజా.

"అలాగే! మీరు ఉత్తరం వేపునుంచి వచ్చారు. ఆ వైపు మా ఎస్టేటు చూచివుంటారు. మిగిలిన వైపులా చూచే ఏర్పాటు చేస్తాను. బహుశా రేపు వీలవుతుందేమో! ఈ దినం రెస్ట్ తీసుకోండి!" అన్నాడు రాజన్.

మాటల్లోనే ఫర్లాంగు దూరం నడిచారు.

ఒక పెద్ద హాలులోకి అడుగుపెట్టారు. దాని సీలింగు ఇరవై అడుగులకు పైనే ఎత్తుగా వుంది. నేలంతా చలువ రాతితో పేర్చబడివుంది. విశాలమైన కిటికీలకు ఖరీదైన సిల్కు తెరలు వ్రేలాడుతున్నాయి. ఐదారు ఎయిర్ కండిషన్ మిషన్లు వున్నాయి. గదంతా చల్లగా వుంది. మొత్తం నాలుగు మంచాలు నాలుగు మూలలా వున్నాయి.

ఎలీజా పరీక్షగా చూడసాగింది.

"బాత్ రూంలు, లేవెట్రీలు నాలుగువైపులా వున్నాయి.

మీరు ముగ్గురూ ఇక్కడే వుంటారా? లేక ఆమెకు మరో గది ఇమ్మంటారా?" అడిగాడు రాజన్.

"అఖ్ఖర్లేదు! మేం ముగ్గురం ఇక్కడే వుంటాం!" అన్నాడు మస్తాన్.

"ఒంటరిగా వుంటే నాకూ తోచదు" అంది ఎలీజా కోముగా.

"ఇక్కడ ఇంటర్‌కామ్ ఫోన్ వుంది. అన్ని కనెక్షన్ల నెంబర్లు వున్న లిస్టుకూడా దాని ప్రక్కనే వుంది. మీకేం కావాలన్నా ఫోన్ చెయ్యండి. వెంటనే వచ్చేస్తాయి" అన్నాడు రాజన్.

"థాంక్స్!" అంది ఎలీజా.

"మీకు అరగంటలో భోజనం ఇక్కడికే వస్తుంది. తిని నిద్రపోండి. సాయంత్రం చుట్టూవున్న గార్డెన్స్ చూడండి. రాత్రికి డిన్నర్ ఇస్తున్నాము. ఈ ఎస్టేటులో వున్న ముఖ్యమయిన వ్యక్తులందర్నీ ఒక్క జిలాన్‌గార్ని తప్ప అక్కడ బహుశా కలుసుకోగలరు" అన్నాడు రాజన్.

"జిలాన్‌గారు లేరా?" అడిగాడు మస్తాన్.

"ఉన్నారు! వారికి వేరే ఎంగేజిమెంటు వుంది. రేపు ఉదయం పదింటికి మిమ్మల్ని కలుసుకుంటారు వారు. నేనొస్తాను" అంటూ శెలవు తీసుకున్నాడు రాజన్.

## 5

"వీళ్ళు మనపట్ల చూపించే శ్రద్ధాసక్తులు కాస్త అతిగా వున్నట్లు లేదూ!" అడిగింది ఎలీజా కాస్త అనుమానంగా.

"నాకూ అలానే అనిపించింది" అన్నాడు మస్తాన్.

"మన పని సక్రమంగా జరుగుతుందన్న నమ్మకం నాకు కనుపించలేదు" అంది మళ్ళా ఎలీజా,

"ఎందుకని?" అడిగాడు విక్రం.

"మనం వెలుపలికి వెళ్ళామంటే మనల్ని వెంబడించేందుకు అడవి మనుషులున్నారు. వాళ్ళకు అనుమానం కలిగిందంటే ఒక్క బాణం చాలు ప్రాణాలు పోగొట్టుకోవటానికి" అంది ఎలీజా.

"చావంటే భయపడే వాళ్ళు ఇలాంటి వ్యవహారాల్లోకి రాకూడదు. వచ్చాక పిరికిమందు ప్రక్క వాళ్ళకు నూరి పోయకూడదు. మనం ఫ్రేజర్‌కు మాటిచ్చాం. అడ్వాన్సు తీసుకున్నాం. ఇక్కడ అడుగు పెట్టాం. ఇక వెనక్కి వెళ్ళే ప్రశ్న లేదు" అన్నాడు విక్రం.

"రాత్రికి డిన్నరయ్యాక మనం కూర్చుని ఈ మందిరం ప్లాను చూచి ఆ విగ్రహం వుండే గదికి వెళ్ళే మార్గం చూద్దాం. అర్ధరాత్రి దాటాక ప్రయత్నం చేద్దాం. తెల్లారే లోగా విగ్రహం చేతికి దొరికితే ఉడాయిద్దాం."

"ఎటువేపు వెళ్దాం!" అడిగాడు మస్తాన్.

"వచ్చిన దారినే!"

"దారిపొడుగునా ఆటవికులున్నారు."

"మన కారు అద్దాలు బుల్లెట్ ప్రూఫ్‌వి. ఈ ముష్టి బాణాలు ఏంచేస్తాయి."

"ఎస్టేట్ గేటుదగ్గర మనకోసం తుపాకులతో పటాలాన్ని పెడితే ఏంచేద్దాం" అడిగాడు మస్తాన్.

"మనం అన్నిటికన్నా ముందు టెలిఫోన్ తీగలు కట్ చేసే మార్గం చూడాలి"అంది ఎలీజా.

"అది సరయిన అయిడియా" అన్నాడు విక్రం.

"మనం నోటికొచ్చినట్లు ప్రేలుతున్నాం. ఇక్కడెక్కడన్నా మైక్‌లాంటిదేదీ గోడల్లో పెట్టలేదుగా" తన అనుమానం వ్యక్తంచేశాడు మస్తాన్.

"ఇన్ని ఏర్పాట్లున్న చోట అదేం పెద్ద విషయంకాదు.

ఎందుకైనా మంచిది మనం ఏ బాత్ రూంలోనో మాట్లాడుకుందాం!" అంది ఎలీజా.

"ఇప్పుడా విషయాలు ఏమీ వద్దు! భోజనం రాగానే తిని కాసేపు పడుకుని మందిరమంతా తిరిగొద్దాం" అన్నాడు మస్తాన్.

మరో పదినిముషాల్లో రాజభోజనం వడ్డించారు ముగ్గురికీ పదిమంది సర్వర్లు.

భోజనం కాగానే ముగ్గురూ మూడు మంచాలెక్కి నిద్రపట్టించారు. బాగా అలసిపోయి వుండటంతో చాలా సేపు నిద్రపోయారు. అందరూ లేచేసరికి సాయంత్రం గంట అయిదయింది.

కిచెన్ కి ఫోన్ చేసి కాఫీ కావాలని చెప్పాడు విక్రం.

కాఫీలు త్రాగి డ్రెస్ చేసుకున్నారు ముగ్గురూ.

ఎలీజా రాజన్ కు ఫోన్ చేసి మందిరమంతా చూసేందుకు ఎవరినన్నా మనిషిని పంపమని అడిగింది.

రాజన్ పంపిన మనిషి పదినిముషాల తర్వాత వచ్చాడు. అతని వెంట ముగ్గురూ నడవసాగారు.

గులాబీ మహల్ దాటి వెలుపలికి రాగానే గాలి వేడిగా తగిలింది. అందరూ ముందున్న గార్డెన్ లోకి వెళ్ళారు. ఎన్నోరకాల చెట్లు వున్నాయి. చిన్న కారెక్కి తోటంతా అరగంటసేపు తిరిగారు. తోటమధ్య ఒక పొదరిల్లులాంటి దుంది. అదికూడా ఎయిర్ కండిషన్ చెయ్యబడి వుంది. జిలాన్ అప్పుడప్పుడూ రాత్రిపూట అక్కడ కొచ్చి వుంటాడని చెప్పాడు వెంటవున్న వ్యక్తి ఎలీజాతో.

అక్కడ్నుంచి వెలుపలికి వచ్చి మందిరంలోని అన్ని మహల్లు తిరిగారు.

ఎలీజా టైమ్ చూచింది. ఎనిమిదయింది.

"మరింక చూడదగినవి లేవా?" అడిగాడు మస్తాన్.

"జిలాన్ గారి బాజీమహల్ వుంది. అందులోకి వెళ్ళ టానికి వీలులేదు. భూగర్భంలో విలువైన వస్తువులన్నీ స్టాక్ చేసిన గది వుంది. దాన్ని చూసి వెళ్దాం" అన్నాడతను ముందుకు నడుస్తూ. ముగ్గురూ అతన్ని అనుసరించారు.

ఒక చిన్న రూంలోకి వెళ్ళారు. అక్కడ సాయుధులైన సైనికుల్లాంటి వ్యక్తులు ముగ్గురున్నారు. రాజన్ పంపిన వ్యక్తి వాళ్ళతో ఏదో చెప్పాడు రహస్యంగా. వెంటనే ఎదురుగా లావుపాటి ఇనుప తలుపులకున్న లావుపాటి తాళం కప్ప తెరచి తలుపులు బార్లా తెరిచారు. నేలలోకి మెట్లు కనుపించాయి. పట్టపగలులా మెర్క్యూరీ లైట్లు వెలుగుతున్నాయి.

అందరూ దిగి వెళ్ళారు. దాదాపు రెండువందల మెట్లు దిగారు. అక్కడో విశాలమైన హాలు వుంది. అందులో చల్లగా గాలి వస్తోంది. అక్కడో నలుగురు కాపలా వాళ్ళున్నారు.

రాజన్ పంపిన వ్యక్తిని చూడగానే వంగి వంగి సలాములు చేశారు. ఇత్తడి రేకుతో కప్పివున్న విశాలమైన పెద్ద తలుపులకున్న తాళాన్ని తెరిచారు. అందరూ లోనికి ప్రవేశించారు. మూడువందల అడుగుల పొడవు యాభై అడుగుల వెడల్పు వున్న పెద్ద హాల్లో రకరకాల వస్తువులు వరుసగా పేర్చివున్నాయి.

అక్కడున్న వస్తువుల్లో చాలావరకు భంజ్ దేవ్ ల వంశంలోనుండి వచ్చిన చారిత్రాత్మకమైన వస్తువులు. మిగిలినవి జిలాన్ సేకరించినవి.

మూడు అడుగుల ఎత్తున్న శ్రీకృష్ణుని విగ్రహం ముందు నిలుచుని దాన్నిగురించి చెప్పసాగాడు రాజన్ పంపిన వ్యక్తి. ముగ్గురూ దాన్ని చూచి, వెంటనే ఒకర్నొకరు కళ్ళతోనే పలకరించుకున్నారు.

"ఇంత విలువైన వస్తువుల్ని ఇక్కడ పెట్టారు. ఎవరైనా కన్నం వేస్తే!" అడిగాడు మస్తాన్.

"ఇంపాజిబుల్. ఈ హాలు గోడలు ఒక గజం వెడల్పున్న రాళ్ళతో కట్టింది. ముందువైపునుండి రావడం అసాధ్యం. ఈ గదికి వెలుపలవేసేది టైమ్ లాక్. అది కంట్రోలుచేసే స్విచ్‌లు జిలాన్ గారి గదిలో వున్నాయి. ఆయనకు తెలీకుండా ఈ తలుపులు తెరచుకోవు" అన్నాడు అతను.

"ఇప్పుడెలా తెరుచుకుంది" అడిగాడు విక్రం.

"సెక్యూరిటీనుండి ఫోన్ చేశాం. జిలాన్ గారు తెర చారు మీకోసం!" అన్నాడు అతను మళ్ళీ.

అందరూ వెలుపలకు వచ్చారు.

మూడులక్షలు కాదు. ముప్ఫయిలక్షలిచ్చినా ఫ్రేజర్ చెప్పినపని సాధించడం అసంభవ మనిపించింది ఎలీజాకు.

వచ్చిన దోవనే అందరూ తిరిగి వెలుపలి కొచ్చారు.

"రాత్రిళ్ళు కూడా ఇంత మంది కాపలా కాస్తుం టారా?" అడిగాడు విక్రం.

"ఉండరు. క్రింద ఇద్దరుంటారు. పైన ఒక అతను వుంటాడు. అంటే ఇక్కడికెవ్వరూ రారన్న నమ్మకంతో ఈమధ్యనే సగంమందిని తీసేశారు" అన్నాడు అతను.

"వాళ్ళు లేకున్నా ఫర్వాలేదు" అన్నాడు మస్తాన్.

"అలాగని మనకు అనిపించి ప్రయోజనంలేదు. జిలాన్ గారి కనిపించాలి" అన్నాడు అతను.

మస్తాన్ ముతాను గులాబీమహల్లో వదిలేసి అతను వెళ్ళి పోయాడు.

## 6

ముగ్గురూ బాత్‌రూంలోకి చేరారు.

"ఎలీజా! ఎలాగుంది వీళ్ళ సెక్యూరిటీ ఏర్పాటు?"

"అఖండంగా వుంది. మనం మర్యాదగా వెళ్ళిపోవడం మంచిదేమో!"

"అదే నాకూ అనిపిస్తూంది. మనం పట్టుబడ నవసరం లేదు. ఏమాత్రం అనుమానం మనమీద కలిగినా చంపి పారేస్తారు" అన్నాడు మస్తాన్.

"మనం ఎందుకొచ్చిందీ ఈ ఎస్టేటులో వున్న ప్రతి ఒక్కరికి తెలిసినట్లుంది" అన్నాడు విక్రం.

"ఎందుకని అలా అనుమానిస్తున్నావ్?"

"మనం ఫోన్‌లో అడగగానే రమ్మన్నారిక్కడకు. అసలు యజమానిని మనం ఇంతవరకు చూడలేదు. మనం అడగకుండానే వాళ్ళే అన్నీ చూపిస్తున్నారు. ఎన్నో దొంగిలించి తెచ్చిన వస్తువులు దాచివుంచిన భూగర్భం లోని గదిని చూచే అవకాశంకూడా మనకు కల్పించాడు జిలాన్ స్వయంగా. మనవెంట వచ్చినతను ఏ వస్తువు గురించీ వివరించి చెప్పలేదు. కానీ ఆ విగ్రహం గురించి వివరంగా చెప్పాడు. ఎందుకు?" అడిగింది ఎలీజా.

"అవును. ఆమె చెప్తుంటే నాకూ అర్థమవుతూంది. కానీ మనం ఎందుకొస్తున్నదీ వాళ్ళకు తెలిసే అవకాశం ఎలా వుంటుంది."

"ఆరులక్ష లిస్తామని మనల్ని ఫ్రేజర్ పంపగా లేనిదీ, యింకంత ఖర్చుపెట్టి ఎవరెవరు తనతో తలపడుతున్నారో తెలుసుకోవడం జిలాన్‌కు పెద్దకష్ట మనుకోను. ఇలాంటి వ్యవహారాల్లో మామూలుగా సౌఖ్యం చేసుకునే మనుషు లెవరోకూడా జిలాన్‌కు తెలిసి వుంటుంది. అందువల్ల ముందునుండే వాళ్ళపైన గూఢచారుల్ని నియమించి వుంటాడు" అంది ఎలీజా.

"ఇప్పుడు నాకు గుర్తొస్తూంది. ఫ్రేజర్ దగ్గిర సెక్రెట రీగా పనిచేసిన మంజుల ఆత్మహత్య చేసుకుంది. ఆమె

ద్వారానే వీళ్లు మన రహస్యాలను రాబట్టి వుంటారు" అన్నాడు మస్తాన్.

"కానీ మంజుల చాలా నమ్మకస్తురాలు. నాలుగేళ్ళ నుండి ఫ్రేజర్ దగ్గర పని చేస్తూంది" అంది ఎలీజా.

"ముందుముందు అన్నీ బయటపడతాయి. ఇకపైన మన ప్రయత్నాలు చాలా జాగ్రత్తగా చెయ్యాలి. మనం ఎందుకొచ్చిందీ, ఎవరమైందీ వాళ్లకు తెలుసునన్న విషయం గుర్తుంచుకొని మనముందు కార్యక్రమం నిర్ణయించుకోవాలి!" అన్నాడు మస్తాన్.

ముగ్గురూ వెలుపలికొచ్చారు బాత్ రూంలోంచి.

గంట తొమ్మిది దాటడంతో మళ్ళీ స్నానాలు చేసి డ్రెస్ చేసుకున్నారు డిన్నర్ కు వెళ్లేందుకు.

సరిగ్గా పదింటికి మనిషి వచ్చాడు. అతని వెంట ముగ్గురు వెళ్లారు.

ఎలీజా తెల్లటి సిల్కు గౌన్ తొడుక్కుంది. తెల్ల చెప్పులు వేసుకుంది. తెల్ల ప్లాస్టిక్ కమ్మలు పెదవి పెట్టుకుంది. మస్తాన్, విక్రం ఇద్దరూ డిన్నర్ సూట్లు తొడుక్కున్నారు.

టేబుల్ దగ్గర రాజన్ తో పాటు మరో ఆరుమంది కనిపించారు. అందర్నీ పేరు పేరునా పరిచయం చేశాడు రాజన్.

సినిమాల గురించి, లాభనష్టాల గురించి, సినిమాతారల అవినీతి జీవితాల గురించి చర్చలు చేసుకుంటూ, తింటూ కూర్చున్నారు. డిన్నర్ ముగిసేసరికి గంట ఒకటయింది.

ముగ్గురూ గులాబీమహల్ కు తిరిగొచ్చారు.

బట్టలు మార్చుకున్నారు.

మళ్ళీ బాత్ రూం చేరుకున్నారు.

"ఈ రాత్రికే మనపని ముగించుకోవాలి!" అన్నాడు విక్రం.

"ఏంచేద్దాం?" అడిగాడు మస్తాన్.

"మనిద్దరం ఆ భూగర్భంలోని గదికి వెళ్దాం. మెయిన్ డోర్‌కున్న టైమ్‌లాక్ కంట్రోలు జిలాన్ గదిలో వున్నాయన్నారు. ప్రేజర్ చెప్పిందాన్నిబట్టి జిలాన్‌కు ఆడవాళ్ళంటే బలహీనత వుంది. ఎలీజా అతనిగదికి వెళుతుంది. అతన్ని మభ్యపెట్టి ఎలాగైనా లాక్ తెరిపిస్తుంది, తక్షణ మనపని పూర్తిచేసుకుందాం. వచ్చేద్దాం!" అన్నాడు విక్రం.

"అతని గదికి ఏ సాకుతో వెళ్ళాలి?" అడిగింది ఎలీజా.

"కాస్త బట్టలు చింపుకొని పరుగెత్తివెళ్ళు. అత నడిగితే మేమిద్దరం తప్పత్రాగి పైనబడి మానభంగం చెయ్యబోయామని, మమ్మల్ని తప్పుకునేందుకు పారిపోయి వచ్చానని చెప్పు" అన్నాడు మస్తాన్.

"కరెక్ట్! అలాగే చెప్పు. నేచురల్‌గా కనిపించేందుకు కావాలంటే నేనే నిన్ను మానభంగంచేసి మరీ పంపుతాను" అన్నాడు విక్రం.

"షటప్!" అంది ఎలీజా.

"అతను మిమ్మల్ని పట్టుకురమ్మని మనుషుల్ని పంపితే?"

"అలా జరగకుండా నువ్వే చూచుకోవాలి! త్రాగిన మైకంలో వాళ్ళు అలా ప్రవర్తించారనీ, వాళ్ళతో వైరం పెట్టుకుంటే హీరోయిన్ ఛాన్సు పోతుందని చెప్పు. అంతటితో అతను నిన్ను తనగదిలో వుండమంటాడు. అతన్ని మాటల్లోకి దింపి, ఆ టైమ్‌లాక్ తెరిచేటట్లు చూడు. ఈ లోగా మేము అతలుపుల దగ్గరకు చేరుతాం!" అన్నాడు మస్తాన్.

"అంతే! అంతకన్నా మరో మార్గంలేదు" అన్నాడు విక్రం.

పదినిముషాల తర్వాత వాళ్లు ప్లాను అమలు జరపడం ప్రారంభించారు. ఎలీజా, రాజమహల్ వైపు వెళ్ళిపోయింది పరుగెత్తుకుంటూ. మధ్యలో ఎవ్వరూ ఆమెకు తారస పడలేదు.

మస్తాన్, విక్రం రివాల్వర్లు తీసుకుని చీకటిచాటున గోడల వెంబడిగా ఎవరికళ్లల్లో పడకుండా విగ్రహంకోసం వెళ్లారు.

ముందుగదిలో ఇద్దరు పహారాకాస్తున్నారు. వాళ్లల్లో ఒకడు తూగుతున్నాడు. రెండోవాడు అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. మస్తాన్, విక్రం ఒక్కసారిగా వాళ్లపైనపడ్డారు. గొంతులు గట్టిగా నులమటంతో ఇద్దరికీ స్పృహపోయింది. వాళ్ల జేబులో వెతికి తాళాలుతీసి, తలుపులు తెరచాడు విక్రం. మెట్లనిండా చీకటిగా వుంది.

"లైటు ఎక్కడో వుంటుంది వేద్దామా?" అడిగాడు విక్రం.

"వద్దు! చీకటిలో వెళ్లడమే మంచిది!" చెప్పాడు మస్తాన్.

ఇద్దరూ చెరోవైపు గోడను పట్టుకుని మెల్లగా మెట్లు దిగసాగారు. పదినిమిషాలు పట్టింది, మొత్తం మెట్లన్నీ దాటేందుకు. క్రింద గదిలో సన్నటి లైటు వెలుగుంది. అక్కడకూడా ఇద్దరే వున్నారు కాపలావాళ్లు. వాళ్ళిద్దరూ హాయిగా నిద్రపోతున్నారు. విక్రం జేబులోంచి క్లోరో ఫామ్‌సీసా తీసి వాసన చూపించాడు. ఇద్దరూ స్పృహ లేనట్లు చేతులు వ్రేలాడవేసి పడుకున్నారు.

విక్రమ్ వెళ్ళి తాళం పరీక్షచేసి చూశాడు. దాదాపు రెండుకిలోల బరువుంది. పిస్టల్‌తో పేల్చినా తెరుచు కునేట్లుగా లేదు. ఎలీజా వెళ్ళినపని ఇంకా సక్సెస్ కాలేదు

అన్న విషయం వాళ్ళిద్దరికీ ఆ తాళం చూస్తుంటే తెలుస్తోంది.

ఐదునిముషాలు వెయిట్ చేశారు.

తాళం తెరుచుకోలేదు.

మరో పదినిముషాలు వెయిట్ చేశారు.

అప్పటికీ తాళం తెరచుకోలేదు.

"ఎలీజా బుట్టలో జిలాన్ పడ్డట్టులేదు!" అన్నాడు మస్తాన్.

"ఇంకేదైనా మార్గం చూడాలి! ఇందాకా వచ్చాక ఉత్త చేతులతో తిరిగి వెళ్ళడం నాకు నచ్చదు" అన్నాడు విక్రం.

అంతలోనే క్లిక్ మని చప్పుడయింది. తాళం తెరచుకుంది. కప్పతీసి దూరంగా విసిరేశాడు మస్తాన్. తలుపులు తెరచుకొని ఇద్దరూ లోనికి వెళ్ళారు. పెన్ టార్చి వెలిగించుకొని చకచక నడిచారు. విగ్రహం వుండవలసిన చోట అదిలేదు. గదంతా గాలించారు. కనుపించలేదు.

"విగ్రహం ఎక్కడాలేదు" అన్నాడు మస్తాన్.

"ఏమయి వుంటుంది. ఇంతకన్నా సురక్షితమైన ప్రదేశానికి దాన్ని తరలించి వుంటారా?" అడిగాడు విక్రం.

"ఇక్కడుండి లాభంలేదు, పద వెళ్దాం" అన్నాడు మస్తాన్.

విక్రంకూడా వెంటవచ్చాడు. తిరిగి వచ్చేసరికి మెయిన్ డోర్ మూసుకుపోయి వుంది.

"ఎలా జరిగిందిది?"

"విగ్రహం ఇక్కడ లేదన్నప్పుడే నాకు మనం ట్రాప్ లో పడ్డట్టు అనుమానమేసింది. మనం వాళ్ళ చేతులలో క్రూరంగా హింసింపబడి చావడంకన్నా రివాల్వ

రుతో కాల్చుకుని చావడం మంచిదేమో?" అన్నాడు మస్తాన్.

"నో! చచ్చేవరకు బ్రతకటానికి పోరాడడం నాకిష్టం. నలుగుర్ని చంపిచస్తే నాకు సంతోషం" అన్నాడు విక్రం.

"ఇప్పుడేం చేద్దాం!"

"వాళ్ళొచ్చి వెలుపలకి తీసుకెళ్ళిందాకా హాయిగా ఇక్కడే పడుకుందాం."

ఇద్దరూ అక్కడే నేలమీదే పడుకున్నారు.

## 7

ఎలీజా జాజిమహల్ వైపు పరుగెత్తికెళ్ళింది. కాపలా మనిషి ఆమెను పట్టుకుని "ఏమయిందని" అడిగాడు.

ముందుగా ఆలోచించుకున్నట్టే తన్ను రేప్ చెయ్యబోతే తప్పించుకొచ్చాననీ, ఈ రాత్రికి జిలాన్ గారి గదిలో వుందామనుకుంటున్నాననీ చెప్పింది. అతను లోనికివెళ్ళి రెండునిముషాల్లో తిరిగొచ్చి ఎలీజాను లోనికి తీసుకెళ్ళాడు.

సింహాసనంలాంటి ఎత్తయిన పెద్దకుర్చీలో కూర్చుని వున్నాడు జిలాన్. ఎర్రటి సిల్కుపైజామా, లాల్చీ వేసుకుని వున్నాడు. నుదుట ఎర్రటిబొట్టు వుంది. అతనికి కొంత దూరంలో పెద్ద ఎత్తైన మంచం వుంది. దానిప్రక్కనే గోడంతా అద్దంగా వుంది.

గదినిండా గులాబీ ముక్కలున్నాయి.

జిలాన్ నోట్లో సిగరెట్ కాలుతూంది.

ఎలీజాను చూడగానే రమ్మన్నట్లు చెయ్యి ఊపాడు. ఎలీజా వెళ్ళి దూరంగా నిలబడింది.

"మా దర్వాను చెప్పాడు. నిజమేనా?" అడిగాడు గంభీరంగా.

అవుననన్నట్లు తలూపింది.

"ఇలావచ్చి కూర్చో! ఇక్కడకు వాళ్ళు రాలేరు. వచ్చినా నిన్నేంచెయ్యలేరు!" అన్నాడు జిలాన్.

"థాంక్స్! అందుకే ఇటు పరుగెత్తాను."

"నువ్వు ఇంతవరకూ అనాఘ్రాత పుష్పానివా?"

తలూపింది అవుననన్నట్లు.

"యూ ఆర్ బ్యూటిఫుల్. అందమైన వస్తువులన్నా, పూలన్నా, ఆడవాళ్ళన్నా నాకు చాలా ఇష్టం. అందుకే నువ్వంటేకూడా ఇష్టంగా వుంది" అన్నాడు జిలాన్.

"థాంక్స్!"

"సినిమాతారవైతే ఏమాత్రం సంపాదిస్తావ్?"

"అదృష్టాన్నిబట్టి వుంటుంది."

"ఏకష్టం లేకుండా, సంవత్సరానికి నీ ఖర్చులన్నీ భరించి ఐదులక్షలు ఇస్తాను. నా ఎస్టేటులో వుంటావా?" అడిగాడు జిలాన్ ముందుకువంగి.

"ఆలోచించుకుని చెపుతాను" అంది ఎలీజా.

"నాకు నిద్రవస్తోంది" అంటూ కుర్చీపైనున్న ఒక బటన్ నొక్కాడు. మంచంప్రక్కనున్న పెద్దఅద్దం జరిగి గోడలోకి వెళ్ళిపోయింది. దాని స్థానంలో పెద్దకిటికీ వచ్చింది. వెన్నెల అంగులోంచి మంచంపైన పడసాగింది.

"నువ్వుకూడ ఇక్కడే పడుకో! ఈ గదిలో మరో మంచం లేదు. ఉన్నదొక్క మంచమే అయినా చాలా విశాలమైందది. చెరోప్రక్క పడుకుందాం. నీ యిష్టం లేకుండా నిన్నేకాదు, మరెవర్నయినా తాకే నీచత్వం జిలాన్ వంశంలో లేదు" అన్నాడు నవ్వుతూ.

"అన్నీ ఆటోమేటిక్ స్విచ్‌లు పెట్టుకున్నారే!" అడిగింది కుతూహలంగా.

"అవును నాగదిలో నాపనులు చేసేందుకు యెవ్వరూ

వుండడం అనవసరం. అందుకే అంతా అలా ఏర్పాటు చేసు కున్నాను" అంటూ తను కూర్చున్న కుర్చీపైనున్న ఆరు స్విచ్ లు నొక్కితే ఏం జరిగేది చెప్పాడు. అన్నింటికన్నా క్రిందున్న స్విచ్ నేలమాళిగలో వున్న గదితాళం కంట్రోలు చేసేదని తెలుసుకుంది ఎలీజా.

జిలాన్ లేచి బాత్ రూం వైపు వెళ్ళాడు. అతను తలుపు మూసుకున్నాక తక్కున వెళ్ళి స్విచ్ నొక్కింది. గుట్టుగా వచ్చి కూర్చుంది.

బాత్ రూం లోపలున్న తలుపుసందునుండి గమనిస్తున్న జిలాన్ అక్కణ్నుంచి రాజన్ కు ఫోన్ చేశాడు. వాష్ చేసుకుని వెలుపలకొచ్చి కుర్చీలో కూర్చున్నాడు. ఎలీజాతో పిచ్చాపాటీ మాట్లాడుతూనే స్విచ్ నొక్కేశాడు. ఆతర్వాత ఇద్దరూ వెళ్ళి మంచంమీద పడుకున్నారు.

ఎలీజాకు సంతోషంగా వుంది. తనకు అప్పగించిన పని తెలివిగా తను చేసినందుకు గర్వంగా కూడా వుంది. మెత్తటి పట్టుపరుపుల స్పర్శకు శరీరం మత్తుగా నిద్రలోకి తూలిపోయింది.

## 8

తెల్లారాక జిలాన్ కన్నా ముందుగాలేచి గులాబీమహల్ కు వెళ్ళిపోయింది ఎలీజా. అక్కడ మస్తాన్, విక్రం యెవ్వరూ కనుపించలేదు. నిద్రలేచి ఎక్కడైనా వెళ్ళివుంటారేమో ననుకుంది. రాత్రి విగ్రహం చేతికి చిక్కాక తన్ను కలుసుకోకుండా దాన్ని తీసుకుని చెక్కేశారేమోనన్న అనుమానంకూడా కలిగింది ఆమెకు. ఏం చెయ్యాలో తోచక మౌనంగా కూర్చుంది.

ఆ రాత్రంతా జిలాన్ తోనే పడుకున్నా, అతను ఆమెపైన కనీసం చెయ్యికూడా వెయ్యలేదు. ఆమెకది ఎంతో

ఆశ్చర్యాన్ని కలిగించింది. జిలాన్ పైన ఒకవిధమైన గౌర వముకూడా కలిగింది.

గంటా, రెండుగంటలు గడచిపోయాయి. వాళ్ళిద్దరి జాడలేదు. ఎలీజాకు ధైర్యం సన్నగిల్లింది. భయం ముంచు కొచ్చింది.

కిచెన్ నుంచి కాఫీ, టిఫీను వచ్చాయి. మొత్తం ముగ్గు రికి రావలసింది ఒక్కమనిషికే వచ్చాయి.

రాజన్ కు ఫోన్ చేసి రాత్రి తను జిలాన్ గదిలో వుండి పోయానని, ప్రొద్దున్నే గదికివచ్చి చూస్తే తన ఫ్రెండ్స్ ఇద్దరూ కనుపించడంలేదనీ, వారెక్కడకు పోయింది అర్థంకాలేదని చెప్పింది. అతను ఆమెను కంగారుపడవద్దని చెప్పాడు. తనువచ్చి చూస్తానన్నాడు.

కాఫీత్రాగి కాలకృత్యాలు ముగించుకొంది ఎలీజా.

వాళ్ళిద్దరూ తోటలోకి వెళ్ళివుంటారని చెప్పి ఆమెను వూరడించాడు.

పదిగంటల ప్రాంతంలో ఆమెను వెంటబెట్టుకొని జిలాన్ గదికి వెళ్ళాడు. అప్పటికి జిలాన్ ఒక్కడే కుర్చీలో ఆసీనుడై వున్నాడు. మరో నాలుగు కుర్చీలుకొద్ది దూరంలో వేసివున్నాయి.

రాజన్, ఎలీజా కూర్చున్నారు.

ఫోన్ లో యెవరితోనో మాట్లాడాడు.

ఐదునిముషాల తర్వాత మస్తాన్, విక్రం ఇద్దరూ చేతు లకు అరదండాలు తగిలించుకొని వచ్చారు. వాళ్ళ వెంట ఇద్దరు సిపాయిలున్నారు. వాళ్ళిద్దర్ని కూడా కూర్చోమని "డియర్ ఫ్రెండ్స్!" అని గొంతు సవరించుకున్నాడు జిలాన్. "నా ఎస్టేటులోకివచ్చి, నా మందిరంలోంచి ఖరీ దైన బంగారు కృష్ణుడి విగ్రహాన్ని దొంగిలించేందుకు పెద్ద పథకం వేసుకొని వచ్చారు మీ ముగ్గురూ. మిమ్మల్ని

పంపిన ఫ్రేజర్ మీకు కావలసిన అన్ని సమాచారాలు అందించాడు. నా పాలెస్ రహస్యాలు అతని కెలా చిక్కాయో అర్థంకాలేదు. ఆలోచించి చూపీ తీశాను. మంజుల ఫ్రేజర్ సెక్రటరీ.ఆమె చెల్లెలు నీలారాణి. ఆమే నమ్మకద్రోహం చేసింది. ఆమె కిప్పుడే శిక్ష విధించబడు తుంది. మీరు దొంగిలించాలనుకున్న విగ్రహం చూస్తారా?" అంటూ ప్రక్కనే టీపాయిపైనవున్న విగ్రహంపైనున్న సిల్కుగుడ్డ తొలగించాడు.

మస్తాన్, విక్రం, దాన్ని చూసి అవాక్కయిపోయారు.

"ఎలీజా రాత్రి చాలా బాగా నాటకమాడింది. మీ రిద్దరుకూడా తెలివిగా భూగృహం చేరారు. కానీ మీ ప్లాను మొత్తం నాకు వారం దినాలముందే తెలుసు. అవ సరమైన అన్ని జాగ్రత్తలు తీసుకొన్నాను" అంటూ చప్పట్లుకొట్టాడు. ఇద్దరు కాపలా వ్యక్తులు వచ్చి వంగి సలాం చేశారు.

"నీలాదేవి!" అన్నాడు.

మరో రెండు నిముషాల్లో నీలాదేవి వచ్చింది.

"నీలా! నువ్వు నమ్మకద్రోహం చేశావ్. డబ్బుచూసి గాదు.నీ చెల్లెలి ఉద్యోగం ఫ్రేజర్ తీసేయకుండా వుండేం దుకు. నీలాంటివాళ్ళు నాకు అవసరంలేదు. ఈమెను మొసళ్ళ గుంటలో పడెయ్యండి" అన్నాడు జిలాన్.

"వద్దు! నన్ను కాల్చిచంపండి. లేదా కత్తితో పొడ వండి. ఆ మొసళ్ళ గుంటలోమాత్రం తొయ్యవద్దు" అంది నీల వెక్కిళ్ళు పెడుతూ.

"ఎటువంటి నేరానికి యెటువంటి శిక్ష వెయ్యాలో చెప్పేది నువ్వుకాదు. టేక్ హర్ అవే!" అరిచాడు జిలాన్.

నీలను ఇద్దరు వ్యక్తులు బలవంతంగా లాక్కువెళ్లారు.

"ఇక మీ విషయం! మీ ధైర్యసాహసాలు, తెలివి తేటలు నన్ను నిజంగా ఆకట్టుకొన్నాయి. ఈ విగ్రహం మీ కిస్తున్నాను. మీకారు, ఆయుధాలు నేను స్వాధీనం చేసుకొన్నాను. మా ఎస్టేటు ప్లాను మీ దగ్గరుంది. మీరు ముగ్గురూ కాలినడకన యెటువేపైనాసరే తప్పించుకు వెళ్ళండి. నేను అడ్డుపెట్టను. మీరు బయలుదేరిన మూడు గంటలకు, మిమ్మల్ని వేటాడమని నా మనుషులకు ఉత్తరు విస్తాను. ఆ తర్వాత మీ అదృష్టం బాగుంటే తప్పించు కుంటారు. లేదా నా మనుషుల చేతుల్లో చస్తారు" అన్నాడు జిలాన్. ముగ్గురి కళ్ళల్లో ఏదో ఆశారేఖ పొడ చూపింది.

"దటీజ్ రియలీ స్పోర్టివ్" అన్నాడు రాజన్.

"కానీ మమ్మల్ని నిరాయుధుల్ని చేసి పంపి లాభంలేదు. మాకు రెండు రివాల్వర్లు, కొంత అమ్యూనిషన్ ఇవ్వాలి" అన్నాడు విక్రమ్.

"అలాగే ఇస్తాను" అన్నాడు జిలాన్.

"అయితే మేము ఎన్ని గంటలకు బయలుదేరాలి!" అడిగాడు మస్తాన్.

"సరిగ్గా పదకొండు గంటలకు బయలుదేరండి. నా మనుషులకు మూడుగంటలు టైమిస్తాను" అంటూ మధ్యాహ్నం రెండింటినుండి మీపైన వేట ప్రారంభమవుతుంది. మీరు ఏవైపునుండి పోయేదీ నాకు చెప్పనవసరం లేదు. మీ ఇష్టమొచ్చిన దిక్కులో వెళ్ళండి. ఇదిమిమ్మల్ని జాలిదలచి వదలడంకాదు. నా మనుషుల శక్తి సామర్థ్యాలకు పరీక్ష!" అన్నాడు జిలాన్.

ముగ్గురకీ అతని ఉద్దేశమేమిటో అర్థమైంది.

"మీరు ప్రాణాలతో నా మనుషులకు పట్టుబడితే బ్రతికినంతకాలం నాకు బానిసలుగా వుండాలి" తిరిగి

చెప్పాడు జిలాన్.

"అలాగే!" అన్నాడు విక్రమ్.

"మీ మనుషులకు మమ్మల్ని చంపవద్దని ఆదేశాలు ఇచ్చారా?"

"లేదు!"

"అయితే ప్రాణాలతో మీకు చిక్కం" అన్నాడు మస్తాన్.

"ఎందుకని?" అడిగాడు జిలాన్.

"మీ వాళ్ళ కళ్ళబడితే చంపుతారు."

"అదంతా మీ అదృష్టం. ఇక మీరు వెళ్ళవచ్చు" అన్నాడు జిలాన్.

మస్తాన్, విక్రంల చేతులకున్న అరదండాలు తొలగించబడ్డాయి. ముగ్గురూ గదిలోంచి వెళ్ళిపోయారు విగ్రహంతో.

"సార్! వాళ్ళు నిజంగా తప్పించుకుంటే" తన అనుమానం వ్యక్తంచేశాడు రాజన్.

"ఇంపాజిబుల్! అన్ని ఏర్పాట్లు చేసే వుంచాను. మన మనుషుల్ని తప్పించుకొని వాళ్ళు నిజంగా వెళ్ళగలిగితే, వాళ్ళకు బహుమానంగా ఆ విగ్రహాన్ని మనం ఇచ్చెయ్యవచ్చు. దానిని తిరిగి మనం సంపాదించుకోవడం ఎంత కాలమో పట్టదు" అన్నాడు జిలాన్.

రాజన్ లేచి వెళ్ళిపోయాడు.

# 9

గులాబీమహల్లో ముగ్గురూ కూర్చున్నారు.

"మనం ప్రాణాలతో బయటపడడం కష్టం!" అంది ఎలీజా.

"అలా దిగులుపడి లాభంలేదు. మనకు మూడుగంటలు

స్వతంత్రం వుంది. ఈలోగా వాళ్ళకు చిక్కకుండా వుండగలిగితే తప్పించుకోవచ్చు" అన్నాడు మస్తాన్.

"మనకు కారు ఇవ్వనన్నాడు. నడకమీద వచ్చిన దోవన వెళ్ళామంటే ఆ ఆటవికుల చేతుల్లో పడతాం. అందువల్ల ఉత్తరం వేపు లాభంలేదు" అన్నాడు విక్రం.

"తూర్పువేపు కొండలున్నాయి. వాటిని యెక్కడం మనవల్ల కాదు. దక్షిణాన అడవిలో యేటు పోతామో మనకే తెలీదు. కాబట్టి పడమర వేపునే వెళ్దాం. ఎలాగో తంటాలుపడి నది దాటగలిగితే సురక్షితంగా మనం ఎస్టేటు నుండి తప్పించుకోగలుగుతాం!" అన్నాడు మస్తాన్.

"అదే బాగుంది!" అన్నాడు విక్రం.

అందరూ పడమర వేపుగా నడచి వెళ్ళేందుకు నిశ్చయించుకొన్నారు.

సరిగ్గా పదకొండుగంటలకు విగ్రహం మోసుకుని పాలెస్ వెలుపలికొచ్చారు. వాళ్ళను ఎవ్వరూ పట్టించుకోలేదు. వెనుకవేపు నడిచారు.

త్రోవలో పెద్ద కోనేరు కనుపించింది. ఎండలో నీళ్ళు మెరుస్తున్నాయి. అక్కడ బోర్డుచదివి అదే మొసళ్ళ గుంటని తెలుసుకొన్నారు. నీలారాణి గుర్తుకొచ్చింది. ఆమె అక్కడే చనిపోయి వుండాలనుకున్నారు.

కాలిబాటనబడి నడవసాగారు. చిన్న చిన్న తుప్పలు, ముళ్ళచెట్లు, తప్ప యెత్తైన చెట్లేమీ లేవు. ఎండ మండిపోతోంది. విగ్రహం బరువుగా వుండడంతో దాన్ని మొయ్యలేక విక్రమ్ నడక కుంటుపడింది. అతన్ని అనుసరించే ఎలీజా మస్తాన్‌లుకూడా మెల్లగా నడవసాగారు.

మస్తాన్ వాచీ చూశాడు. ఒకటయింది. అంటే తాము బయలుదేరి అప్పుడే రెండుగంటలయింది. దాదాపు పది కిలోమీటర్ల దూరమన్నా వచ్చివుండాలి. నడక కాస్త

మెల్లగావుంది గాబట్టి ఎనిమిది కిలోమీటర్ల దూరమన్నా వచ్చివుండాలనిపించింది.

ఇంకో గంటలో తమపైన వేట ప్రారంభమవుతుంది. ఆలోగా ఏదైనా సురక్షిత ప్రాంతానికి చేరగలగాలి.

ముగ్గురూ విగ్రహాన్ని మార్చి మార్చి మోసుకుపోసాగారు.

మరో మూడు కిలోమీటర్లు ముందుకు వెళ్ళారు.

విక్రం గంట చూసుకున్నాడు. రెండుగంటలా ఐదు నిముషాలయింది.

"మనల్ని వేటాడడం ప్రారంభమై అయిదునిముషాలయివుంటుంది" అన్నాడు మస్తాన్ తన వాచీ చూసుకుని.

"అవును. ఇంక మనం చాలా జాగ్రత్తగా వుండాలి" అంది ఎలీజా.

"ఈ విగ్రహం చాలా బరువుగావుంది. దీనివల్ల మనం కాస్త వెనుకబడ్డాం!" అన్నాడు విక్రం కోపంగా.

ముగ్గురూ పొదలలోంచి తప్పుకొంటూ నడుస్తూనే వున్నారు.

"మనల్ని ఎలా వేటాడుతారు?" అడిగింది ఎలీజా.

"ఆ ఆటవికుల్ని గుర్రాలపైన పంపుతారనుకుంటాను. అయినా మనం ఏవైపు వెళ్ళింది వాళ్ళకెలా తెలుస్తుంది" అడిగాడు మస్తాన్.

"మనల్ని వాళ్ళు గమనించే వుండివుంటారు!" అన్నాడు విక్రమ్.

అలాగే పొదలల్లోపడి, ముళ్ళను తప్పుకొంటూ, మరో రెండు కిలోమీటర్లు నడిచారు ముగ్గురూ. గంట రెండూ నలభై అయిదు అయింది.

దూరంగా ఎక్కడో "ఝాఝా" మంటూ కుక్కల

అరుపులు వినిపించాయి. ముగ్గురూ వెనక్కి చూశారు. యెక్కడా ఏమీ కనుపించలేదు. ఇంకొంచెం ముందుకు నడిచారు. కుక్కల అరుపులు దగ్గరయినాయి.

"మన వెనుక ఏవో కుక్కలు అరుస్తున్నాయి" భయంగా చెప్పింది ఎలీజా.

"కొంపదీసి జిలాన్ మనపైకి కుక్కల్ని తరుమలేదు గదా?" అంటూ వెనక్కి చూశాడు మస్తాన్. నల్లటి కుక్కలు మూడు, పొదలపైనుండి దూకుతూ రావడం గమనించింది ఎలీజా.

"బాబోయ్ వేటకుక్కలవి. మనం చిక్కితే చీల్చుకు తింటాయి" అరిచింది ఎలీజా.

విక్రం చక్కున నేలమీద బోర్లాపడుకొని రివాల్వరు తీశాడు. మస్తాన్ కూడా రివాల్వరు చేతికి తీసుకున్నాడు.

ఎలీజా కంగారుగా ముళ్ళలోపడి ముందుకు పరుగెత్తసాగింది. ఎడంకాలి చెప్పు జారిపోయింది. దాన్ని తీసుకొనే ప్రయత్నంకూడా చెయ్యకుండా ముందుకురికింది. ముళ్ళు గ్రుచ్చుకొన్నాయి. లెఖ్ఖ చెయ్యకుండా పిచ్చిపట్టినట్లు పరుగెత్తసాగింది ఎలీజా.

విక్రం రివాల్వరు ప్రేల్చాడు. ఒక కుక్క గాలిలోకి యెగిరి క్రిందపడిపోయింది. మళ్ళీ ప్రేల్చాడు. రెండో కుక్క కాలు తెగింది. మూడోది భయపడి తప్పించుకొని ఎలీజా వెళ్ళినవైపు పరుగెత్తింది. విక్రం, మస్తాన్ లేచి దానివైపు పరుగెత్తారు. వాళ్ళు చేరేలోగా ఎలీజాను క్రిందతోసి గుడ్డలన్నీ పళ్ళతో పట్టి పీకింది. ఎలీజా కాళ్ళతో, చేతులతో తన్నుకొంది.

విక్రం దగ్గరకంటూ వెళ్ళాడు. మస్తాన్ చేతిలోవున్న విగ్రహం కుక్కపైకి బలంగా విసిరాడు. అది కుక్కకు తగల్లేదు. వెళ్ళి ఎలీజా కాళ్ళపైన పడింది. ఆమె అమ్మో

అని పెద్దగా అరచింది. కుడికాలి యెముక విరిగినట్లనిపించింది ఆమెకు. కుక్క దూరంగా పరుగెత్తింది. మరో రెండుసార్లు ప్రేల్చాడు విక్రం. గుండ్లకు అందకుండా పోయింది కుక్క.

"ఏమయింది?" క్రిందకూర్చుని ఆమెపైకివంగి అడిగాడు మస్తాన్.

"ఆ విగ్రహం కాలిపైన పడింది. ఎముక విరిగినట్లుంది. చాలా నొప్పిగావుంది!"

"లేవగలవా?" అడిగాడు విక్రం.

ఎలీజా ప్రయత్నించింది. కానీ ఆమెవల్ల కాలేదు.

మస్తాన్, విక్రం ఆమె రెక్కలు చెరోప్రక్క పట్టుకొని పైకిలేవదీశారు. ఆమె అడుగు వేసేందుకు ప్రయత్నించింది. కానీ తక్కున ముందుకు తూలిపడిపోయింది.

"ఈవిగ్రహానికి తోడు ఈమెనుకూడా మోసుకెళ్ళాల్సి వచ్చేట్లుంది. నావల్లకాదు!" అన్నాడు విక్రమ్.

"ఎలాగో తంటాలుపడదాం!" అన్నాడు మస్తాన్.

దూరంగా గుర్రాలు వస్తున్న శబ్దం వినవచ్చింది.

"కుక్కల్ని ముందుపంపి, గుర్రాలపైన వస్తున్నట్లున్నారు జిలాన్ మనుష్యులు. వాళ్ళ బారినుండి తప్పించుకోవడం కష్టం" అన్నాడు మస్తాన్.

"కష్టంకానిదేది. మనం చావడం తథ్యమని తెలిశాక బ్రతికి ఉన్నంత వరకు పోరాడదాం!" అన్నాడు విక్రం రివాల్వర్నిండా గుండ్లు నింపుతూ.

"ఈమెను ఏదైనా పొదలో పడుకో బెడదాం!" అన్నాడు మస్తాన్.

ఇద్దరూ ఎలీజాను యెత్తుకొని ముందుకు వెళ్ళారు. ఎత్తైన పొదలో ఆమెను పడుకోబెట్టారు. మస్తాన్ విగ్రహాన్నికూడా అక్కడే పెట్టాడు. విక్రమ్ వద్దని వారించి

దాన్ని తీసుకోమన్నాడు.

"అదెందుకు బరువు!" అన్నాడు మస్తాన్.

"వాళ్ళు బాణాలువేస్తే మనకి తగలకుండా తప్పించుకునేందుకు అది అడ్డన్నా వుంటుంది" అన్నాడు విక్రం.

గుర్రాలు దగ్గరకౌతున్నాయి.

మస్తాన్ కూడా రివాల్వరు సిద్ధం చేసుకున్నాడు. విక్రం సిద్ధంగా వున్నాడు. నాలుగు గుర్రాలు కనుపించాయి. రేచుకుక్కల్లా పొదలను చూసుకుంటూ వస్తున్నాయి.

ఉన్నట్లుండి గుర్రాలు ఆగిపోయాయి. వాటిపైనున్న ఆటవికులు క్రిందకు దూకారు. చచ్చిపడివున్న రెండు కుక్కల్ని తీసి గుర్రాలపైన వేసుకున్నారు. మళ్ళీ అంతలోనే పైకెక్కారు.

ఆ తర్వాత మెల్లగా గుర్రాలు నడపడం మొదలెట్టారు. ప్రతి పది అడుగులకు ఆగుతున్నారు. క్రింద ఏదో చూపిస్తున్నారు. ఆ తర్వాత మళ్ళీ బయలుదేరుతున్నారు.

తమ అడుగుజాడలకోసం వెతుక్కుంటున్నారనిపించింది మస్తాన్‌కు. మామూలు దోవ తప్పుకొని వచ్చినా వీళ్ళు యెలా ఇంత సులభంగా రాగలిగారో అర్థంకావటంలేదు.

మస్తాన్, విక్రమ్ ఒక పొదచాటున కూర్చుని గమనించసాగారు ఆటవికుల్ని. వాళ్ళు బాగా దగ్గరకు వచ్చేశారు. ఏదో చెప్పుకోసాగారు. వాళ్ళ భాష అర్థంకావటంలేదు. ఒక గుర్రానికి వేటకుక్కనొకదాన్ని పొడవుపాటి త్రాడుతో కట్టేశారు. అదే వాసన చూసుకుంటూ ముందు పరుగెత్తుతోంది. దాన్ని అనుసరించి గుర్రాలు పరుగెత్తసాగాయి.

ఎలీజాను దాచివుంచిన పొదదగ్గరకు చేరుకొన్నాయి గుర్రాలు. మస్తాన్‌కు జాలివేసింది.

"ఆమెను పాపం చంపుతారేమో?" మస్తాన్ అన్నాడు.

"నాకేం ఆమెపైన జాలిలేదు. ఆమెవంక చూచినా

సహించనన్నాడు ఫ్రేజర్. అప్పట్నించే నాకు ఆమెపైని అసహ్యం ఏర్పడింది. కాలు విరిగి ఎటూ నడవలేక వుంది. ఇంకా సేపట్లో మనం చచ్చేవాళ్ళమే. మన కళ్ళముందే ఆమెను వాళ్ళు చంపితే ప్రాణాలతో ఆమెను ఇక్కడ వదిలి వెళ్ళామన్న బాధ మనకుండదు'' అన్నాడు విక్రమ్.

''అలా మాట్లాడకు. ఆమె మనతో వచ్చింది. మనం ఆమెను వెంట తీసుకెళ్ళడం న్యాయం!'' అన్నాడు మస్తాన్.

''నువ్వు తీసుకెళ్ళు. నాకేం తెలీదు'' అన్నాడు విక్రం.

గుర్రాలమీదనుండి దిగిన ఆటవికులు కాసేపు ఆ పొద దగ్గరే తచ్చాడారు. ఆ తర్వాత అక్కడ్నుంచి ముందుకు బయలుదేరారు.

''ఎలీజాను ఏమీ చేసినట్లులేదు!'' అన్నాడు విక్రమ్.

''చచ్చిపోయిందనుకున్నారేమో?''

''అదృష్టవంతురాలు.''

''వాళ్ళు మనవైపు వస్తున్నారు'' అన్నాడు మస్తాన్.

''గుర్రాలను కాల్చొద్దు! మనుషులకే గురిపెట్టు. అనవసరంగా గుండ్లు వేస్టు చెయ్యవద్దు'' చెప్పాడు విక్రమ్.

ఇద్దరు పొదవెనుక నిలబడ్డారు. గుర్రాలను తమ రివాల్వర్ల రేంజిలోకి రానిచ్చి ఒకేమారు కాల్చారు. ముందు గుర్రాల పైనున్న ఇద్దరూ నేలకూలారు. వెనుకనున్న ఇద్దరివద్దనుండి వర్షంలా పొదమీద కురిశాయి విషం పూసిన బాణాలు. ఒక బాణం విక్రమ్ ఎడం భుజంలో గ్రుచ్చుకుంది.

''అమ్మా!'' అనుస్తూ క్రింద కూలబడ్డాడు.

''ఏమయింది?'' అడిగాడు మస్తాన్.

''బాణం గ్రుచ్చుకుంది'' అన్నాడు తన దగ్గరున్న రివాల్వర్ను మస్తాన్కు అందిస్తూ.

మస్తాన్ రెండు చేతులలో రెండు రివాల్వర్లు పుచ్చుకున్నాడు. వంగి క్రింద కూర్చుని, మిగిలిన ఇద్దరికీ గురిచూసి కాల్చాడు. వాళ్ళుకూడా క్రిందకూలారు. గుర్రాలు పిచ్చెత్తినట్లు పరిగెత్తడం ప్రారంభించాయి.

విక్రమ్ భుజంవద్ద కత్తితో కోశాడు. విషం శరీరంలోకి ఎక్కకుండా భుజంచుట్టూ ఘట్టిగా చేలిగుడ్డతో కట్టు కట్టాడు.

"లేవగలవా?" అడిగాడు మస్తాన్.

"నీరసంగా వుంది!" అన్నాడు విక్రమ్.

అతన్ని లేవదీశాడు. అతని చెయ్యి తన మెడచుట్టూ వేసుకుని విగ్రహాన్ని రెండో చేత్తో లాక్కుంటూ ఎలీజాను దాచిన పొదదాకా వెళ్ళాడు. విగ్రహాన్ని, విక్రంను అక్కడ వదలిపెట్టి గుర్రాలకోసం పరుగెత్తాడు.

అతికష్టంమీద ఒక గుర్రాన్ని పట్టుకున్నాడు. దీన్ని మెల్లగా లోబరుచుకుని పొదదగ్గరకు లాక్కొచ్చాడు. ఎలీజాను దానిపైకెక్కించాడు. విగ్రహాన్ని పట్టుకోమని చెప్పాడు. తనుకూడా పైకెక్కి, విక్రంను వెనుక వేపుకు లాక్కున్నాడు. గుర్రాన్ని అదిలించాడు. అది ముందుకు కదలకుండా మొరాయించింది. కాళ్ళతో ప్రక్కలమీద తన్నాడు. గుర్రం ముందుకురికింది.

ఇంక సులభంగా ఎడ్సేటుదాటి పోగలననిపించింది మస్తాన్కు. ఒక మైలుదూరం ముందుకు వెళ్ళాడు. అంతా ఒకలాగే కనుపించసాగింది. ఎటుపోతే నది వొడ్డుకు తను పోగలుగుతాడో అర్థంకాలేదు.

"విక్రం బ్రతుకుతాడా?" అడిగింది ఎలీజా.

"మరో గంటలో డాక్టరుకు చూపించగలిగితే బ్రతకొచ్చు."

"మనం ఆలోగా ఈ ఎడ్సేటు దాటగలమా?"

"ఇంక ఏ విధమైన ఆటంకాలు లేకుంటే ఈ గుర్రం మీద వెళ్ళే అరగంటలో సులభంగా ఎస్టేటు దాటగలం. నదిఒడ్డుకు చేరితే చాలు మనం జయించినట్లే!"

"నన్ను వదలేసి వెళ్తారనుకున్నాను."

"అలా ఎప్పటికీ చెయ్యను. ప్రాణాలున్నంతవరకు రక్షించడమే నా ధ్యేయం. మనం ముగ్గురం తిరిగి వెళ్ళగలిగితే నాకానందంగా వుంటుంది" అన్నాడు మస్తాన్.

ఆకాశంలో బోంయ్‌మని శబ్దం చేసుకుంటూ ఎగురుతూన్న హెలికాప్టర్ కనుపించింది.

"అన్నీ అయినాయి. ఆఖరకు హెలికాప్టర్‌లో వచ్చారు మనల్ని చంపేందుకు" అన్నాడు మస్తాన్.

"ఆ జిలాన్ మనిషికాదు. ఇంతకన్నా మనల్ని అక్కడే చంపివేసి వుంటే బాగుండేదేమో?" అంది ఎలీజా.

"డబ్బున్నవాడు ఆడుకునే ఆట ఇది" అన్నాడు మస్తాన్ ఆకాశంకేసి చూస్తూ.

హెలికాప్టర్ క్రిందికల్లా వచ్చింది. ఢమఢమ మంటూ గుండ్లు పేలాయి. మస్తాన్ చాకచక్యంగా తప్పించుకుని గుర్రాన్ని దౌడు తీయించాడు. పదిహేను నిముషాలలో కొన్ని వేలగుండ్లు కురిశాయి హెలికాప్టర్‌లోంచి. మస్తాన్ తెలివిగా తప్పించుకుంటూ నదిఒడ్డుకు చేరాడు. కొయ్యబ్రిడ్జి కనుపించలేదు. తను దానికి బాగా దూరంగా వచ్చేననుకున్నాడు.

గుర్రం చుట్టూ ప్రదక్షిణం చెయ్యసాగింది హెలికాప్టర్. మస్తాన్ వెనక్కి తిరిగిచూశాడు. విషం ఒళ్ళంతా ఎక్కి నల్లగా మారిపోయింది విక్రమ్ ఆకారం. అతని ప్రాణవాయువులు ఎప్పుడో అనంతంలో కలిసిపోయాయి. హెలికాప్టర్ ఇంకా క్రిందకు రాసాగింది. నది నిండుగా వుంది.

గుర్రాన్ని అదలించాడు.

ఒక్క దూకు దూకింది గుర్రం నదిలోకి.

అక్కడే ఊబివుంది. గుర్రం, దాంతో పాటు తనూ, ఎలీజా, విక్రం శవం, అన్నింటినీ మించి విగ్రహం మెల్లగా లోనికి దిగబడిపోసాగారు. రక్షించేవాళ్లెవ్వరూ లేరన్న విషయం తెలిశాక ఓమారు కృష్ణుడి విగ్రహానికి నమస్కారం చేశాడు. ఎలీజాకూడా మనస్సులోనే తన దేవుణ్ణి స్మరించుకొంది.

—: ఐపోయింది :—

## సప్లిమెంట్ పోటీ

3, 4, 5, 6, 7 అంకెలను తీసుకొని, మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళలో పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితంపై వ్రాసి, దానితో 75 పైసల పోస్టలు స్టాంపులు జతపరచి, ఈనెల 30 వ తేదీలోగా మాకు చేర్చాలి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలువేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఒక ఏడాది పత్రిక లేదా సప్లిమెంట్ ఉచితంగా పంపుతాం. ఈ పోటీలో అందరూ పాల్గొనచ్చు.

ఒక్కొక్కరు 3 కూపన్లకు మించి పంపకూడదు. ప్రతి కూపనుకు 75 పైసల పోస్టలు స్టాంపులు పంపాలి. ఫలితాలు ఫిబ్రవరి '75 నెల 'అపన'లో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికీ సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈనెల 10 వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చును.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20-/లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్ డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులుకానివారు తమ సభ్యత్వ రుసుము పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో ప్రచురించబడతాయి.—ఎడిటర్.




# ఏడవ భాగము

నాయకుడి పెళ్లాం, మొగుడితో ఏదో గునిసింది. అతను గింజుకున్నాడు. ఆమె వదలలేదు. కోపంగా ఏదో అరచి వెళ్ళి దూరంగా కూర్చుంది. నాయకుడు ఆమె దగ్గరకు వెళ్ళి ఏదో చెప్తున్నాడు. ఎంత తంటాలుపడ్డా ఆ భాష మాకు అర్థం కావటం లేదు.

ఆ నాయకుడు మళ్ళీ చెప్పాడు. ఇద్దరు మనుషులు నా దగ్గరకొచ్చారు. బొక్కా పట్టుకుని లాగారు. చిరిగిపోయేట్టుంది.

ఏంకావాలని సైగ చేస్తూ అడిగాను.

తీసెయ్యమన్నారు. వాళ్ళను మౌనంగా చూడమని, కట్లు విప్పించుకుని బొక్కా తీశాను. పాంటు కూడా తీసెయ్యమన్నారు. తప్పేదిలేదు దాన్ని తీసిపారేశాను. బనీను, డ్రాయరు వున్నాయి.

అవికూడా తియ్యమన్నారు. నాకు వాళ్ళముందు

నుండి మొలతో నిలుచునేందుకు సిగ్గేసింది. కాని చెప్పి నట్లు చెయ్యకుంటే ఏం గొడవ చేస్తారోనన్న భయంతో అవికూడా తీసేశాను.

నన్ను తీసుకెళ్ళి మళ్ళా తీగలతో చెట్టుకు కట్టేశారు.

నాయకుడి పెళ్ళాం నా దగ్గరకొచ్చింది. ఎక్రటి నా శరీరంకేసి తదేకంగా చూడసాగింది.

వేలితో నా గుండెలమీద తాకిచూసింది.

నాకు చచ్చేంత సిగ్గేసింది.

ఈలోగా వాళ్ళు డెల్లానుకూడా నగ్నంగా నిలుచుండబెట్టారు.

నా దగ్గరనుండి డెల్లావైపు నడిచింది. డెల్లా తొడల్ని, రొమ్ముల్ని, భుజాల్ని తదేకంగా తాకుతూ, రుద్దుతూ, చూస్తూ ఐదునిముషాలు గడిపింది. ఆ తర్వాత భర్తదగ్గరకు వెళ్ళి ఏదో చెప్పింది.

అతను పెద్దగా నవ్వాడు.

లేచి నా ముందుకొచ్చాడు. చేతులు త్రిప్పుతూ, ఆడిస్తూ సైగలుచేస్తూ ఏమేమో చెప్పాడు. ఆ తర్వాత అనుచరుల్ని వెంటపెట్టుకొని అడవిలోకి దారితీసాడు. మగ వాళ్ళంతా వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళగానే ఆడవాళ్ళంతా వెలుపలికొచ్చారు. మొత్తం పదిమందికూడా లేరు. యాభైమందికి పదిమంది.

అంటే వీళ్ళల్లో ఒక్కో మగవాడికి ఒక్క ఆడదన్న నియమం వుండి వుండదనిపించింది. నాయకుడికి మాత్రం ఒక్కతెను వదలి మిగిలిన వాళ్ళను అంతా ఇష్టమొచ్చినట్లు అనుభవిస్తుంటారు.

“మనల్నేం చేస్తారు వీళ్ళు?” అడిగింది డెల్లా, బాగా సిగ్గుపడిపోతూ.

"వాడేదో చెప్పి వెళ్లాడు. నాకు అర్థంగాలేదు" అన్నాను.

"ఇలా బట్టలువిప్పి కట్టివేయడం ఎందుకు. ఆ నాయకుడి పెళ్లాం ఎందుకలా పరిశీలించి వెళ్ళింది?"

"వాళ్ళంతా నల్లగావున్నారు. మనం ఎర్రగావున్నాం. అదికూడా వీళ్ళకి విచిత్రంగా వుండివుంటుంది."

"మనల్ని చంపుకుని తింటూరా?"

"తిన్నా విచిత్రం లేదు. వీళ్ళకు అలాంటి అలవాట్లున్నాయి" అన్నాను.

"మనం తప్పించుకునే మార్గమేమన్నా తోస్తుందా" అడిగింది డెల్లా.

"మన తుపాకులు వాళ్ళదగ్గరున్నాయి. అవి చిక్కించుకుంటే వాళ్ళను మనం బానిసలుగా వాడుకోవచ్చు" అన్నాను.

ఆడవాళ్ళంతా మా చుట్టూ గుమిగూడారు. అంతా మంచి యవ్వనంలో వున్న వాళ్ళే. ముసలివాళ్ళొక్కరూ లేకపోవడం నాకు విచిత్రంగా తోచింది. పసిబిడ్డలుకూడా ఎవ్వరూలేరు. విచ్చలవిడిగా తింటూ, తిరుగుతూ సెక్స్ అనుభవిస్తుండే వీళ్ళల్లోకడుపుతోవున్న ఆడదికూడా కనీసం ఒక్కతికూడా కనుపించకపోవడం నన్నాశ్చర్యంలో ముంచెత్తింది.

ఆడంగులు నన్నూ, డెల్లాను, చేతుల్తో తాకుతూ, నానాచేష్టలు చేస్తూ ఏవోమో చెప్పుకుంటూ నిలుచున్నారు.

నాయకుడి పెళ్లాం ఏదో చెప్పింది. అందరూ దూరంగా వెళ్లారు. ఏం జరగబోతుందో నా కర్థంకాలేదు.

ఆమె నా దగ్గర కొచ్చింది. మిగిలినవాళ్ళు దూరంగా వున్నారు. నన్ను, చెట్టునూ కలిసి పట్టుకుంది ఘట్టిగా.

రాళ్ళలాంటి రొమ్ములు నా గుండెలకు గుచ్చుకున్నాయి.

భుజంమీద కొరికింది. ఆమె పళ్లు అరంగుళాల లోతుకు దిగాయి.

'అమ్మో' అని పెద్దగా అరిచాను. నా కళ్లు నీళ్ళు క్రమ్మాయ్. ఆ బాధకు వొళ్ళంతా వొణికిపోయింది.

ఆమె విచిత్రంగా నాకేసి చూసింది. ఆడవాళ్ళంతా ముసిముసిగా నవ్వసాగారు.

ఆమె తన మొలకున్న ఆకుల్ని విప్పి దూరంగా పెట్టింది. మళ్ళీ దగ్గరకొచ్చింది. అప్పటికామె ఎందుకలా నాపైన పడుతుందో అర్థమయింది.

భాష ఏదయినా, మనిషెక్కడ పుట్టినా, నాగరికత పెరిగినా, తరిగినా, కోరికల రూపం, భావం ఒక్కటే.

డెల్లా ఈ గొడవ చూడలేక కళ్లుమూసుకుంది.

నాయకుడి పెళ్లాం దగ్గరికంటూ వచ్చింది. ఆమె తొడలు నా తొడలకు తగిలాయి. చేతులు భుజాలపైన పడ్డాయి. నడుం నడుంకు ఆనింది.

కుడికాలు మెల్లగా వంచి, పైకెత్తి మడచాను. మోకాలితో బలంగా ఒక్కతన్ను తన్నాను.

దెబ్బకు దూరంగా వెళ్ళి వెల్లికింతలా పడింది.

దూరంగావున్న ఆమె మనుషులు ఇది గమనించారు. వడివడిగా వచ్చి ఆమెను పట్టుకుని పైకి లేవనెత్తారు. ఆమె దెబ్బతిన్న పులిలా నాకేసి చూసింది.

లేచి నిలుచుంది. పెద్దగా అరుపులు పెట్టింది. నా మీదకు దూకబోయింది. వాళ్ళంతా ఆమెను పట్టుకున్నారు ఘట్టిగా. వెనక్కి లాక్కుపోయారు.

నవ్వుకున్నారు జరిగిన దానికి.

"ఎందుకలా చేశావ్! అది దాని మొగుడితో చెపుతుందేమో తన్నావని" అంది డెల్లా నాతో.

“చెప్పనీ! ఇష్టంలేనిపని ఎలా చెయ్యడం. అయినా రక్తం కారేట్లు కొరికింది” అన్నాను.

“ఏది తెలిసినా తెలీకున్నా, ఇదిమాత్రం తెలుస్తుంది మనుషులకు” అంది డెల్లా.

“అదే నాకు విచిత్రంగావుంది. వీళ్లు సామాన్యంగా పరాయిజాతితో సెక్సు అనుభవాలకు సిద్దపడరు. ఈమె ప్రవర్తన వింతగావుంది. ఇంతకుముందు మనతోటి ఫారినర్స్‌తో అనుభవం పొంది వుండాలి_ అదీ మొగుడికి తెలీకుండా. లేకుంటే నన్ను చూచింది మొదలు ఎక్సయిట్ అవుతూనే వుంది” అన్నాను.

“మిగతా ఆడవాళ్లు చెప్పరా?”

“ఏమో! అంత రహస్యంగా ఉంచుదామనుకున్నారేమో?”

“మనం ప్రాణాలతో బయటపడే అవకాశముంటే నువ్వామెను అనుభవించినా నేను తప్పుపట్టను. అమాటే చెప్దామనుకున్నాను ఇంతకుముందునుంచి” అంది డెల్లా.

నేనేం మాట్లాడలేదు. ఆలోచనతో బుర్ర వేడెక్కిపోసాగింది.

కాలం మెల్లగా నత్తనడక నడుస్తోంది ముందుకు.

మిట్టమధ్యాహ్నం ఎండ మండిపోతున్నా, చెట్టుక్రింద ఉండటంవల్ల నాకు చల్లగానే వుంది. కానీ నన్ను కట్టివేసిన తీగలు చేతులు కదలించినప్పుడల్లా శరీరానికి గీచుకుని బాధపెడుతున్నాయి. ఆ తీగలకు ముళ్ళలాంటివేవో ఉన్నాయి.

ఆకలిగూడా ప్రారంభమయింది. మేము తెచ్చుకున్న పాకెట్ వాళ్లే లాగేసుకున్నారు.

“ఆకలిగావడంలేదూ!” అడిగాను డెల్లాను.

“అవుతూంది. ఏం లాభం?” అంది నిరాశగా.

ఖైదీగా బ్రతకకూడదన్న నిశ్చయంతో, ప్రభుత్వపు ఖైదులోంచి ప్రాణాలకు తెగించి, పారిపోయి వచ్చాను. అడుగడుగునా ఎవరికో ఒకరికి ఖైదీగా చిక్కిపోతూనే ఉన్నాను. అక్కడ ప్రాణంపోతుందన్న భయంలేదు. కానీ తప్పించుకొచ్చాక దినదినగండం నూరేళ్ళ ఆయుష్షులా తయారయింది నా పరిసితి.

ఆకలి నుంచీ ఎక్కువున్న దప్పిక ఎక్కువయింది. ఎండ ఎక్కువగా ఉండటం, గాలిలో తేమ లేకపోవటం, నిలువ గాళ్లసేవ చేయడం, నన్ను క్రుంగదీస్తున్నాయి.

లోనికి వెళ్లిన ఆడవాళ్లెవరూ మళ్ళీ వెలుపలకు రాలేదు. ఎవరన్నావస్తే కాసిని నీళ్లు తెచ్చిపెట్టమందామనుకుని కాచుకున్నాను. ఎవ్వరూ వచ్చేజాడ కనపడలేదు.

ఇక లాభంలేదని నేనే పెద్దగా అరచాను. ఆ కేక వినిపించిందో లేదో గానీ, ఎవ్వరూ రాలేదు.

రెండు నిముషాలాగి మళ్ళీ పెద్దగా పొలికేక పెట్టాను.

రెండోకేక వినిపించినట్లుంది. లోపల్నుండి నాయకుడి భార్య వెలుపలకువచ్చి మాకేసి చూసింది.

ముందుకు నడచివచ్చి, నాకు కొద్దిదూరంలో నిలుచుంది.

ఎందుకరుస్తావన్నట్లు చేతులు త్రిప్పింది.

ఆకలవుతోందని సైగచేసి చెప్పాలనుకున్నాను. కానీ చేతులు కట్టివేసి వున్నాయి. నా అవసరం ఆమె కెలా చెప్పాలో అర్థంకాలేదు.

ఆమెను దగ్గరకు రమ్మని కళ్ళలో సైగ జేశాను. కదలి నాముందుకొచ్చిందామె. ఆకలవుతుందన్నట్లు పొట్టకేసి చూపించాను కళ్లతోనే.

అర్థమయిందో, లేదో గాని ఏదో చెప్పింది. ఆ భాష తెలీలేదు.

లోనికి చకచక నడచివెళ్ళింది. మేము కట్టి తెచ్చుకున్న పాకెట్ తెచ్చి విప్పింది. అందులోంచి బ్రెడ్ తీసింది. కాగితం వేరుచేసి లోనున్న ముక్కల్ని రెండుతీసి నోట్లో పెట్టుకుంది. కాసేపు నమిలి అసహ్యించుకుంటూ ఉమ్మేసింది. మిగిలింది తెచ్చి నానోట్లో పెట్టింది. మెల్లగా నమలసాగాను.

డెల్లా నావైపు ఆశగా చూసింది.

ఆమెకూ కూడా రెండుముక్కలిమ్మనట్లు కళ్ళతోనే సైగ జేశాను. నాయకుడిభార్యకు నేను చెప్పింది అర్థమయినా గమనించనట్టుగానే నిలుచుంది. నేను తినడం పూర్తి చేశాను. ఇంకొన్ని ముక్కలు నానోట్లో పెట్టింది. చాలన్నాను.

తెచ్చిన పాకెట్ తిరిగి లోనికి తీసుకెళ్ళింది. వెదురు బొంగులాంటి దాంట్లో నీళ్లు తెచ్చి నా నోటిముందు పెట్టింది త్రాగమన్నట్లు. ఆమె అభిప్రాయం అర్థంచేసుకుని త్రాగాను.

కావాలనే ఆమె డెల్లాకు ఏమీ ఇవ్వడంలేదు. నాకు చాలా బాధగా వుంది. వెదురుగొట్టంతీసి దూరంగా పారేసింది.

ఆడవాళ్ళకు ఒకరిని చూస్తే మరొకరికి గిట్టదనే నానుడి ఇక్కడా నిజమయినందుకు, నవ్వాలో, డెల్లా ఆకలితో దాహంతో అల్లాడిపోతున్నందుకు ఏడవాలో తెలియలేదు.

నాయకుడిభార్య నడుంచుట్టూవున్న ఆకుల్ని మళ్ళీ తప్పించింది. నా దగ్గరగా వచ్చింది. తన శరీరాన్ని, నాకేసి అదుముకుంది. చేతులతో నన్ను కౌగలించుకుంది. ఈ సారి నేను అభ్యంతరం చెప్పలేదు.

నానుండి దూరంగా జరిగింది నాయకుడిపెళ్ళాం. కట్లు చకచక విప్పింది. చెయ్యిపట్టుకుని గుడిసెవేపు రమ్మంటూ

లాగింది. వెనక్కి చూడకుండా వెంటవెళ్లాను. లోని కెళ్లాం.

నేను గదంతా కళ్ళతోనే సర్వే చేశాను. మా తుపాకులు మూలగావున్నాయి. మేము తెచ్చుకున్న ఫుడ్ పాకెట్ కూడా అక్కడేవుంది.

నేను ఒక్క ఉదుటున వెళ్ళి మూలనున్న తుపాకులను తీసుకున్నాను. ఫుడ్ పాకెట్స్ బట్టలుకూడా తీసుకున్నా. ఆమె నేను ఏంచేస్తున్నదీ గమనించింది. పెద్దగా కేకలు పెట్టింది. బిలబిలమంటూ చుట్టూవున్న గుడిసెల్లోంచి ఆడవాళ్లొచ్చారు. అందరు గుమ్మానికి అడ్డంగా నిలబడ్డారు. నాయకుడి పెళ్ళాంకూడా వెళ్లి వాళ్లముందు నిలబడింది.

ఒక తుపాకీ తీసి భుజానికి తగిలించుకున్నాను. రెండోది వాళ్ళకేసి గురిపెట్టాను.

వాళ్లు ఏదో అరుస్తూ చెప్పారు. నాకర్థంకాలేదు. వాళ్ళు చేతితోచేసే సైగల్ని బట్టి తుపాకులు అక్కడ వదిలి వెలుపలకు రమ్మంటున్నారని అర్థం చేసుకున్నాను.

అందర్నీ అడ్డం తప్పుకోమని, లేకుంటే నిలువునా కాల్చిపారేస్తానని సైగచేసి చెప్పాను. వాళ్ళకు అర్థమయినట్టు లేదు.

అసలు తుపాకీ మనుషుల్ని చంపుతుందో లేదో కూడా వాళ్ళకు తెలీదనిపించింది. నాదగ్గరున్న ఆయుధం తడాఖా చూపిస్తే తప్ప నన్ను వెలుపలకు వెళ్ళనివ్వరన్న విషయం విశదమైంది.

నాకు అనవసరమైన ప్రాణహింసన్నా, అమాయకులను హత్యచెయ్యాలన్నా ఇష్టం వుండదు. కానీ ఇప్పుడు ఒకర్ని చంపక తప్పదు.

భగవంతుడికి మనస్సులోనే క్షమాపణ చెప్పుకుని తుపాకీ గురిపెట్టి కాల్చాను. గుంపులోని ఒక మనిషికి

గుండుదెబ్బ తగిలింది. 'అబ్బా' అని పెద్దగా అరచి కూలి
పోయింది. అందరూ ఆమెచుట్టూ చేరారు. వాళ్ళ కళ్ళ
ముందే కాళ్ళు చేతులూ గిలగిల కొట్టుకుని కాసేపు గింజు
కుని చచ్చిపోయింది.

అందర్నీ దూరంగా పొమ్మని అరచి చెప్పాను చేతు
లూపుతూ.

వెంటనే అందరూ గుమ్మం దగ్గరనుండి కదలిపోయారు.

నేను తిన్నగా వెలుపలి కొచ్చాను. పరుగెత్తుకొని
పోయి డెల్లా కట్లు విప్పాను.

"లోపలేమయింది?" అడిగింది డెల్లా తీగల్ని దూరంగా
పారేస్తూ.

"త్వరగా పద! మనం ఆపదలో వున్నాం. ఇక్క
డ్నుంచి దూరంగా వెళ్ళిపోవాలి!" అన్నాను, బట్టలు
వేసుకుంటూ. డెల్లాకూడా క్షణంలో బట్టలు తొడుక్కుంది.

ఇద్దరం చెట్లల్లోపడి స్పీడుగా పరుగెత్తాం. ఎటు
పోతున్నామో, ఎందుకు పోతున్నామో అర్థంలేనట్లు పరుగు
పెట్టాం. ఒక మైలుపోయాక ఆగాం. ఫుడ్ పాకెట్ డెల్లా
కిచ్చి తినమన్నాను. చెట్టు నీడన కూర్చుని తినింది.

తాపీగా జరిగిందంతా చెప్పాను.

అంతా విని "ఆ నాయకుడు, వాడి ముఠా తిరిగిరాగానే
అసలు సంగతి తెలుసుకొని మనకోసం వేట మొదలెడు
తారు. ఈమారు చిక్కామంటే చితకబాదుస్తారు బరి
సెల్తో" అంది నిరుత్సాహంగా.

"ఇప్పుడు మనదగ్గర తుపాకులున్నాయి. దగ్గరకొచ్చా
రంటే కాల్చిపారేస్తాం. ఒక్కడ్ని చంపామంటే కాలికి
బుద్ధిచెపుతారు" అన్నాను.

"ఏమో?" అంటూ చుట్టూ చూసి "దాహంగా వుంది.
ఇక్కడేమైనా చుట్టుప్రక్కల నీళ్ళు దొరికే అవకాశం

వుంటుందా?'' అంది.

''చూద్దాం పద!'' అంటూ లేచాను.

''నువ్వెళ్ళి చూడరాదు. నాకు కాళ్ళు పీకుతున్నాయి'' అంది డెల్లా.

అలా ఆమెను ఒంటరిగా వదలిపోవడం ఇష్టంలేదు. నేనటు వెళ్ళగానే ఆ ముఠా వెళ్ళేవరన్నా వచ్చారంటే ఆమె మళ్ళీ చిక్కిపోతుంది.

నా భయం అనుమానం వ్యక్తం చేశాను. తుపాకీ తన కిస్తే చాలంది. అలాగే ఇచ్చాను. అయినా ఆమెను ఒంటరిగా వదలి వెళ్ళేందుకు మనస్కరించలేదు. ఆమెను మెల్లగా లేవదీసి నడిపించుకుంటూ బయలుదేరాను. చెట్ల చాటున, పరిశీలించి చూస్తూ పోయాను. ఎక్కడా నాకు నీళ్ళున్న జాడ కనిపించలేదు.

అప్పటికి అరమైలు పైగా నడిచాం.

డెల్లా తను ఇంక ఒక్క అడుగు ముందుకు వెయ్యలేనంటూ చప్పలా కూలిపోయి కూర్చుంది. నేను ఆమె వెంట కూర్చున్నాను. నా తొడపైన తలపెట్టుకుని పడుకుంది డెల్లా.

ఎవరైనా వస్తారేమోనని చెవులు రిక్కించి వినసాగాను. మమ్మల్ని బందీలుగా పట్టుకెళ్ళిన గుంపు అడవిలోంచి తిరిగి సాయంత్రందాకా రారన్న ధైర్యంవుంది నాకు. ఈలోగా ఈ దీవిలోంచి తప్పించుకునే మార్గం చూసుకోవాలి. వాళ్లొచ్చిందాకా వుంటే అనవసరంగా వాళ్ళ ప్రాణాలు తీయడమూ, మా ప్రాణాలు పోగొట్టుకోవడమూ లాంటి విపరీతాలు జరుగుతాయి. అలా జరగనివ్వ దలచుకోలేదు.

—(సశేషం)

# జోకర్ పేజి వినోదం

## 42

టీచర్:- ఒరే. రామూ! భూమి తనచుట్టు తాను తిరుగుటకు ఎంత టైం పడుతుందిరా?

రాము:- (తల గోక్కుంటూ) హుఁ! హుఁ! నాకు తెలియదు సార్?

టీచర్:- ఈ విషయం తెలియదేంట్రా! 24 గంటలు. సరే నీవొక్క ప్రశ్న వెయ్యరా! నేను సమాధానం చెప్పలేనటువంటిది.

రాము:- మీరు కొట్టగూడదు సార్?

టీచర్:- సరేలేరా, చెప్పు?

రాము:- గొంతు వరకు వున్న ఊబిలో మిమ్మల్ని దిగేపి. పైన పెద్ద రాయి వేస్తే ఎలా తప్పించుకుంటారు సార్?

టీచర్:- ? ? ?

—హవంతి రఘువిమలప్రసాద్, బోర్గాం.

## 43

స్కూలుకు ఇన్‌స్పెక్టరు వస్తాడని మాష్టారు "దొంగతనము చేయరాదు" "అసత్యమాడరాదు" అను అట్టలను గోడలకు అతికించాడు.

తీరా ఇన్‌స్పెక్టరు వచ్చే టైముకి కొంటె పిల్లలు వాక్యాలలో ఆఖరి అక్షరాన్ని చెరిపి వేశారు. మిగిలినది చదివి ఇన్‌స్పెక్టరు బిత్తర పోయాడు.

—సి. దాక్షాయణి, విజయవాడ.

